# చి ర కు మా ర స భ

[ న వ ల ]



రవీంద్రనాథ ఠాగూరు

జ య ం తి ప బ్లి కే ష న్సు,
గోపాలరెడ్డి రోడ్ : : విజయవాడ-2.

ముద్రణ:
అక్టోబరు '64
రు. 4-00

ప్రింటింగ్:
విక్టరీ ప్రెస్,
విజయవాడ-1

అనువాదం:

కె. రమేశ్

సంపాదకులు:

యం. పెరుమాళ్లు

జగత్తారిణీదేవి హిందూ వితంతు స్త్రీ. ఆమెకు నలుగురు కుమార్తెలు. ఒకామె శైలబాల, ఆమె వితంతువు. రెండో ఆమె పురబాల, ఆమె భర్తపేరు అక్షయకుమార్. మిగిలిన ఇద్దరు కుమార్తెలు నృపబాల, నీరబాల అవివాహితులు.

అక్షయకుమార్ యొక్క రీడింగురూములో అతను, అతని భార్య పురబాల కూర్చొని మాట్లాడుతున్నారు. అక్షయకుమార్ వ్యంగ్యంగా మాట్లాడుతాడు, మాట మాటకు కవిత్వం చెపుతూ ఉంటాడు.

"మీ చెల్లెళ్ళేగనుక అయితే ఇలా చీమకుట్టినట్లయినా లేకుండా కూర్చునేవారా? ఇప్పటికి ఒక్కొక్కరికి నలుగురైదుగురు వరుల్ని చూచివచ్చేవారు. మా చెల్లెళ్ళు గనుక మీరు ..." అని పురబాల మాటను మధ్యలోనే ఆపివేసింది.

అందుకు అక్షయకుమార్ ఇలా అన్నాడు– "మానవ స్వభావ స్వరూపాలు నీకు బాగుగా తెలుసు. తన చెల్లెలికి తన భార్య చెల్లెలికి మధ్య ఉండే తేడానుకూడా ఇంత చిన్న వయస్సులోనే అర్థం చేసుకోగలిగావు. ఇదుగో, మామగారి అమ్మాయిల్ని పరాయివాళ్ళ చేతుల్లో పెట్టటానికి నేను సిద్ధంగాలేను. ఈవిషయంలో నాలో ఉదార గుణము లేదని అంగీకరించక తప్పదు."

"మీతో నేనొక ఏర్పాటు చేసుకోవాలి" అని అంది పురబాల.

"స్థిరమైన ఏర్పాటొకటి మంత్రాలు చదివి వివాహం రోజునే జరిగిందికదా; ఇప్పుడు మరొకటా?" అని అడిగాడు అక్షయకుమార్.

"ఇది అంత భయంకరమైనది కాదు. అంత దుస్సహమైనదికూడా కాకపోవచ్చు."

"సఖీ, అదేమిటో స్పష్టముగా చెప్పరాదా!

మనసులోని ఆలోచన లేమిటో,
స్పష్టముగా వివరించుము లలనా!
ఈ సజల నయనాలలో
దాగియున్న దేవిషయం?"

"గాయకశిఖామణీ, ఆపండి. నేను మీతో ముఖ్యమైన విషయం ఒకటి మాట్లాడదలచాను. మీరు వ్యంగ్యంగా మాట్లాడటం మానుకొని ఏదో ఒక సమయం నిర్ణయిస్తే ఆవిషయం మాట్లాడతాను."

"భార్యకు మాట ఇస్తే తరువాత ఆమె అకస్మాత్తుగా బాహుబంధాలు ఎక్కడ అడుగుతుందోనని దరిద్రునిభయం.

సఖీ, నా మనస్సునే కోరెదనో,
ఇదే భయం, మనసులోని భయం ఇదే!
నీ రూపం నా నయనాలను
బంధించునో ఏమో,
కనులు తెరిచి చూడబోను."

"హాండి" అని అంది పురబాల చిరుకోపా న్నభినయిస్తూ.

"వద్దు, వద్దు, కోపగించుకోవద్దు. నువ్వు చెప్పినట్లే వింటాను. రిజిష్టరులో పేరు వ్రాయించుకొని 'పరిహాస నివారణ సమితి' లో సభ్యుడుగా చేరతాను. నీ ఎదుట ఏమీ అమర్యాదగా ప్రవర్తించను. సరే, ఇప్పుడు మనము మాట్లాడుతున్న విషయం ఏమిటి? మరదళ్ళ వివాహాన్ని గురించేగదూ! మంచిపనే" అని అన్నాడు అక్షయకుమార్.

భర్తమాటలు విని పురబాల ఇలా అంది—"ఇప్పుడు నాన్నగారు బ్రతికిలేరు. అమ్మ మీమీద ఆశపెట్టుకొని ఉంది. మీమాటవినే ఆమె ఇంతవయస్సు వచ్చేవరకు ఇద్దరు కుమార్తెలనూ చదివిస్తూ ఉంది. అలాంటప్పుడు తగినసంబంధాలు చూడవలసినబాధ్యత మీది, ఆవిధంగా జరగనియడల ఎంత అన్యాయమో మీరే ఆలోచించండి."

"ఆవిషయంలో మీరేమీ విచారించవద్దని నేను నీతో ఎప్పుడో చెప్పాను. నా ముద్దుల మరదళ్ళ భర్తలు గోకులంలో పెరుగుతున్నారు" అన్నాడు అక్షయకుమార్.

"గోకులం ఎక్కడ?" అని అడిగింది పురబాల.

"అదే, మా బ్రహ్మచారిసంఘము. ఈ దురదృష్ట వంతుడు నీకు లభించింది అక్కడేగదా!" అని అన్నాడు అక్షయ్.

"వాళ్ళందరూ సృష్టికర్తకే వ్యతిరేకులుగదా! ఎలా?" అని అడిగింది పురబాల.

"దైవంతో యుద్ధంచేసి ఒడ్డు చేరుకునేదెలా? వారికి

చెప్పాలే ఏకైకదైవము. అందుకే బ్రహ్మదేవుడు ఆసంఘము వైపు ఎక్కువ మొగ్గుచూపుతున్నాడు. మాత వేసిన కుండలోపల మాంసం నెమ్మదిగా ఉడుకుతూ ఉన్నట్లే ప్రతిజ్ఞాభారంతో అణగిపోయిన సభ్యులు ఎముకలవరకు పూర్తిగా మెత్తబడిపోయారు — ప్రతిజ్ఞే వివాహయోగ్యమై వచ్చింది — ఇక సాష్టాంగపడక తప్పదు. నేనుకూడా ఒకప్పుడు ఆ సంఘాధ్యక్షుడనేగదా!"

"మీ పరిస్థితి ఏమయింది?"

"దానిని మళ్ళీ ఏమని చెప్పను! 'స్త్రీ' అనేమాట పలకకూడదని ప్రతిజ్ఞ; కానీ చివరికి శ్రీకృష్ణ భగవానుని పదహారువందల గోపికలతో సాధ్యంకాకపోయినా కాళీ మాతయొక్క అరువదినాలుగు వేల యోగినీలతోనైనా సరే అంటుచిక్కితేచాలు. పొట్టనిండుగా ప్రేమించాలని మనసులో కోర్కె కలిగింది—సరిగ్గా ఆ దేసమయంలో నీదర్శనమయింది, అంతే!"

"అరువది నాలుగు వేల సందేహం తీరిందా?"

"ఇప్పుడిక ఆవిషయాలు నీతో చెప్పను. గర్వం వస్తుంది. అయితే, ఆ కాళీమాత తప్పక కరుణించిందని మాత్రం చెప్పదలచాను."

"ఆ భోలాశంకరునివద్ద నంది, తుమ్మెదలు అనేకం ఉన్నాయి, అవే నాయందు దయచూపించి ఉంటాయని నేనూ అనుకొంటున్నాను."

౧.౨ "అదే జరిగింది, అందుకనే కార్తికేయస్వామికూడా లభించాడు" అన్నాడు అక్షయకుమార్.

"అదుగో, మళ్ళీ పరిహాసాలు ప్రారంభించారు" అని అంది పురబాల.

"కార్తికేయస్వామి విషయాన్ని నువ్వు పరిహాసమని అనుకొంటున్నావా? శరీరాన్ని తాకి ప్రమాణం చేస్తున్నాను, అది నా మనస్సులోని విశ్వాసం" అన్నాడు అక్షయ కుమార్.

ఇంతలో జగత్తారిణిదేవి వితంతుకుమార్తె శైలబాల ప్రవేశించి "ముఖర్జీ మహాశయా, ఈసారి మీరు ఇద్దరు మర దళ్ళనూ రక్షించాలి" అని అన్నది.

"మరీ అంత రక్షణ లేదా! నే నున్నాను గదా! ఏం జరిగింది?" అని అడిగాడు అక్షయకుమార్.

"అమ్మగారి పోరుపడలేక రసికదాదా ఎక్కడి నుంచో ఉన్నత కుటుంబంలోని ఇద్దరు కుర్రాళ్ళను తీసుకు వచ్చాడు. వాళ్ళిద్దరికే తనకుమార్తెల నిద్దరినీ ఇచ్చి వివాహం చేయాలని అమ్మగారు నిశ్చయించుకుంది" అని చెప్పింది శైలబాల.

"ఆహా. భేష్! అకస్మాత్తుగా వివాహమనే అంటు జాడ్యమా! ప్లేగు మాదిరిగా ఉందే. ఒక ఇంటిలో ఒకేసారి ఇద్దరు కన్యలమీద ఆక్రమణా! తరువాత నాకుకూడా ఎక్కడ సోకుతుందోనని భయంగా ఉంది.

"నేను మరీ దగ్గరగా ఉన్నాను,
అందుకే చాలా విచారంగా ఉంది!
కన్నులుచేసే వాగ్దానాలనుంచి,
తప్పించుకోగలనో లేదో!"

# 10

అక్షయకుమార్ పాట ప్రారంభించేసరికి శైలబాల "ఇదేమిటి, మీరు పాటలుపాడే సమయమయిందా?" అని అడిగింది.

"ఏం చేయను? శహనాయి నేర్చుకోలేదు, లేకపోతే అదే ప్రారంభించేవాడిని. సరే, నువ్వన్నమాటేమిటి! శుభ కార్యముగదూ! ఇద్దరు మరదళ్ళ వివాహం! అయినా, ఇప్పు డంత తొందరేమొచ్చింది?" అని అన్నాడు అక్షయ కుమార్.

"వైశాఖమాసం వెళితే వచ్చేసంవత్సరం మంచి రోజులు లేవు" అని చెప్పింది శైలబాల.

"అక్కా, ముందే విచారం ఎందుకు? వాళ్ళిద్దరూ ఎవరో ఏమిటో మంచీచెడూ చూద్దాం" అని అంది పురబాల.

అదేసమయానికి జగత్తారిణికూడా "నాయనా, అక్షయ్" అంటూ ప్రవేశించింది.

"ఏమిటమ్మా?" అన్నాడు అక్షయ్ ఎంతో విన యంగా.

"నీమాటలు విని ఇంతకాలం పెళ్ళిళ్లు చేయకుండా అమ్మాయిల్ని ఇంట్లో కూర్చోబెట్టుకున్నాను, ఇక కుదరదు" అని అంది జగత్తారిణి.

"ఇక కుదరదు అని అమ్మాయిల్ని పారేసు కుంటారా?" అని అన్నాడు అక్షయ్.

"అనుగో, అదే. మీమాటలు వింటూ ఉంటే జ్వరంవస్తుంది. నాయనా అక్షయ్, శైల వితంతువు, ఆ మెను

ఇంత చదివించి ఏమి ప్రయోజనమో చెప్పు. ఆమెకు ఇంత చదువెందుకు?" అని అంది జగత్తారిణి.

అందుకు అక్షయకుమార్ ఇలా అన్నాడు- "అమ్మా, స్త్రీలకు ఏదో ఒక ఉపద్రవం ఉండాలని మన శాస్త్రములలో వ్రాసి ఉంది— అది భర్త కావచ్చు. విద్య కావచ్చు, లేదా హిస్టీరియా కావచ్చు. ఏదో ఒక అశాంతి అవసరం. ఉదాహరణకు లక్ష్మీదేవి భర్త విష్ణువు, అందుకని ఆమెకు విద్య అవసరంలేదు. ఆమె తన భర్తను, గుడ్లగూబను వెంట ఉంచుకొంటుంది; కానీ సరస్వతికి భర్తలేడు, కనుక ఆమెకు విద్య ఉంది."

"నువ్వేమైనా చెప్పు, వచ్చే వైశాఖమాసంలో అమ్మాయిలకు పెళ్లిచేయక తప్పదు" అని అంది జగత్తారిణి.

"అంతేనమ్మా, నా అభిప్రాయంకూడా అదే. ఆడపిల్లలకు వెంటనే పెళ్ళిచేసి వేయటమే మంచిది" అని పురబాల తల్లిని సమర్థించింది.

అక్షయకుమార్ అత్తగారికి వినబడకుండా "అపసవ్వను. శాస్త్రగ్రంథములలో ఒకరికంటె ఎక్కువమంది భర్తలను చేసుకోకూడదని నిషేధించారు గనుక వెంటనే వివాహంచేసి సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలి" అని అన్నాడు.

"ఏమిటామాటలు. అమ్మకు వినబడతాయి" అని పురబాల భర్తను మందలించింది.

"అమ్మా పురబాలా, రసికదాదా అబ్బాయిల్ని

చూపించటానికి తీసుకువస్తాము. వారికి కావలసిన ఏర్పాట్లు చూడు" అంది జగత్తారిణి కుమార్తెతో.

ఈమాట అని జగత్తారిణి అక్కడినుండి వెళ్లిపోతుంది. పురబాలకూడా తల్లి వెంట వెళుతుంది. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయిన తరువాత శైలబాల అక్షయకుమార్‌తో ఇలా అంది—"ముఖర్జీ మహాశయా, ఇక కాలయాపన చేయటం మంచిదికాదు. ఈసారి మీరు మీ బ్రహ్మచారి సంఘములోని విపినబాబును, శ్రీశబాబును మందలించకుండా పనిజరుగదు. ఇద్దరూ ఇద్దరే, ఎంతో మంచివాళ్లు. మన నృపకు, నీరోకు ఈజూజోడూ చక్కగా కుదురుతారు. చైత్రమాసం వెళ్ళేసరికి మీరు ఆఫీసు పనిమీద సిమ్లాకు వెళ్ళిపోతారు, ఇక అమ్మను మాయపుచ్చి ఆపటం కష్టమే."

"కానీ, అందుకోసమని మన సంఘుసభ్యుల్ని సమయం కనిపెట్టకుండా మందలిస్తే చేయి జారిపోతారు. పైపెంకు పగలగొట్టినంత మాత్రానే గ్రుడ్డులోనుంచి పిల్ల రాదు, దానికి తగిన వేడితగలాలి, అందుకు కొంత సమయం పడుతుంది" అని అన్నాడు అక్షయకుమార్.

"నిజమే, ముఖర్జీ మహాశయా, ఆ వేడి తగిలించే బాధ్యత నేను వహిస్తాను" అని అంది శైలబాల.

"అదేమిటో మరొకసారి స్పష్టంగా చెప్పు" అన్నాడు అక్షయకుమార్.

"అదే, పదవనంబరులో వారి సంఘుము ఉన్నది కదా? మన డాబామీదినుంచి 'హాస్య భవనము' దాటి ఆ ప్రదేశానికి బాగుగా చేరుకోవచ్చు. నేను పురుష

వేషంలో ఆ సంఘంలో సభ్యత్వం పొందుతాను. ఆ తరు వాత ఆ సంఘం ఎంతకాలం సాగుతుందో చూస్తాను" అని అంది శైలబాల.

"అలా అయితే నేనుకూడా మరొకజన్మ ఎత్తి మళ్ళీ ఆ సంఘంలో సభ్యుడుగా చేరతాను. ఒకసారి మీ దీదీ చేతుల్లో చెడిపోయాను, ఈసారి నీ చేతుల్లో చెడతాను. పెండ్లికానివాడుగా ఉంటే ఇదే హాయి, వాలుచూపుల వాడిబాణాలు తగిలే అదృష్టమైనా ఉంటుంది"అని అన్నాడు అజయకుమార్.

"ఛీ, ముఖర్జీమహాశయా, మీరు మరీ పురాణకాలం నాటి మనుషులైపోతున్నారు. నయనబాణ జ్ఞానమనేది ఈ కాలంలోకూడా ఉన్నదా? యుద్ధవిద్యల్లో ప్రస్తుతము అనేకమార్పులు వచ్చాయి" అని అంది శైలబాల.

ఇంతలో అక్కడికి నృపబాల, నీరబాల వచ్చారు. నృపబాల స్నేహశీలి, శాంతంగా ఉంటుంది,నీరబాల స్వభా వం అందుకు పూర్తిగా వ్యతిరేకంగా ఉంటుంది. ఎప్పుడు చూచినా చలాకీగా ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉంటుంది. నీరబాల అక్కడికి వచ్చీరాగానే అక్క శైలబాలను కౌగ లించుకొని "అక్కా, ఇవాళ ఎవరు వస్తున్నారో చెప్పవూ?" అని అడిగింది.

"ముఖర్జీమహాశయా, ఇవాళ మీ మిత్రులెవరినైనా ఆహ్వానించారా. అక్క ఫలహారాలు తయారు చేస్తుందెం దుకు?" అని అడిగింది నృపబాల అజయకుమార్‌ను.

"అదీ! కళ్ళుపోయేట్లు గ్రంథాలుచదివి అనేక లక్షల

మైళ్ళదూరంలో ఉన్న తోకచుక్కలు భూమ్యాకర్షణకువచ్చే సంగతిని తెలుసుకోగలవు కానీ ఇవాళ మధుమిస్త్రీ బజారులో 18 నెంబరు ఇంటికి ఆకర్షింపబడి వచ్చేదెవరో తెలుసుకోలేకపోయావా?" అన్నాడు అక్షయకుమార్.

"తెలిసింది, తెలిసింది, చిన్నకాక, నిన్ను చూడటానికి వస్తున్నారే, అందుకే ఉదయం నా ఎడమకన్ను అదిరింది" అని అంది నీరబాల నృపబాలతో.

"నీ ఎడమకన్ను అదిరితే నన్ను చూడటానికి ఎందుకు వస్తారు?" అని అడిగింది నృపబాల.

"నా ఎడమకన్ను అదిరించి నిన్ను చూడటానికి వస్తారనే, కానీ అందుకు నాకేమీ విచారంలేదు. కానీ, ముఖర్జీమహాశయా, ఏర్పాట్లు ఇద్దరికోసం జరుగుతున్నాయి, అక్క స్వయంవరం జరుగుతుందా?" అని అడిగింది నీరబాల.

"ఇందులో నీకుకూడా అన్యాయం జరుగదు" అని అన్నాడు అక్షయ్.

"ఆహా, ముఖర్జీమహాశయా, మంచి వార్త చెప్పావు. మీకు ఏమి బహుమానం ఇవ్వమంటావు? ఇదుగో నా మెడలో హారము-చేతిగాజులు" అని అంది నీరబాల సంతోషంగా అక్షయ్‌తో.

శైలబాల ఆ మెమాటకు అడ్డొస్తూ "ఛీ, చేతిగాజులుతీసివేయకు. వట్టిచేతులు బాగుండవు" అని అన్నది.

"ఇవాళ మా పెళ్ళిచూపుల సందర్భములో చదు

వుకు శలవు ఇవ్వవలసిందే ముఖర్జీమహాశయా" అని అంది నీరబాల.

"అరే, ఏమిటిది, పెళ్ళిచూపులు పెళ్ళిచూపులని పట్టించావు. చూచావా చిన్నక్కా" అని అంది నృపబాల శైలబాలతో.

అందుకు అక్షయ్ అందుకొని ఇలా అన్నాడు–"అందుకే ఆమెకు 'అడవి మనిషి' అని పేరు పెట్టాము. ఓ అడవి మనిషీ, భగవంతుడు మీ అక్కచెల్లెళ్ళందరికీ అక్షయ కుమారుడనే ఒక వరుణ్ణి ఇచ్చాడు, అయినా మీకు తృప్తి లేదా ?"

"అందుకే అబ్బాయిగారికి మరీ ఆశ ఎక్కువయింది" అని అంది నీరబాల. నృపబాల ఆమె చేతిని పట్టుకొని లాక్కువెళుతూ "ముఖర్జీమహాశయా, రాగానే మాకు తెలియజేయండి, మోసగించకండి. చిన్నక్క ఎంత ఆతుర్దాగా ఉన్నదో చూచారుగదా" అని అంది. తరువాత ఆమె ఒక అడుగు ఆగి "ఆమె మాట్లాడలేకపోతుంది. అయినా నాకన్నులు చూస్తూనే ఉన్నాయి" అని పాటగా పాడింది.

అక్షయకుమార్ అభయమిచ్చినట్లుగా "భయపడవద్దు, భయపడవద్దు. ఒకరు వెళ్ళిపోతే మరొకరు వస్తారు. జ్వాలను సృష్టించిన భగవంతుడే మిడతల్నికూడా సృష్టించాడు. ఏదీ పాటపాడు" అన్నాడు.

నీరబాల —

"అతని సమీపాన ఉన్నప్పటికీ
ప్రాణాలలో వ్యథ నిండి ఉంది!"

"నీవూ, రాబోయేవారిని దృష్టిలో ఉంచుకొని చెప్పినపాట కాదని అర్థమవుతూనే ఉంది. అతడెవరో కొంచెం చెపుదూ!" అని అడిగాడు అజయ్.

నీరబాల — పాట

మార్గమనే భ్రమలోపడి బాటసారి,
ఈ ప్రాణాల తీరానికి వచ్చినచో;
ప్రవాహానికి ఎదురుగా మధ్యలో చిక్కి,
అతని భ్రమ కరిగి పోతుంది;
పాపం, ఎక్కడికని బయలుదేరాడో!
కళ్లు తెరిచి అంతా చూస్తూనే ఉన్నాను."

"ఈ పాట నన్నుగురించే అల్లినట్టుగా ఉంది. కానీ, అమ్మాయీ, వినినంతనే మార్గం మర్చిపోయిన మనిషి భ్రమతొలిగే అవకాశమే లేదు" అని అన్నాడు అజయ్.

నీరబాల — పాట

"ద్వారం తెరుచుకొని వచ్చిన మనిషి,
ద్వారాన్ని తెరిచిఉంచే పారిపోతాడు;
పిచ్చితనం వదలిన తరువాత
ఎంత ప్రార్థించినా విననే వినడు;
ఇతరులు ఆలోచించినా ఆలోచించక
పోయినా నేనుమాత్రం అంతా
చూస్తూనే ఉన్నాను."

అజయ్ — పాట

"వద్దు, వద్దు, వద్దు వద్దండీ!
అలా ఆలోచించ వద్దండీ;

17

రాత్రి గడచిపోయినా
నేను వెళ్ళనే వెళ్ళను
ఒకవేళ వెళ్ళినా,
మళ్ళీ తిరిగొస్తాను;
వెలుగునీడల మార్గంలో
రాకపోకలు చూపిస్తాను
మనస్సు విరహాను కలయికల
ఊయల ఊగుతుంది,
నిన్ను చూచి అది మాటిమాటికి
ఉప్పొంగి పోతోంది;
చాటున దాగియుండి,
నిన్ను పొందే మార్గమేమిటా
అనే ఆలోచిస్తూ ఉంది."

"అయితే ఇక నిశ్చింతగా నిద్రపోగలుగుతాను" అని అంది నీరబాల.

"నిర్భయంగా నిద్రపోవచ్చు" అన్నాడు అక్షయకుమార్. తరువాత నృపబాల, నీరబాల వెళ్ళిపోయారు. వారు వెళ్ళగానే శైలబాల అక్షయకుమార్‌తో ఇలా అంది—"ముఖర్జీమహాశయా, నేను ఎగతాళిగా చెప్పటం లేదు—నిజంగానే నేను బ్రహ్మచారి సంఘంలో సభ్యురాలిగా చేరతాను. అయితే నాతోపాటు మరొక పరిచిత వ్యక్తి ఉండాలికదా? మీరు మళ్ళీ సభ్యుడిగా చేరే అవకాశం ఉండకపోవచ్చును?"

"లేదు, నేను పాపంచేశాను. మీరాదీదీ నా తపస్సును

భగ్నంచేసి నాకు స్వర్గప్రాప్తి లేకుండా చేసింది" అన్నాడు అతియకుమార్.

"అయితే అందుకు రసికదాదాను పట్టుకోవాలి. వారు ఏ సంఘంలో చేరకుండానే బ్రహ్మచర్య వ్రతాన్ని పాటిస్తున్నాడు" అంది శైలబాల.

"సభ్యుడిగా చేరగానే ఈ ముసలితనంలో వ్రతభంగం కలుగుతుంది. ఒకవిధమయిన చేప ఉంటుంది, పట్టుకోగానే చనిపోవాలని దాని ప్రతిజ్ఞ; అలాగే బ్రహ్మచారి సంఘపు ప్రతిజ్ఞ చేయగానే చేసిన వ్యక్తి సర్వనాశనమై పోతాడు" అని అన్నాడు అతియకుమార్.

ఇంతలో రసికదాదా అక్కడికివచ్చాడు. రసికదాదా తల ముందుభాగము బట్టతల, మీసాలు తెల్లగాఉంటాయి; గోధుమరంగు శరీరము, మనిషి పుష్టిగా ఉంటాడు.

"ఓరీ, పాఖండ, ఖండ, దుర్బిభేష కూష్మాండా" అన్నాడు అతియకుమార్.

అందుకు జవాబుగా రసికదాదా "ఏమీరా, మత్త మంథరకుంజ కుంజర పుంజ అంజన వర్ణా" అని అన్నాడు.

"నువ్వు నా మరదళ్ళనే ఉపవనానికి చిచ్చుపెట్ట దలచావట గదా?" అని ప్రశ్నించాడు అతియకుమార్.

"రసికదాదా, ఇందువల్ల నీకు వచ్చేదేముంది?" అని అడిగింది శైలబాల.

అందుకు రసికదాదా ఇలా జవాబు చెప్పాడు — "అమ్మాయీ, ఏంచేయను, వత్తిడి ఎక్కువయింది. ప్రతి సంవత్సరము మీ చెల్లెళ్ళవయస్సు పెరిగిపోతూఉంది.

అందుకు అమ్మగారు నన్నే నిందిస్తున్నారు. కదలకుండా కూర్చొని రెండుపూటలా తినటమేగాని అమ్మాయిలిద్దరికీ రెండు సంబంధాలు చూడలేవా అని అంటున్నారు. అలాగే అనుకొని నేను భోజనం మానుకున్నంతమాత్రాన ఇద్దరు వరులు లభిస్తారా, మీ చెల్లెళ్ళవయస్సు పెరగకుండా ఆగి పోతుందా? ఇటు ఎక్కడా సంబంధాలు కుదరకపోయేసరికి ఆమె ఏవేవో ఒట్లు వేస్తుంది, వాటితోనే కడుపు నిండిపో తుంది. అమ్మాయీ శైలా, కుమారసంభవంలో చదివిన శ్లోకం గుర్తున్నదా—

శ్లో॥ స్వయం విశీర్ణద్రుమపర్ణ వృత్తితా।
పరా హి కాష్ఠా తపస స్తయా పునః।
తదప్యపాకీర్ణమతః ప్రియం వదాం
వద న్త్యపర్ణేతి చ తాం పురా విదః

దుర్గామాత వరుణ్ణి వెతకటానికి అన్నపానీయాలు మాని తపస్సు చేసింది. కానీ మనుమరాళ్ళకు వరుల్ని వెతక లేనందువల్ల ఈ వృద్ధుడు అన్నపానీయాలు మానేయాలనే అమ్మగారి ఆలోచన ఏమంత సబబుగాఉంది. ఆహా, శైలా గుర్తున్నదా? తదప్యపాకీర్ణమతః ప్రియం వదాం—"

"గుర్తున్నది దాదా, కానీ ఈ సమయంలో కాళి దాసు బాగుండలేదు" అని అంది శైలబాల.

"అయితే, ఇది అత్యంత చెడుసమయమనే చెప్పాలి" అని అన్నాడు రసికదాదా.

"అవును, అందుకే మీ సలహా కావాలి" అని అంది శైలబాల.

అందుకు రసికదాదా ఇలా అన్నాడు- "అయితే, నాకు అంగీకారమే. ఎలాంటి సలహా కావాలంటే అలాంటి సలహాయే చెపుతాను. 'అవును' అనమని చెపితే అవుననే అంటాను లేదా 'కాదు' అనమంటే అలాగే అంటాను. నాలో ఉన్న ప్రత్యేకగుణం ఇదే. . అందరితోనూ ఏకీభ వించి అందరికీ అనుకూలంగా నడుచుకోవటమే తెలివిగల పని అని నా ఉద్దేశ్యము."

"అనేక నేర్పులతో మీరు మీ జీవికను సాగించు కొంటున్నారు, వాటిలోనే మీ బట్టతల ఒకటి" అని అంది శైలబాల.

"మరొక సంగతికూడా ఉంది, 'యావత కించిన్న భాషతే' — అందుకని నేను బయటి మనుష్యులవద్ద అధి కంగా మాట్లాడను" అని అన్నాడు రసికదాదా.

"అందుకనే బహుశా మావద్ద పెరుగుతున్నావు?" అని అడిగింది శైలబాల.

"మీవద్ద పెరగట మేమిటి, పట్టుబడిపోతున్నాను" అన్నాడు రసికదాదా.

"నిజంగా పట్టుబడేట్లయితే, పదండి, నేను చెప్పి నట్లు చేయాలి" అని అంది శైలబాల.

అందుకు రసికదాదా ఇలా అన్నాడు— "భయ పడను దీదీ. ఉన్నతవంశంలోని ఇద్దరు కుర్రాళ్ళను చూచాను. అమ్మాయిల పెళ్ళికయే ఖర్చుకంటెకూడా వెయ్యిరెట్లు దుస్సహంగా ఉంటారు. అమ్మగారు వారిని చూచిన తరువాత తమ కుమార్తెలకు వివాహంచేయటం

మానుకొని ఇక్కడే బ్రహ్మచారిణుల సంఘాన్ని స్థాపిస్తారు. వారు కబురు పంపారు – లోనికి వెళ్ళివస్తాను."

ఈమాట అని రసికదాదా లోనికి వెళ్ళిపోయాడు.

"ముఖర్జీమహాశయా" అని అంది శైలబాల.

"చిత్తం, ఏమి ఆజ్ఞ" అన్నాడు అక్షయకుమార్.

"ఆ అబ్బాయిలిద్దరినీ ఏదోవిధంగా తరిమివేయాలి" అంది శైలబాల.

"అదెలాగో జరుగుతుంది" అన్నాడు అక్షయ్.

పాట

నీ చెంతకు ఎవరొస్తారో చూస్తాను,
నువ్వు ఏకేశ్వరిగానే ఉంటావు,
నేను ఏకేశ్వరుడ నవుతాను;
ఈ సేవకుడు
నీ చెంతనే ఉండిపోతాడు.

శైలబాల నవ్వి "ఏకేశ్వరినా" అని అంది.

"కావాలంటే మీకు నాలుగు ఈశ్వరీలు కావచ్చు, నష్టమేమీ లేదు. శాస్త్రిములలో అధికస్య అధికం ఫలం అన్నారు" అని అన్నాడు అక్షయకుమార్.

"మరి మీరు ఒక్కరే ఉంటారా ? 'అధికస్య' ఉండ కూడదా?" అడిగింది శైలబాల.

"అక్కడ శాస్త్రము మరొకవిధంగా చెప్పింది. 'సర్వమత్యంత గర్హితమ్' అనే పవిత్రసూక్తి అన్వయించు కోవచ్చును" అన్నాడు అక్షయకుమార్.

"కానీ, ముఖర్జీమహాశయా, ఈ పవిత్రసూక్తి ఎల్ల

కాలం సాగదు. మరికొందరు మిత్రులు వస్తారు" అని చెప్పింది శైలబాల.

అందుకు అజయకుమార్ ఇలా అన్నాడు-"ఇప్పుడు మీకున్నది ఒక్క ఇల్లు, దీనికి బదులు పది ఇళ్ళు ఏర్పాట వుతాయా? అప్పుడు మరొక కొత్త ఏర్పాటు చూచుకో వచ్చును. అంతవరకు ఇలాంటి కుర్రాళ్ళను అడుగుపెట్ట నివ్వను."

ఇంతలో నౌకరు ప్రవేశించి ఎవరో ఇద్దరు యువకులు వచ్చారని చెప్పివెళ్లాడు.

"వాళ్లిద్దరే కావచ్చును. అమ్మగారు, అక్క ఇద్దరూ వంటఇంట్లో ఉన్నారు; వాళ్ళిద్దరూ వచ్చేలోపల వీళ్ళిద్దరినీ ఏదోవిధంగా పంపివేయాలి" అని చెప్పింది శైలబాల.

"అలాచేస్తే ఏమి బహుమానము ఇస్తావు?" అడిగాడు అజయ్.

"మేమందరమూ కలిసి మీకు 'మరదళ్ళమహారాజు' అని బిరుదు నిస్తాము" అని చెప్పింది శైలబాల.

"నారాజ్యకాలంలో ప్రపంచంలో ఒక కొత్త సంవత్సరాన్ని ప్రారంభిస్తాను" అన్నాడు అజయ్.

శైలబాల లేచి లోనికి వెళ్ళిపోయింది. ఇటు బయట నుంచి ఇద్దరు ప్రవేశిస్తారు. వారిలో ఒకరిపేరు మృత్యుంజయుడు, రెండవవానిపేరు దామకేశ్వరుడు. మృత్యుంజయుడు పొడవుగా రోగివలె ఉన్నాడు, మేజోళ్లు బూట్లు ధరించాడు. కట్టుపంచె మోకాళ్ళవరకు కట్టాడు. వయస్సు ఇరవై రెండు ముప్పదిరెండు మధ్యలో ఉంటుందని చెప్పవచ్చు. ముఖా

న్నిబట్టి మతేరియూ రోగివలె కన్పిస్తాడు. దారుకేశ్వరుడు చాలా పొట్టిగా, బక్క-గా ఉంటాడు. గడ్డము, మీసాలు వత్తుగా పెరిగాయి. బట్టతల, నల్లగా నిగనిగలాడుతూ ఉంటుంది. అక్షయకుమార్ వాళ్ళను చూడగానే అత్యంత స్నేహపూర్వకముగా లేచి ఎదురేగి ప్రబల వేగముతో కరచాలనముచేసి "రండి మిస్టర్ నథానియేల్, స్వాగతం మిస్టర్ జేరోమియా, దయచేయండి, కూర్చోండి. అరే, ఐస్ వాటర్ తీసుకురా, కొంచెం పుగాకుకూడా తీసుకురా—" అన్నాడు.

మృత్యుంజయుడు అకస్మాత్తుగా ఈ విజాతీయ సంభాషణచూచి సంకోచిస్తూ మృదువుగా "కాదండీ, నాపేరు మృత్యుంజయ గంగూలీ" అని చెప్పాడు.

"నాపేరు (శ్రీ) దారుకేశ్వర ముఖోపాధ్యాయ" అని చెప్పాడు దారుకేశ్వరుడు.

అందుకు అక్షయకుమార్ "ఛీ! మహాశయా! మీరింకా ఈపేర్లను ఉపయోగిస్తున్నారా? మీ క్రిష్టియన్ పేర్లేమిటి?" అని అడిగాడు. ఆగంతకులు నిరుత్తరులై ఏమీ తోచక కళ్లప్పగించి చూస్తూ ఉండటం గమనించి అతడు "ఇంకా మీకు నామకరణము జరుగలేదా? సరే దానివల్ల నష్టమేమీలేదు, అందుకు కావలసినంత సమయం ఉంది" అని అన్నాడు.

ఈమాట అని అక్షయకుమార్ తన హుక్కా గొట్టమును మృత్యుంజయ గంగూలీ చేతికిచ్చాడు. ఆగంతకులిద్దరూ సందేహంగా ఒకరినొకరు చూచుకుంటారు. వెంటనే

అక్షయకుమార్ వారినిచూచి ఇలా అన్నాడు— "అరే అరే! నాముందుకూడా ఇంత సిగ్గుపడితే ఎలా! వయసొచ్చినప్పటినుంచి పొగ త్రాగి త్రాగి బాగా రాటుదేలిపోయాను. పొగ చేరిచేరి బుద్ధిమీద గూడుకట్టుకుపోయింది. నేడుకూడా ఇలాగే సిగ్గుపడి ఉంటే నాగరిక సమాజంలో తలెత్తుకు తిరగగలిగేవాడినేకాదు."

దారుకేశ్వర ముఖోపాధ్యాయుడు సాహసించి మృత్యుంజయుని చేతిలోనుంచి హుక్కా అందుకొని గుడ గుడ చప్పుడుచేస్తూ హుక్కా పీలుస్తాడు. అక్షయకుమార్ జేబులోనుండి గట్టిగాఉన్న బర్మాచుట్ట నొకదానిని తీసి మృత్యుంజయుని చేతికిచ్చాడు. మృత్యుంజయునికి చుట్ట త్రాగే అలవాటు లేకపోయినప్పటికీ మర్యాదకోసము ప్రాణాలమీద ఆశవదులుకొని నెమ్మదిగా చుట్టత్రాగ నారంభించాడు. దగ్గును అతికష్టంమీద అణచుకోగలిగాడు.

"ఇక ఇప్పుడు అవసరమైన విషయాలు మాట్లాడుకుందాం. ఏమంటారు" అన్నాడు అక్షయకుమార్.

"అవును, అంతే. శుభస్య శీఘ్రం" అన్నారు" అని అన్నాడు దారుకేశ్వరుడు.

అక్షయకుమార్ గంభీరంగా "చికిన్ కావాలా లేక మటనా?" అని అడిగాడు.

మృత్యుంజయుడు నిశ్చేష్టుడై తలగోక్కుంటున్నాడు. దారుకేశ్వరుడు ఏమీ అర్థంకాక బిగ్గరగా నవ్వసాగాడు.

"మహాశయా, భయం ఎందుకు! పదిమందిలో ఆట ఆడుతూ ముసుగెందుకు?" అన్నాడు అక్షయ్.

దారుకేశ్వరుడు రెండు చేతులతో కాళ్ళమీద చరుచుకొని మరింత బిగ్గరగా నవ్వుతూ "అయితే చికెన్ చెప్పండి, కట్‌లెట్ చాలు, ఏమంటారు" అని అన్నాడు.

మృత్యుంజయుడుకూడా ధైర్యం తెచ్చుకొని "మటన్ చాప్సకూడా తీసివేయతగినదికాదు" అని అన్నాడు.

"అదుగో, అలా చెప్పండి, భయమెందుకు? రెండూ ఆర్డరిద్దాం. విచారిస్తూ తిన్నందువల్ల సుఖం ఉండదు" అని అక్షయకుమార్ నౌకరునుపిలిచి "బజారు మలుపులోఉన్న హోటలుకువెళ్ళి వంటవాడు కలిముద్దీనును పిలుచుకురా" అని వ్రేలితో మృత్యుంజయుని శరీరం నొక్కుతూ "బీర్ కావాలా శేరీ కావాలా?" అని అడిగాడు.

అదివిని దారుకేశ్వరుడు "విస్కీ దొరకదా?" అని అన్నాడు.

అక్షయకుమార్ అతని వీపుతట్టి "ఎందుకు దొరకదు. అసలు మనం ఉన్నది దానిమీదనేగదా! మీరు అన్యథా భావించనంటే మనసులోని విషయం చెపుతాను. ఒకపెగ్గు సోడాలో అయిదుపెగ్గులు విస్కీ కలిపితే అద్భుతంగా ఉంటుంది" అన్నాడు.

బలహీనంగాఉన్న మృత్యుంజయుడుకూడా బిగ్గరగా నవ్వటం తన కర్తవ్యంగా భావిస్తాడు. దారుకేశ్వరుడు గబగబ బల్లమీదఉన్న పుస్తకాన్ని అందుకొని వ్రేళ్ళతో దానిమీద దరువువేస్తూ ఉంటాడు.

"దాదా, అదేదో త్వరగా కానివ్వండి" అన్నాడు దారుకేశ్వరుడు.

అక్షయకుమార్ మృత్యుంజయుణ్ణి నెట్టుతూ "అభయం ఇస్తే మనసులోని మాట ఏదో చెపుతాను - పాడండి, మీరుకూడా పాడండి" అని అన్నాడు.

మృత్యుంజయుడు సిగ్గుపడుతూ మర్యాదకోసము నెమ్మదిగా పాట ప్రారంభిస్తాడు - అక్షయకుమార్ బల్ల మీద దానికి తగినట్లు దరువు వేస్తాడు. మధ్యలో అకస్మాత్తుగా ఆగి గంభీరంగా "అదిసరే, అసలు విషయం అడగటమే మర్చిపోయాను. ఇక్కడ అన్నీ సిద్ధముగానే ఉన్నాయి, మీరు ఏ శ్రేణికి చెందదలచారు" అని అడిగాడు అక్షయకుమార్.

"మమ్మల్ని విదేశాలకు పంపించాలి" అన్నాడు దారుకేశ్వరుడు.

"అదెలాగో జరుగుతుంది. సీలు తీయకుండా శాంపైన్ సీసానెలా తెరవగలం. దేశంలో మీవంటివారి చదువు అణగిపోయి పడిఉంది, బంధనాలు తొలగిపోతే చాలు అకస్మాత్తుగా అది నోటినుంచి, ముక్కులనుంచి, కళ్ళలోనుంచి దుముకుతుంది" అన్నాడు అక్షయకుమార్.

దారుకేశ్వరుడు అమిత సంతోషంతో అక్షయకుమార్ చేతిని పట్టుకొని నొక్కుతూ "దాదా, ఇది మీరు తప్పకుండా చేయాలి. తెలిసిందా?" అని అన్నాడు.

"అదేమంత కష్టమైన పనికాదు. కానీ, మీరు

ఇవాళే క్రైస్తవమతం పుచ్చుకుంటారా?" అని అడిగాడు అజయకుమార్.

దారుకేశ్వరుడు నవ్వుతూ "అంటే ఏమిచేయాలి?" అని అడిగాడు.

అజయకుమార్ విస్మయపడుతూ "దానికేముంది, ఇవాళ రాత్రికి రెవరెండ్ విశ్వాసంగారు వస్తారు. మతం మార్చుకోనిదే క్రైస్తవపద్ధతిలో వివాహం జరగడానికి వీలుపడదు" అని అన్నాడు.

మృత్యుంజయుడు చాలా భయపడుతూ "మహాశయా, క్రైస్తవపద్ధతి ఏమిటి?" అని అడిగాడు.

"మీరేదో ఆకాశంనుంచి వూడిపడినట్లు మాట్లాడుతున్నారు. కాదంటే కుదరదు – ఏదోవిధంగా ఈ రాత్రికే క్రైస్తవ మతంలో చేరిపోవాలి" అన్నాడు అజయకుమార్.

"మీరు క్రైస్తవులా?" అని అడిగాడు మృత్యుంజయుడు.

"మహాశయా, ఎందుకు ఎగతాళి. ఏమీ తెలియనట్లే మాట్లాడుతున్నారు" అని అన్నాడు అజయకుమార్.

మృత్యుంజయుడు మరింత భయపడుతూ "మహాశయా, మేము బ్రాహ్మణులము, హిందువులము. మేము మా కులాన్ని, మతాన్ని వదులుకోనేది లేదు" అన్నాడు.

అజయకుమార్ అకస్మాత్తుగా అత్యంత ఉగ్రుడై "మతం ఏమిటి మహాశయా! ఇక్కడ కాలిమద్దీ వండిన

కోడిమాంసం తింటారు, విదేశాలకు వెళతారు, ఇంకా మీకు మతం ఏమిటి?" అని అన్నాడు.

మృత్యుంజయుడు తడబడుతూ "బిగ్గరగా మాట్లాడవద్దు, నెమ్మదిగా మాట్లాడండి, ఎవరైనా వింటారు" అని అన్నాడు.

"ఉద్రేకపడకండి. మా మిత్రునితో ఒకసారి మాట్లాడి చెపుతాను" అన్నాడు దారుకేశ్వరుడు అక్షయ కుమార్‌తో. ఈమాట అని అతడు మృత్యుంజయ గంగూలీని చాటుకు తీసుకువెళ్ళి ఇలా చెప్పాడు — "విదేశాన్నుంచి తిరిగివచ్చిన తరువాత ఒకసారి ఎలాగో ప్రాయశ్చిత్తం చేసుకోవలసి ఉంటుంది - అప్పుడే డబుల్ ప్రాయశ్చిత్తం చేసుకొని మరల మన మతంలో కలిసిపోదాం. ఈ అవకాశాన్ని గనుక జారవిడుచుకున్నామంటే మళ్ళీ మనకు విదేశాలకు వెళ్ళగలిగే సదవకాశం లభించదు. మనం కోరేవాటికి అంగీకరించే సంబంధం ఇంతవరకు ఎక్కడా కుదరలేదని మనకు తెలిసినదే. క్రైస్తవుడు త్రాగిన సూకా-త్రాగినతర్వాత ఇక క్రైస్తవుడైతేమాత్రం ఏమిటి!"

ఇద్దరు అక్షయకుమార్ ఉన్న చోటుకు తిరిగివచ్చారు. దారుకేశ్వరుడు అక్షయకుమార్‌తో "విదేశాలకు మమ్మల్ని పంపటానికి అంగీకరించినట్లేగదా? అలా అయితే క్రైస్తవులము కావటానికి మేము అంగీకరిస్తున్నాము" అని చెప్పాడు.

"రాత్రివరకు ఆగు మిత్రమా" అన్నాడు మృత్యుంజయగంగూలీ.

"కాదలచినప్పుడు వెంటనే ఆ పనేమిటో కానివ్వటమే మంచిది. శుభస్య శీఘ్రం అని నేను మొదటనే చెప్పానుగదా!" అని అన్నాడు దామకేశ్వరుడు.

ఈలోపల స్త్రీలు వస్తారు. రెండు పళ్ళెములలో పండ్లు, పరమాన్నము, పూరీలు, ఐస్‌వాటర్ తీసుకొని నౌకరు ప్రవేశిస్తాడు.

"ఏం మహాశయా, మా దురదృష్టంవల్ల కోడిపిల్ల ఎగిరిపోయిందా? కట్‌లెట్ ఏది?" అని అడిగాడు దామకేశ్వరుడు.

అక్షయకుమార్ మృదువుగా "ఇవాళ కార్యక్రమాన్ననుసరించి ఇలాంటివే ఉంటాయి" అన్నాడు.

అందుకు దామకేశ్వరుడు ఇలా అన్నాడు — "ఇదేమిటి మహాశయా, ఆశచూపించి నిరాశపర్చటమా? అత్తవారింటివద్దకూడా మటన్‌చాప్సు దొరకదా? మహాశయా, ఈ ఐస్‌వాటర్ త్రాగితే నాకు మరింత జలుబుచేస్తుంది, మరి మంచినీళ్ళంటారా, అవి అసలే సహించలేను. అభయమిస్తే నా మనసులోనిమాట చెప్తాను" అని పాటతో ముగించాడు దామకేశ్వరుడు.

అక్షయ్ మృత్యుంజయ గంగూలీని గిచ్చి "అయ్యో మీరు కూడా పాడండి - మీరు మెదలకుండా వూరుకున్నారేం?" అని అన్నాడు. అతడుకూడా పాట అందుకుంటాడు. పాట ఆగినతరువాత అక్షయ్ అక్కడఉన్న

భోజనపాత్రను చూపించి "ఇప్పుడు ఇవి పనికిరావంటారా?" అని అడిగాడు.

దారుకేశ్వరుడు తడబడుతూ "వద్దు మహాశయా, రోగులకుపెట్టే ఇలాంటి పథ్యాలు మాకు వద్దు. కోడిని తిన నందువల్లనే భారతదేశం ఇలా పాడయిపోయింది" అని అన్నాడు.

అతుయ్ అతని చెవిలో ఈ క్రింది పాటను పాడి వినిపిస్తాడు—

పప్పు అన్నము తిని
ఈ దేశం ఎంతకాలమిటు
బ్రతుకగలదురా ?

దారుకేశ్వరుడు ఉత్సాహంతో పాటను అందుకొని బిగ్గరగా పాడతాడు. అతుయ్ చాటుగా గిచ్చినందువల్ల సిగ్గుపడుతూ మృత్యుంజయుడుకూడా నెమ్మదిగా పాటను పాడతాడు.తరువాత అతుయ్ మరొకచరణాన్ని నెమ్మదిగా చెవిలో చెప్పాడు—

దేశంలో అన్నపానీయాలకు
కరువాయెరా,
విస్కీ సోడాలు త్రాగి
చికెన్ మటన్‌లు తినరా !

దారుకేశ్వరుడు తన్మయుడై పాటను బిగ్గరగా పాడు తాడు. ఇంతకుముందువలె అతుయ్ గిల్లగానే మృత్యుం జయుడు పాటను అందుకుంటాడు. అతుయ్ నెమ్మదిగా మరొక చరణం చెపుతాడు—

ఏమయ్యా, పూజారీ వెళ్ళుము త్వరగా,
కాలీమద్దీ సాహెబుగారూ మీరిలా రండి.

పాట ఎంత ఉత్సాహంగా సాగుతూఉందో అలాగే లోపల గోడచాటునుండి టకటక శబ్దం విన్పించసాగింది. అక్షయ్ నిస్సహాయుడగు పెద్దమనిషివలె మధ్యమధ్య అటు వైపు చూడసాగాడు. అదేసమయంలో చీపురుకట్ట చేత్తో పట్టుకుని కాలీమద్దీమియా అక్కడికివచ్చి సలాముచేసి సెల బడ్డాడు.

దారుకేశ్వరుడు కాలీమద్దీతో "ఇవాళ ఏమేమి వంట కాలు తయారుచేశావో చెప్పు. అక్షయ్‌బాబూ, కూరా లేక కట్‌లెట్ కావాలా?" అని అడిగాడు.

అక్షయబాబు లోనివైపుచూస్తూ "ఆ విషయాలు మీకే బాగుగా తెలుసు" అన్నాడు.

"బ్రాహ్మణేభ్యోనమః అని ప్రతివారిని గౌరవించా లని నా అభిప్రాయం" అన్నాడు దారుకేశ్వరుడు.

"అది నిజమే, వారందరూ పూజనీయులే" అని అన్నాడు అక్షయ్.

కాలీమద్ది సలాముచేసి వెళ్ళిపోతాడు.

అక్షయబాబు గొంతుపెంచి "మహాశయులారా, మీరిద్దరూ నేటిరాత్రికే క్రైస్తవమతం పుచ్చుకోదల చారా?" అని అడిగాడు.

"శుభస్య శీఘ్రం అని నేను చెప్పనే చెప్పానుగదా! ఇవాళే క్రైస్తవమతంలో చేరతాను, ఇప్పుడే చేరతాను. క్రైస్తవమతంలో చేరినతరువాతనే ఇతర విషయాలు ఆలో

చిద్దాం. మహాశయా, నేను అరటిపువ్వుకూరలాంటి పదార్థాలు తిని బ్రతకలేను. ముందు ఆ ఘాదరును పిలిపించండి" అన్నాడు దారుకేశ్వరుడు. మళ్ళీ అతడు పైపాటలోని ఒక చరణమును అందుకొని పాటపాడుతూ ఉంటాడు.

ఇంతలో నౌకరు ప్రవేశించి అక్షయబాబు చెవిలో పెద్దమ్మగారు పిలుస్తున్నారని చెపుతాడు. అక్షయబాబు లేచి లోనికి వెళతాడు.

అతడు లోనికి అడుగుపెట్టగానే జగత్తారిణి అతనితో "ఇదంతా ఏమిటి?" అని అడిగింది.

అందుకు అక్షయబాబు గంభీరంగా ఇలా అన్నాడు- "అమ్మా, అవన్నీ తరువాత మాట్లాడుకుందాం. ముందు వారికి విస్కీ కావాలట, ఏంచేయను. మీ పాదాలకు మర్దన చేయటానికి తెచ్చిన బ్రాందీలో ఏమైనా మిగిలిందా?"

జగత్తారిణీదేవి మతిపోయినట్లయి "అయితే నాయనా, వారిని బ్రాందీ త్రాగనిస్తావా?" అని అడిగింది.

"నేనేం చేయనమ్మా, మీరు వినేఉంటారు. వారిద్దరిలో ఒకనికి మంచినీళ్ళు త్రాగితే జలుబుచేస్తుంది. రెండవ కుర్రాడికి బ్రాందీ లేనిదే మాటరాదు" అని చెప్పాడు.

"క్రైస్తవ మతమని అంటున్నారేమిటి?" అని అడిగింది జగత్తారిణి.

"హిందూమతంలో ఉంటే అవి తినకూడదు, ఇవి తినకూడదు అని చెపుతారు కనుక వారికి హిందూమతంలో ఉండటం ఇష్టంలేదట" అని జవాబు చెప్పాడు అక్షయ్.

జగత్తారిణీదేవి ఆశ్చర్యపడుతూ "అందుకని ఇవాళ

రాత్రికే వారికి కోడిమాంసం పెట్టి క్రిస్తవుల్ని చేస్తావా?" అని అడిగింది.

"అదికాదమ్మా, వాళ్ళిద్దరూ కోపంవచ్చి వెళ్ళిపోయేట్లయితే మళ్ళీ రెండు సంబంధాలు చేతులారా చెడిపోయినట్లేగదా! అందుకని వారేది చెప్పినా మెదలకుండా వింటున్నాను. (పురబాలవైపు తిరిగి) ఇవాళ వాళ్ళిద్దరూ నాకు కూడా బ్రాందీ త్రాగించేటట్లే కన్పిస్తున్నారు" అని చెప్పాడు అక్షయబాబు.

"మంచిదే, వాళ్ళిద్దరినీ పంపివేయండి. వెంటనే పంపివేయండి" అంది పురబాల.

జగత్తారిణిదేవికూడా విరక్తిభావంతో "నాయనా, ఇక్కడ మనఇంట్లో కోడిమాంసాలు వగైరా తినడానికి వీలుపడదు. వాళ్ళిద్దరినీ పంపివేయి. ఎక్కడైనా మంచి సంబంధాలు చూడమని రసికునితో చెప్పాను, మోసమే జరిగింది. అయినా అతనివల్ల ఏమవుతుంది" అని లోనికి వెళ్ళిపోయింది. తల్లి వెనకనే పురబాలకూడా లోనికి వెళ్ళింది.

అక్షయబాబు ముందులోకి వచ్చాడు. మృత్యుంజయగంగూలీ అక్కడినుంచి పారిపోవాలని ప్రయత్నం చేస్తున్నాడు. దారుకేశ్వరముఖోపాధ్యాయ అతని చేతులు పట్టుకొని ఆపిఉంచటానికి ప్రయత్నిస్తున్నాడు. అక్షయబాబు అక్కడ లేని సమయంలో మృత్యుంజయుడు వెనకముందులాలోచించి మతం మార్చుకొని వివాహం చేసుకోటానికి భయపడిపోయాడు.

అక్షయబాబు అక్కడికి రాగానే అతడు కోపంగా

"లేదు మహాశయా, నేను క్రైస్తవమతం పుచ్చుకోను. నాకు వివాహం అవసరంలేదు" అని అన్నాడు.

"అయ్యో, మిమ్మల్ని ఇక్కడ ఎవ్వరూ బలవంతం చేసి ఆపలేదుగదా!" అన్నాడు అతీయబాబు.

"మీరు చెప్పినవన్నీ నాకు అంగీకారమే" అన్నాడు దారుకేశ్వరుడు.

"అంగీకారమైతే ఏదైనా చర్చికి వెళ్ళండి. మా వంశంలో క్రైస్తవమతంలో చేరటమనేది ఎప్పుడూ జరగలేదు" అన్నాడు అతీయబాబు.

"మీరెవరో విశ్వాసంగాగు వస్తారని చెప్పారు గదా?" అడిగాడు దారుకేశ్వరుడు.

"అలాంటివారు బజారులో అనేకమంది దొరుకుతారు, కావాలంటే అడ్రసు వ్రాసియిస్తాను" అన్నాడు అతీయబాబు.

"మరి వివాహమో?" అడిగాడు దారుకేశ్వరుడు.

"అది ఈ వంశంతో జరుగదు" అని చెప్పాడు అతీయబాబు.

"అయితే, మీరింతసేపు ఎగతాళిగా మాట్లాడారా? మరి భోజనం విషయంకూడా—" అని నసిగాడు దారుకేశ్వరుడు.

"అలాంటి భోజనాలుకూడా ఇక్కడ వీలుపడదు" అని చెప్పాడు అతీయబాబు.

"హోటలులోకూడా వీలుపడదా?" అని దారుకేశ్వరుడు ప్రశ్నించాడు.

"అది బాగానే ఉంది" అని అక్షయబాబు పర్సు తెరచి కొంతడబ్బు ఇచ్చి ఇద్దరినీ పంపివేస్తాడు. వసంత కాలపు గాలివిసురువలె నృపబాల చేతినిపట్టుకొని లాగుతూ నీరబాల అక్కడికి వచ్చింది.

"ముఖర్జీమహాశయా, దీదీ ఇద్దరిలో ఎవరినీ వదల దలచుకోలేదు" అంది నీరబాల.

నృపబాల ఆమె బుగ్గమీద చిన్న దెబ్బవేసి "అదుగో, మళ్ళీ అబద్ధం చెపుతున్నావు" అంది.

"అమ్మాయీ గాబరాపడకు, నిజానికి అబద్ధానికి పెద్ద తేడాలేదు. నేనుకూడా కొద్ది కొద్దిగా అర్థం చేసుకో గలను" అన్నాడు అక్షయబాబు.

"అది సరే ముఖర్జీమహాశయా, వీళ్ళిద్దరూ రసిక దాదాగారి రసికత్వమా లేక మా రెండో అక్కగారి నృత్యసందేశమా" అడిగింది నీరబాల.

"తుపాకీ గుళ్ళన్నీ లక్ష్యానికే వెళ్ళి తగులుతాయా? బ్రహ్మదేవుడు పేల్చిన తుపాకిలో వీళ్ళిద్దరూ గురితప్పిన గుళ్లు. మొట్టమొదట నేర్చుకునేప్పుడు ఇలాంటిగుళ్ళు వస్తూనే ఉంటాయి. ఈ నిర్భాగ్యులను పట్టుకోకముందు మీదీదీ పిల్లంగ్రోవిలో అనేక జలచరములు తప్పించుకునే పోయాయి, గాలంవచ్చి చివరకు నా మూడుకు పట్టుకుంది" అన్నాడు అక్షయబాబు. ఈమాట అని అతడు తన తల మీద చిన్న దెబ్బకొట్టుకుంటాడు.

"ముఖర్జీమహాశయా, రోజూ బ్రహ్మదేవుని ప్రాక్టీసు

సాగుతూ ఉంటుందా? అలా జరిగితే తప్పించుకోలేము" అంది నృపబాల.

"విచారం ఎందుకు, తుపాకి రోజూ గురితప్పుతుందా ఏదో ఒకరోజున లక్ష్యానికి వచ్చి తగులుతుంది" అంది నీరబాల.

అదే సమయాన రసికదాదా ప్రవేశిస్తాడు. అతనిని చూచి నీరబాల "రసికదాదా, ఇకనుంచి మేము కూడా మీకోసం పెళ్ళికుమార్తెను వెతుకుతున్నాము" అంది.

"అది సంతోషించదగిన విషయమే" అన్నాడు రసికదాదా.

"అవునవును, సంతోషిస్తారు. నువ్వు గడ్డి ఇంట్లో ఉంటూ ఇతరుల ఇళ్ళకు నిప్పంటించాలనుకొంటున్నావు. మా విషయంలో మీరు జోక్యం కలిగించుకొంటే మీకు మేము రెండు వివాహాలు చేస్తాము, నెత్తిమీద మిగిలిన నాలుగు వెంట్రుకలుకూడా మిగలవు" అంది నీరబాల.

"ఇదుగో దీదీ, రెండు జంతువుల్ని పట్టుకొచ్చాను, అందుకనే బ్రతికిపోయారు. ఒకమాదిరిగా ఉన్నవాళ్ళయినా చాలా చిక్కువచ్చేదే. జంతువులని చెప్పవీలులేని జంతువులే. మహా భయంకరంగా ఉంటాయి." అని అన్నాడు రసికదాదా.

"ఆమాట నిజమే. మొదట నేను భయపడ్డాను. కానీ, వీపుమీద చేయివేయగానే తోకలాడించసాగాయి. ఇంతకూ అమ్మగారేమన్నారు?" అని అడిగాడు అక్షయ్.

అందుకు రసికదాదా ఇలా చెప్పాడు— "ఆమె అన్న

మాటలు మరొక పదిమందిని పిలిచి చెప్పవలసినవేమీ కావు. ఆమాటలను నా హృదయంలోనే ఉంచుకున్నాను. ఏదైతేనేం, చివరికి ఆమెగారు కాశీలో తన అక్కకొడుకు ఇంటికి వెళ్ళాలని నిశ్చయించుకున్నారు! అక్కడ ఏవో సంబంధాలు ఉన్నాయట, తీర్థయాత్రకు వెళ్ళినట్లూ ఉంటుంది."

"అదేమిటి రసికదాదా! మాకిక రోజూ ఇక్కడ కొత్తకొత్త నమూనాలు కన్పించవంటారా?" అని అడిగింది నీరబాల.

"ఇంకా నీకు సందేహమా?" అని అడిగింది నృపబాల.

"ఇది సందేహమనేదేముంది. ఇదొక విద్య. ప్రతి రోజు అనేక దృష్టాంతాలు చూస్తూ ఉన్నందువల్ల మనకు కావలసినదేదో ఎన్నుకోవటం తేలికవుతుంది; వివాహమాడిన ప్రాణిని తేలికగా అర్థం చేసుకోగలుగుతాము" అని అంది నీరబాల.

అందుకు నృపబాల "నీప్రాణిని నువ్వు అర్థంచేసుకో, నన్నుగురించి నువ్వేమీ విచారించవద్దు" అంది.

"అదే మంచిది— నువ్వుకూడా నీగురించి ఆలోచిస్తున్నావు. నేనుకూడా నన్నుగురించే ఆలోచిస్తాను— కానీ మనల్నిగురించి రసికదాదాను మాత్రం ఆలోచించ నివ్వవద్దు" అంది నీరబాల. తరువాత నీరబాల, నృపబాల లేచి వెళ్ళిపోతారు. అదేసమయంలో శైలబాల అక్కడికి

వస్తుంది. ఆమె రాగానే "రసికదాదా, నీతో ఒక విషయం మాట్లాడాలి" అంది.

"ఇదుగో శైలా! అర్థమయింది! ఇవాళ రసికదాదా నీకు మంత్రి అయ్యాడా. నన్ను అవమానించావుగదా!" అన్నారు అతిశయబాబు.

శైలబాల నవ్వి "ముఖర్జీ మహాశయా, మీ సలహా పొందటానికి మీతో నాకేమిసంబంధం? వృద్ధులు కానివారి సలహా పొందలేముగదా" అంది.

"అయితే మంత్రిపదవికోసము నా దర్బారును చాలించివేస్తున్నాను" అని అతిశయబాబు కాంభోజరాగంలో పాట పాడతాడు.

"రసికదాదా నేను చిరకుమారసభ (బ్రహ్మచారి సంఘము) లో సభ్యురాలిగా చేరతాను— మీరు నా వాహనంకావాలి" అంది శైలబాల.

అందుకు రసికదాదా ఇలా అన్నాడు— "విష్ణు భగవానుడు స్త్రీ వేషముధరించి పురుషుణ్ణి మరిపించి మోసం చేశారు. అలాంటిది ఈ శైలబాల పురుష వేషము ధరించి పురుషుణ్ణి మరిపించగలిగితే నేను హరిభక్తి మానుకొని మిగిలిన జీవితమంతా శైలబాలనే పూజిస్తాను. ఈవిషయం అమ్మగారికి తెలిస్తే?"

"ముగ్గురు కుమార్తెలు తననుగురించి ఏమీ శ్రద్ధ వహించరని ఆలోచించి ఆమె ఇప్పటికే చాలా దిగులుగా ఉంటుంది. ఆమెనుగురించి మీరేమీ ఆలోచించవద్దు" అంది శైలబాల.

"ఇంతకూ ఆ సంఘములో సభ్యత్వము ఎలా పొందాలో ఏమిటో నాకేమీ తెలియదు" అన్నాడు రసిక దాదా.

"సరే, అవన్నీ నేను చూచుకుంటాను. దరఖాస్తుతో పాటు ప్రవేశరుసుము పదిరూపాయలుకూడా పంపాను. రసికదాదా, మీరు అమ్మగారివెంట తప్పకుండా కాశీ వెళ్ళాలి" అంది శైలబాల.

"అమ్మవెంట కాశీ వెళ్ళటానికి నేను మరొక మని షిని చూస్తాను, దానినిగురించి మీరేమీ విచారించవద్దు" అన్నాడు అక్షయబాబు.

"ముఖర్జీమహాశయా, మీరు వారిని కోతులుగా చేసిన తరువాత — చివరికి పాపం, వారిమీద నామాయ చూపించారా" అంది శైలబాల.

"శైలా, వానరుల్ని ఎవరూ చేయలేరు. ఆ భగవం తుడే వాటిని సృష్టించాడు. వాటియందు ఆ భగవంతుని అనుగ్రహం అధికంగా ఉండాలి. కవి అయినట్లే అదికూడా. నువ్వు తోక అను లేదా కవిత్వమను. అది లోపల లేకపోతే బలప్రయోగం చేసినా బయటకు తీసుకురాలేము" అన్నాడు అక్షయబాబు.

అదేసమయంలో పురబాల అక్కడికి వస్తుంది. ఆమె ఒక కిరసనాయిలు దీపాన్ని చేత్తో వూపుతూ తీసుకువస్తుంది.

"దీపం వెలిగించి తీసుకురమ్మనిచెపితే నౌకరు మినుకు మినుకుమనే ఈ దీపం వెలిగించి తెచ్చాడు. వాడికి ఏపని చెప్పినా ఇంతే" అంది పురబాల.

"నాకు అంధకారమంటే ఎక్కువ ఇష్టమని వాడికి తెలుసుగదూ, అందుకని ఇలాంటిది తెచ్చాడు" అన్నాడు అతియబాబు భార్యతో.

"వెలుగు రావటంలేదా? ప్రార్థన జరుగుతుందా ఏమిటి. ఇదేదో అంతా కొత్తగా ఉంది" అని పురబాల చుట్టూ చూచింది.

"నౌకరు ముండాకొడుకు నన్ను చంద్రుడనుకొని ఉంటాడని చెప్పానుగదా" అన్నాడు అతియబాబు.

"ఓహో, అదా సంగతి. అయితే వాడిజీతం కొంచెం పెంచండి. అది సరేకాని, రసికదాదా, ఏమిటి ఇవ్వాళ జరిగినపని" అంది పురబాల.

"అమ్మాయీ, వరులు కావాలంటే అనేకమంది దొరుకుతారు, కానీ అందరూ తగినవారుగా ఉండరు. ఇవాళ జరిగింది అందుకొక సామాన్యమైన నిదర్శనము" అన్నాడు రసికదాదా.

"ఇలాంటి ఉదాహరణలు చూపించటం మాని వివాహానికి తగిన ఉదాహరణలు చూపితే బాగుంటుంది కదా!" అంది పురబాల.

"అక్కా, ఆ బాధ్యతను నేను తీసుకున్నాను" అని చెప్పింది శైలబాల.

"అది నేనెప్పుడో గ్రహించాను. ముఖర్జీ మహాశయునికీ నీకూ మధ్య జరుగుతున్న సలహా సంప్రదింపులనుబట్టి ఇలాంటిదేదో జరుగుతుందని అనుమానించాను" అంది పురబాల.

"ఇవాళ కిష్కింధాకాండ ముగిసిందికదా!" అన్నాడు అక్షయబాబు.

"లంకాకాండకుకూడా ఏర్పాట్లు జరుగుతున్నాయి. బ్రహ్మచారి సంఘమనే బంగారులంకలో చిచ్చుపెట్టించటానికి వెళుతుంది" అని చెప్పాడు రసికదాదా.

"అందులో శైలపాత్ర ఏమిటి?" అడిగింది పురబాల.

"అందులో ఆమే అగ్ని" అని జవాబుచెప్పాడు అక్షయబాబు.

"ఆమెను ఒక వ్యక్తి తోకపట్టుకొని తీసుకువెళతాడు" అన్నాడు రసికదాదా.

"ఇదంతా ఏమిటో నాకేమీ అర్థం కావటంలేదు. శైలా! నువ్వు బ్రహ్మచారి సంఘంలోకి వెళుతున్నావా?" అడిగింది పురబాల.

"నేను ఆసంఘంలో సభ్యురాలిగా చేరతాను" అంది శైలబాల.

"నువ్వనేదానికి ఏమీ అర్థంలేదు. బ్రహ్మచారి సంఘంలో స్త్రీలుకూడా సభ్యులుగా చేరవచ్చునా?" అంది పురబాల.

"ప్రస్తుతం స్త్రీలుకూడా చేరుతున్నారు. అందుకని నేను చీరధరించటం మాని లాగు చొక్కా ధరించాలని నిశ్చయించుకున్నాను" అని జవాబుచెప్పింది శైలబాల.

"అయితే, ఇప్పు డర్థమయింది; మారువేషంలో సభ్యురాలిగా చేరబోతున్నా వన్నమాట? జుట్టుకూడా కత్తిరించుకున్నావు, కనుక దానినిగురించి మరేమీ ఇబ్బంది

ఉండదు. మధ్య నాకెందుకు, మీ ఇష్టంవచ్చినట్లే కానివ్వండి" అంది పురబాల.

"అవునవును, నువ్వుమాత్రం పొరపాటునకూడా ఈ సంఘంలో చేరవద్దు. ఇష్టమైతే ఎందరు పురుష వేషాలు ధరించినా నాకేమీ ఇబ్బందిలేదు. నా అదృష్టంవల్ల నువ్వుమాత్రం ఎప్పుడూ స్త్రీగానే ఉండు — లేకపోతే 'బ్రీచ్ ఆఫ్ కాంట్రాక్టు' అని అది చాలా భయంకరమైన కేసు అవుతుంది" అన్నాడు అక్షయబాబు.

తరువాత అక్షయబాబు పురబాల నుద్దేశించి ఒక ప్రణయగీతాన్ని పాడసాగాడు. పాట ఒకచరణం అయేసరికి పురబాల అక్కడినుండి వెళ్ళిపోతుంది. అప్పుడు అక్షయబాబు శైలబాలకు ధైర్యంచెపుతూ "భయపడకు. కోపం వచ్చినప్పుడే మనస్సు శుద్ధి అవుతుంది — కొద్దిగా పశ్చాత్తాపంకూడా కలుగుతుంది — దానివల్ల చక్కని అవకాశం లభించవచ్చును" అన్నాడు.

"కోపో యంత్ర భ్రుకుటిరచనా నిగ్రహోయత్ర మౌనం।
యత్రాన్యోన్య స్మితమనునయో యత్ర దృష్టిః ప్రసాదః॥

అన్నాడు రసికదాదా.

"ఏం రసికదాదా, దివ్యమైన శ్లోకాలు వాగేస్తున్నావే — కోపమంటే ఏమిటో, అది ఎలా ఉంటుందో ముఖర్జీ మహాశయునికి బాగుగా తెలుసు" అంది శైలబాల.

"ఇదుగో అమ్మాయీ, అది నేను మార్చుకొనుటకు సిద్ధంగా ఉన్నాను. ఇకనుంచి ముఖర్జీమహాశయుడే శ్లోకాలు వాగుతారు, ఆకోపమేదో నామీదకువస్తే వక్రించిన ప్రార

గ్దానికి బంగారుతొడుగు వేయించుకొని ఉంచుకుంటాను" అన్నాడు రసికదాదా.

"ముఖర్జీ మహాశయా" అంది శైలబాల.

అక్షయబాబు అమితంగా భయపడినట్లు "అదుగో. మళ్ళీ ముఖర్జీ మహాశయా ఏమిటి! బాల బ్రహ్మచారులగు ఈ మునికుమారులకు ధ్యానభంగం కలిగించే పేచీలో నేను జోక్యం కలిగించుకోను" అన్నాడు.

"వారికి ధ్యానభంగం కలిగించేది నేను. వారిని ఈ భవనంలోకి తీసుకురావటం వరకే మీపని" అంది శైలబాల.

"అంటే బ్రహ్మచారిసంఘాన్ని కూకటివేళ్ళతో సహా పెకలించుకొని ఇక్కడికి తీసుకురావలసి ఉంటుందన్న మాట! ఇలాంటి అసాధ్య కార్యాలన్నీ ఈ ముఖర్జీ మహాశయుడే చేయాలి" అన్నాడు అక్షయబాబు.

శైలబాల నవ్వి "హనుమంతుడైన తరువాత ఇలాంటివన్నీ చేయక తప్పదేముంది. గంధమాదన పర్వతమును తీసుకురావలసి వచ్చినప్పుడు హనుమంతుని సహాయాన్ని కోరారుకాని నలుడు, నీలుడు, అంగదుడు మొదలగువారిని ఎవరడిగారు. ఇదీ అంతే" అంది.

"నీముఖం తగలడా, త్రేతాయుగంలోని ఆ కమురుకుపోయిన ముఖాలు తప్ప ఉదాహరణకు నీకు మరెవరూ దొరకలేదా? వాళ్ళంటే నీకు అంత ప్రేమా!" అని అడిగాడు అక్షయబాబు.

"అవును, వాళ్ళంటే చాలా ప్రేమ" అంది శైలబాల.

"కాలిన హృదయంలో చూడు
కాలిన ముఖాలే లేచాయి!
విశాల విశ్వంలో ఎందరో ఉన్నారు,
అయితే వాళ్ళందరూ లెక్కకురారు;
చూపుల బాణాలు
నన్నుతప్ప మరెవరినీ
కాల్చవద్దు!

"సరే, అలాగే చేద్దాం. ఆ మిడతల దండులోనుంచి కొన్నింటిని లేపి తోలుకువస్తాను. అయితే, వెంటనే నీ స్వహస్తాలతో నాకొక తాంబూలం తెచ్చిఇవ్వు" అన్నాడు అక్షయబాబు.

"అక్కగారి హస్తాలతో చుట్టినది వద్దా ఏమిటి"

"మీ అక్కగారి హస్తాలు ఇతర ఏర్పాట్లు చూస్తున్నాయి గదా, ఏదీగాక పాణిగ్రహణం జరిగిందెందుకు. ఈక్షణమందు వేరొకరి కోమల హస్తాలమీదికి దృష్టిని సారించే అవకాశం లభించింది" అన్నాడు అక్షయబాబు.

శైలబాల వ్యంగ్యంగా "మంచిదే మహాశయా, ఆ కోమల హస్తాలు మీ తాంబూలానికి మరింత సున్న పట్టిస్తాయి" అని అంది.

"మృత్యుదశ ఆవహించిన మనిషి,
వందరకాలుగా మరణిస్తాడు!
కాలిన మిడత మరింత కాలుటకు,
అగ్నిమధ్య దూకుతుంది!"

అంటూ అక్షయకుమార్ పాట పాడుతాడు.

"ముఖర్జీ మహాశయా, ఆ కాగితపు ఉండ ఏమిటి?" అని అడిగింది శైలబాల.

"బ్రహ్మచారి సంఘంలో చేరటానికి నువ్వు పూర్తి చేసిన అప్లికేషను, ప్రవేశరుసుము పదిరూపాయలనోటు జేబులో ఉంచి మరచిపోయాను. అక్షరమైనా కన్పించకుండా చాకలి ఉతికి వేశాడు. ఆ చాకలివాడు స్త్రీ స్వాతంత్ర్యానికి బద్ధవిరోధిగా కన్పిస్తున్నాడు, అందుకనే నీఅప్లికేషనును నామరూపాలు లేకుండా చేసివేశాడు" అని చెప్పాడు అక్షయబాబు.

"అర్థమయింది" అని అంది శైలబాల.

"దయాధర్మ భిక్షగా తెచ్చుకున్న జ్ఞాపకశక్తిగనుక ఇవన్నీ ఎక్కడ గుర్తుంటాయి" అని అక్షయకుమార్ పాట అందుకున్నాడు—

"అన్నము పున్నము తెలియని మనసు
అంతా మరచింది.
తరుణీ! చంద్రబింబమువంటి
నీ ముఖాన్ని మర్చిపోలేదు!"

శైలబాల, రసికదాదా వెళ్ళిపోయారు. అప్పుడే పురబాల లోనికివచ్చింది. ఆమెనుచూచి అక్షయబాబు "భర్తయే స్త్రీకి ఏకైక పవిత్రతీర్థము వంటివాడు. ఈ విషయాన్ని నువ్వు అంగీకరిస్తావా లేదా?" అని అడిగాడు.

"మీ శాస్త్రవిధానాలేమీ నాకు తెలియవు. నేను అమ్మవెంట కాశీవెళుతున్నానని చెప్పటానికి వచ్చాను" అని అంది పురబాల.

"ఇది సంతోషించదగిన శుభవార్తకాదే—మెచ్చి నీకేదైనా బహుమానం ఇవ్వాలని కోర్కెకలగటంలేదు" అని అన్నాడు అక్షయబాబు.

"ఇప్, హృదయం పగిలిపోతుందా? భరించలేకుండా ఉన్నారా?" అని అడిగింది పురబాల.

ఆ మాటవిని అక్షయబాబు ఇలా అన్నాడు—

"నేను తాత్కాలికమైన ఈ వియోగాన్నిగురించి ఆలోచించటంలేదు.—రెండురోజులు నువ్వు ఇక్కడ ఉండకపోయినా ఇంకా అనేకమంది ఉంటారు, ఒకవిధంగా ఈ దురదృష్టవంతుడే వెళ్ళిపోతాడు. కానీ, తరువాత జరిగేదేమిటో కూడా ఆలోచించాలిగదా! ఇలాంటి పుణ్యకార్యాలలో భర్తను మించిపోకూడదు—స్వర్గంలో నీకు డబుల్ ప్రమోషన్ లభించి నేను మరీ వెనకబడిపోతాను — (శ్రీ) మహావిష్ణువుయొక్క దూతలు నిన్ను రథాన్నెక్కించి తీసుకుపోతూఉంటే, యమదూతలు నన్ను చెవి మెలిపెట్టి మోకాళ్ళమీద నడిపించి నరకానికి తీసుకువెళతారు."

అక్షయబాబు మళ్ళీ పాట అందుకునేసరికి పురబాల "ఆగండి, ఆగండి" అని అంది.

"నేను ఆగిపోతే నువ్వే వెళతావా? పందొమ్మిదవ శతాబ్దపు శాస్త్రమిదేనా? ఒక్కదానివే వెళతావా?" అని అన్నాడు అక్షయబాబు.

"అవును, అంతే" అంది పురబాల.

"నన్ను ఎవరికి అప్పగించి వెళతావు?" అని అడిగాడు అక్షయబాబు.

"రసికదాదాకు అప్పగించి వెళుతున్నాను" అని చెప్పింది పురబాల.

"అమ్మో, నువ్వేలాంటి స్త్రీవనుకోవాలి, అప్పగించి వెళ్ళే సూత్రాలుకూడా తెలియవు. కనుక నేనే ఇక విరహావస్థలో తగిన కోమలహస్తాలను వెతుకుకొని ఆత్మసమర్పణ గావించుకోవాలి" అని అన్నాడు అక్షయబాబు.

"వెతకటానికి మీరెంతో శ్రమపడ నవసరంలేదు" అని అంది పురబాల.

"నా ప్రాణాలను ఎవరి హస్తాలలో ఉంచాలి!
ఇదే ఆలోచనలతో రోజంతా గడచిపోయింది!
ఇటు దృష్టిమరల్చిన అటు మనసు రోదిస్తుంది."

అంటూ అక్షయకుమార్ పాటగాపాడి "అయినా నేను నీ వియోగాన్ని భరించటానికి ఒకటి రెండు ఉపాయాలు లేకపోలేదు" అని మళ్ళీ పాట ప్రారంభించాడు.

"రక్షించండిబాబూ, మీ అంత్యానుప్రాస కవిత్వాన్ని ఇంతటితో ఆపండి" అని అంది పురబాల.

"ఇలాంటి దుఃఖసమయంలో నాలోనుంచి కవిత్వం దానంతటదే పుట్టుకొస్తుంది, ఆపటం నావల్లకాదు. అంత్యానుప్రాస బాగాలేదు, అది సరిగ్గా కుదరలేదు, నువ్వు దూరదేశాలకు వెళ్ళినతరువాత నేను 'ఆ రనాదవధ' అనే కావ్యాన్ని వ్రాస్తాను. ప్రాణేశ్వరీ, ఆ కావ్య ప్రారంభం ఎలా ఉంటుందో విను" అని పాట ప్రారంభించాడు అక్షయబాబు.

"మహాశయా, నేను ఎగతాళిచేయటంలేదు, మీరు నిజంగానే ఒక కావ్యంవ్రాయండి" అని అంది పురబాల.

"నువ్వు ఎగతాళిగా అనకపోతే నేను మొదటే అది అంత సుఖకరమైనది కాదని గ్రహించాను. పోతే, కావ్యం వ్రాయటమంటావా, అదేమంత తేలికపనిఅనికూడా అంగీకరించలేకపోయాను. నా బుద్ధికి ఒకచోట చిన్న రంధ్రం ఒకటి ఉంది, అందువల్ల దానిలో కావ్యం స్థిరంగా ఉండలేకపోతుంది— బుసబుసలాడుతూ బయటకు వచ్చేస్తుంది" అని అక్షయబాబు-మళ్లీ పాట అందుకున్నాడు—

"నా కావ్యవృక్షం కాయని
కారణం నీకు తెలుసు
పిందెలు పడకముందే
వికసించిన పుష్పాలన్నీ
వాడి రాలిపోతున్నాయి."

"ఇంతకూ అసలుసంగతిమర్చేపోయాను. తెలుసుకోవాలని కుతూహలపడి చస్తున్నాను. కాశీవెళుతున్నందుకు నీకింత ఉత్సాహం ఎందుకు? శ్రీ మహావిష్ణువుయొక్క దూతలను నేను మనసులోనే క్షమించివేశాను, కానీ భూతనాథ భవానీపతి దూతలవిషయంలోనే నాకు చాలా సందేహంగాఉంది. వందిమాగధులు, శివగణము అనేక విషయాలల్లో నాకంటె అధికులట. తిరిగివచ్చినతరువాత ఈ సేవకునియందు నీకు ఇష్టమే లేకపోవచ్చును."

ఇదంతావిని పురబాల "నేను కాశీకి వెళ్ళనేవెళ్ళను" అని అంది.

"ఏం, అదేంమాట. భూతభగవానునిలో సేవక గణము ఒకసారి మరణించి భూతములయ్యారు. వారు మళ్ళీ రెండోసారి మరణించాలా" అని అన్నాడు అక్షయబాబు.

అదేసమయంలో రసికదాదా లోనికివచ్చాడు. అతనినిచూచి పురబాల "ఇవాళ రసికదాదా ముఖం చాలా సంతోషంగా ఉన్నట్లుంది ఎందుకనో?" అని అంది.

"ఈ రసికదాదా ముఖంలో అలాంటి రోగలక్షణాలు ఎప్పుడూ ప్రవేశించవు. మాటాగీటా ఏమీలేకుండానే సంతోషంగా ఉండే వివాహితుల్ని చూసే నాకు మనసులో చాలా ఈర్ష్యగాకూడా ఉంటుంది" అని అన్నాడు రసికదాదా.

"వివాహితులారా, విన్నారా రసికదాదామాటలు- దీనికి తగిన జవాబుచెప్పక తప్పదు" అని అంది పురబాల.

"మా సంతోషాన్ని గురించి ఈ ముసలివానికేమి తెలుసు. అది మహా గొప్పదైనవిషయం-ఇంతవరకు దానిని గురించి తెలుసుకోలేకపోయారు — వెతికి పట్టుకోటానికి కూడా అంతుచిక్కని గంభీరవిషయం అది - ఒకొక్కప్పుడు అసలు అది ఉన్నదా లేదా అనికూడా సందేహం కలుగుతూ ఉంటుంది" అని అన్నాడు అక్షయబాబు.

"ఇప్పుడు అర్థమయింది" అంటూ పురబాల కోపంగా వెళ్లటానికి సిద్ధమవుతుంది.

అక్షయబాబు ఆమెను వెళ్ళకుండా ఆపి ఇలా అన్నాడు—"నీమీద ఒట్టే, ఈ మనిషి ఎదుట మాత్రం కోపగించుకోవద్దు—ఇతనికి మరింత ఈర్ష్యకలిగే ప్రమాదం

ఉంది. దాంపత్య తత్వానుభవహీనా ముసలిషాడా, చూచావూ, మాకు కోపము వచ్చినప్పుడు సహజంగానే మా కంఠస్వరము తీవ్రమవుతుంది; అదే మీ చెవులకు విన వస్తుంది; ప్రేమాతిశయంతో మా గొంతులు మూగపోయి నప్పుడు మీరు చెవియొగ్గి వినాలని ఎంతప్రయత్నించినా మాటలు తడబడి స్పష్టంగా వినలేరు—ఆ మాటల్ని మీరు వూహించనైనాలేరు."

"అయ్యోరామ, అంతటితో ఆపండి" అని అంది పురబాల అక్షయబాబు మాటలకు అడ్డొస్తూ.

"తమకు కావలసిన ఆభరణాల జాబితా తయారయి నప్పుడు కంసాలి మొదలు ఇంటియజమానివరకు అందరికీ ఇది బహిరంగమయ్యే విషయమే, కానీ అదే ఒకానొక వసంతపురాత్రి ప్రేయసి—"

పురబాల మధ్యలో అడ్డొస్తూ "రామరామ, నవ్వి పోతారు, ఆపండి" అని అన్నది.

"వసంతపురాత్రి ప్రేయసి" అని అక్షయబాబు మళ్ళీ చెప్పనారంభించేసరికి పురబాల అడ్డుతగులుతూ "అయ్యో, మీరు చెప్పేదానికి అర్థమేమైనా ఉందా? ఆలోచించే మాట్లాడుతున్నారా?" అని అంది.

అయినా అక్షయబాబు ఆగకుండా "వసంతపురాత్రి ప్రేయసి 'నేనిక్కడ ఒక్కక్షణంకూడా ఉండను. నా ఎము కలు హూనమైపోతున్నాయి, రేపే మా తల్లిగారింటికి వెళ్ళిపోతాను' అని గర్జించినప్పుడు—" అంతవరకు చెప్ప గానే పురబాల అతని మాటలకు అడ్డొచ్చి ఇలా అంది—

"ఏం మహాశయా, మీ ప్రేయసి ఆ విధంగా పుట్టింటికి పోతానని ఎప్పుడు గర్జించిందో ?"

"చరిత్రనే పరీక్షించటమా? జరిగిన ఘటననుగురించి చెప్పినంతమాత్రాన సరిపోదా ? సంవత్సరము, తేదీ, వారము మొదలగు వివరాలన్నీ అందరికీ వెల్లడి చేయాల్సిందేనా ? నా చరిత్రను నలుగురూ తెలుసుకోతగినంత ప్రతిభావంతుడనా నేను?" అని అన్నాడు అక్షయబాబు.

అప్పుడు రసికదాదా పురబాలతో ఇలా అన్నాడు – "అమ్మాయీ, అర్థమయింది, నిన్నుగురించి చెప్పటం అతనికి అంత కష్టమైన విషయమేమీకాదు, చెప్పకుండా ఉండగలిగినంత ఓర్పు అతనిలో లేదు — అందుకని విషయాన్ని తలక్రిందులుచేసి చెప్తున్నాడు; గౌరవంవల్లనో లేదా సిగ్గువల్లనో కాని తిట్టినా గౌరవించాల్సిందే. "

"మంచిది మల్లినాథ మహాశయా, మీరిక ఎక్కువగా దుఃఖించవలసిన అవసరంలేదు. చివరికి అమ్మగారు తన వెంట కాశీకి మిమ్మల్నే తీసుకువెళ్లాలని నిశ్చయించుకొంది" అని చెప్పింది పురబాల.

"అది మంచిదేకదా, ఇందులో భయపడాల్సిందేముంది, తీర్థయాత్రలకు వెళ్ళవలసిన వయస్సు. ప్రస్తుతము మీ చంచలవీక్షణములు ఈ ముసలివానినేమీ చేయలేవు– ఇప్పుడు నా మనస్సు ఆ చంద్రచూడుని చరణముల యందు—

శ్లో॥ ముగ్ధస్నిగ్ధవిదగ్ధలుబ్ధమధురైర్లోలైః కటాక్షైరలమ్।
చేతః సంప్రతి చంద్రచూడచరణ ధ్యానామృతే వర్తతే॥"

అని అన్నాడు రసికదాదా.

"అది మంచిదేకదా! ఇకనుంచి చంచలవీక్షణము లను నీపైన ఖర్చుచేయదలచటంలేదు, ఇక మీరు ఆ చంద్ర చూడుని చరణసన్నిధికి చేరుకోవాలి గనుక అమ్మను పిలవ మంటారా?" అని అడిగింది పురబాల.

రసికదాదా చేతులు జోడించి నమస్కరిస్తూ పుర బాలతో ఇలా అన్నాడు— "ఇదుగో పెద్దమ్మాయీ, మీ అమ్మగారు నన్ను సంస్కరించాలని, నాలో మార్పు తీసుకురావాలని చాలా ప్రయత్నించారు, అయితే ఆమె సంస్కరణ కార్యాన్ని ఏ దుర్ముహూర్తంలో ప్రారంభిం చిందో కానీ దానివల్ల ఏమీ ఫలితం ఉండబోదు. అదీ గాక బ్రహ్మదేవుని దయవల్ల ఇంకా జీవించటానికి ఆయువు ఉంది. చంచలవీక్షణములు జీవితాంతం ఉంటే ఉండ వచ్చునుగానీ జీవితంలో నాలోమార్పు అనేదిసంభవంకాదు. ఆమె ఎలాగో కాశీయాత్ర వెళుతుంది, ఈ వృద్ధశిశువు బుద్ధిలో మార్పువచ్చి అభివృద్ధిగాంచుతాడనే దురాశను వీడి ఆమె కొంతకాలమైనా ప్రశాంతంగా ఉండకుండా మీరు నన్ను మళ్ళీ ఆమెవెంట పంపి ఆమెకు కష్టం కలి గించాలని ఎందుకు చూస్తున్నారు?"

రసికదాదా మాట ముగిసేలోపల జగత్తారిణీదేవి అక్కడికి వచ్చింది. ఆమె అక్కడికి వచ్చీరావటమే "నేను వచ్చాను నాయనా" అని అంది.

అందుకు అక్షయబాబు ఇలా అన్నాడు—"మీరు

వెళ్ళరా అమ్మా? రసికదాదా ఇందాకటినుంచి చాలా బాధపడుతున్నాడు. మీరు.....”

రసికదాదా వ్యాకులపడుతూ “అదికాదమ్మా, అక్షయబాబు ఏదిమాట్లాడినా హాస్యంగానే మాట్లాడతారు, నాకెందుకు బాధ కలుగుతుందమ్మా! నేనెందుకు బాధ పడతాను” అని అన్నాడు.

“పెద్దమ్మగారు నిన్ను తీసుకువెళ్ళకుండా ఒక్కరే కాశీవెళుతున్నారని అన్నావుగదటయ్యా” అని అన్నాడు అక్షయబాబు.

“అవును, ఆమాట అన్నాను. మనసులో బాధగానే ఉంది, అయినా అమ్మగారు ఒక్కరే—”అని మధ్యలోనే ఆపేశాడు. వెంటనే జగత్తారిణీదేవి అందుకొని “దూర దేశంలో మీ రసికదాదాను ఎవరు సంబాళించుకుంటారు నాయనా. వారివెంట బజారుకు వెళ్ళటంకూడా భయమే నాకు” అని అన్నది.

“అదేమిటమ్మా, రసికదాదాను వెంట తీసుకువెళితే నీకు సహాయంగా ఉంటాడుగదా!” అని అంది పురబాల.

“నాకు సహాయపడటానికా, ఇక నాతిప్పలు ఆదేవునికే తెలియాలి. మీ రసికదాదా తెలివితేటలు ఇంతకు ముందు చాలాసార్లు చూచాను” అని జవాబు చెప్పింది జగత్తారిణీదేవి.

రసికదాదా ఆ మెమాటలు విని బట్టతలను సవరించుకొంటూ నెమ్మదిగా ఇలా అన్నాడు—“అమ్మా, నాలో ఉన్న తెలివితేటలేమిటో వాటిని నేనెన్నడూ దాచుకోటా

నికి ప్రయత్నించలేదు, ఏనాటికైనా అవి మీకు తెలియక తప్పదుగనుక నేను అందుకుప్రయత్నించలేదు. విరిగిపోయిన చక్రము గరగరమంటూ చప్పుడు చేస్తూనే ఉంటుంది, ఆ చప్పుడువిని విరిగిన చక్రమని నలుగురూ ఇట్టే తెలుసుకో గలుగుతారు. అందుకనే, నేనిలా ఒకమూల పడివుండటం మంచిదనుకొంటున్నాను, కానీ మీరు నన్ను నడిపించ కుండా వదలటంలేదు"

"అయితే, నేను హారాన్‌గారింటికి వెళ్ళి అటునుంచి అటే వాళ్ళబండిలో స్టేషనుకు చేరుకుంటాను. అమ్మాయీ పురబాలా, మీకు మంచి చెడుతో నిమిత్తంలేదు గనుక ఆ సమయానికి స్టేషనుకు చేరుకోండి" అని చెప్పింది జగత్తారిణీదేవి.

"అమ్మా, నేను కాశీయాత్రకు రావటంలేదు" అని అంది పురబాల.

పురబాల అకస్మాత్తుగా ప్రయాణం మానుకున్నట్లు తెలియజేసేసరికి జగత్తారిణీదేవి బాధపడుతూ అల్లునివైపు చూడసాగింది. అత్తగారి మనోభావాన్ని గ్రహించి అక్షయ బాబు "అదెలా కుదురుతుంది. అమ్మగారివెంట నువ్వు వెళ్ళకపోతే ఆమెకు చాలా బాధ కలుగుతుంది, అక్కడ ఆమెకు ఏదైనా కావలసివస్తే ఎవరు చూస్తారు?" అని పుర బాలతో చెప్పి అత్తగారితో "అమ్మా, మీరు వెళ్ళండి, నేనీమెను స్టేషనుకు తీసుకువస్తాను" అని చెప్పాడు.

అల్లునిమాటలు విని జగత్తారిణీదేవి నిశ్చింతగా అక్కడినుంచి వెళ్ళిపోతుంది. రసికదాదా బట్టలను సవ

రించుకొంటూ ముందు సంభవించబోయే వియోగబాధను ముఖంలో ప్రదర్శించటానికి ప్రయత్నిస్తాడు. అదేసమయా నికి పురుష వేషంలోఉన్న శైలబాల అక్కడికి వస్తుంది.

"అయ్యా, తమరెవరు?" అని ప్రశ్నించాడు అక్షయ బాబు.

"అయ్యా, మీ భార్యతో నాకు ముఖ్యమైన దగ్గర సంబంధం ఉంది" అంటూ శైలబాల అక్షయబాబుతో కర చాలనంచేసి "ముఖర్జీమహాశయా, గుర్తించలేకపోయారా?" అని అంది.

"ఇదేమైనా ఆశ్చర్యమా? సిగ్గులేదూ?" అని అంది పురబాల శైలబాల వేషాన్ని చూచి.

అందుకు శైలబాల ఇలా జవాబు చెప్పింది— "అక్కా సిగ్గు స్త్రీలకు అందం—పురుష వేషం వేయగానే దానిని వదలి వేయక తప్పదు. ఇలాగే బావగారు ఆడ వేషం వేసినట్లయితే సిగ్గుతో తలెత్తికూడా చూడలేరు. రసిక దాదా, మీరేమీ మాట్లాడకుండా వూరుకున్నారేమిటి?"

"ఆహా, శైలా! కిశోరకామదేవునివలె ఉంది. సాక్షాత్తు కార్తికేయుడు భవానీమాత ఒడిలోనుంచి లేచి వచ్చినట్లుగా ఉంది. ఈమెను శైలబాలగా ఎప్పుడూ చూస్తూ ఉన్నందువల్ల ఈమె అందమైనదా, సాధారణ మైనదా లేక మధ్యస్థంగా ఉంటుందా అనేది ఎప్పుడూ ఆలోచించలేదు. కానీ ఇవాళ వేషంమార్చుకొని వచ్చే సరికి అపూర్వసుందరివలె కన్పిస్తూఉంది. అమ్మాయీ పురబాలా, నువ్వు సిగ్గులేదని అన్నావు, కానీ నేనలా అన

లేను. ఆమెను చూస్తూఉంటే దగ్గరకు తీసుకొని, తలనిము రుతూ ఆశీర్వదించాలని కోర్కె కలుగుతూ ఉంది" అని అన్నాడు రసికదాదా.

స్నేహాభరితమగు గంభీరదృష్టితో అతుయబాబు పురుష వేషములో ఉన్న శైలబాలను చూస్తూ ఇలా అన్నాడు—"శైలా, నువ్వు నాకు మరదలుగాగాక తమ్ము నిగా ఉన్నప్పటికీ నాకెలాంటి అభ్యంతరమూ ఉండేది కాదు."

శైలబాల కొంచెము చలించి "ముఖర్జీమహాశయా, అందుకు నాకుకూడా ఎలాంటి అభ్యంతరమూలేదు" అని అంది.

పురబాల ఆమెను దగ్గరకు తీసుకొని "ఈవేషంలో నువ్వు బ్రహ్మచారిసంఘంలో చేరటానికి వెళుతున్నావా?" అని అడిగింది.

"ఇదికాకుండా మరే వేషంలోనైనా వెళితే వ్యాకరణ దోషంవస్తుంది, అక్కా. ఏమంటావు రసికదాదా ?" అని అంది శైలబాల.

"అవునవును, వ్యాకరణాన్ని తప్పించుకొని నడుచు కోవలసిందే. పాణిని భగవానుడు, బోపదేవుడు మొదలగు వారు మరెందుకు జన్మించారు! అయితే, శ్రీమతి శైల బాలకు చొక్కాలాగు అనే ప్రత్యయాలు తగిలించినంత మాత్రాన వ్యాకరణము తప్పుకాకుండా ఉంటుందా?" అని అన్నాడు రసికదాదా.

"అలా అని నవీనముగ్ధబోధ్‌లో వ్రాసే ఉంది.

బ్రహ్మచారి సంఘములోని మూర్ఖులను శైల ఏప్రత్యయము చేయిస్తే అదేచేస్తారని నేను వ్రాసిస్తాను. ఆ యువకుల ధాతురూపం నాకు తెలియనిదేముంది" అని అన్నాడు అభయబాబు.

పురబాల దీర్ఘంగా నిట్టూర్చి "ఇదుగో శైలా, నీకు వంతపాడటానికి మీముఖర్జీ మహాశయుడు, వృద్ధరసికదాదా ఉండనేఉన్నారు, నీఇష్టంవచ్చిన నాటకం ఆడవచ్చును. నేనుమాత్రం అమ్మగారివెంట కాశీవెళతాను" అని అన్నది.

ఈమాట అని పురబాల సామాను సర్దుకోటానికని వెళ్లిపోయింది. ఇంతలో నృపబాల నీరబాల లోనికి వచ్చారు. ఎవరో కొత్తయువకుడు కన్పించేసరికి తిరిగిఇద్దరూ బయటకు పారిపోవాలని చూస్తారు. నీరబాల తలుపుచాటు నుంచి ఒకసారి ఆయువకునివైపు పరిశీలనగా చూచి ఆశ్చర్యంగా "చిన్నక్క" అంటూ పరుగున దగ్గరకు వచ్చింది.

"చిన్నక్కా, నిన్ను గట్టిగా కౌగలించుకోవాలని కోర్కెకలుగుతూఉంది. కానీ ఈచొక్కా చాలాబాధగా ఉంది. నువ్వు అందమైనకథలోని రాకుమారునివలె ఉండి, విశాలమైన వనమైదానములు దాటి మమ్మల్ని ఉద్ధరించటానికి వచ్చినట్లున్నావు" అని అంది నీరబాల.

నీరబాల బిగ్గరగా మాట్లాడుతూ ఉండటం విని ధైర్యం తెచ్చుకొని చాటున ఉన్న నృపబాలకూడా అక్కడికి వచ్చి ఆశ్చర్యంగా చూస్తూ నిలబడింది.

నీరబాల నృపబాల చేతినిపట్టుకొని లాగుతూ "మరీ

అంత ఆశగా తినేసేటట్లు చూస్తావెందుకు, నువ్వనుకున్నట్లు ఇతడు నీ దుష్యంతుడేమీ కాదు—ఇది మన చిన్నక్క వేషము" అని అన్నది.

రసికదాదా ఒక శ్లోకం చదివాడు—

శ్లో॥ ఇయమధిక మనోజ్ఞా చాపకానేనాపి తన్వీ।
కిమివ హి మధురాణాం మండనం నాకృతీనాం॥

"మూర్ఖురాలా, నువ్వు ఆ చొక్కాను చూచి అంత మోహిస్తున్నావు. అదంతా పైడాబు. పైడాబుకు అంత విలువా? ఇటుచూడు, కలతీలేని బంగారము నీ కోసము తహతహలాడుతూ ఉంది" అని అన్నాడు అక్షయబాబు.

"ప్రస్తుతకాలంలో స్వచ్ఛమైన బంగారము చాలా గిరాకీగా ఉంది, కనుక మాకు పై మెరుగులు చాలును. అక్కా, అంతేగదూ!" అని అంది నీరబాల. ఈమాట అంటూ నీరబాల శైలబాల తగిలించుకున్న మీసాలమీద చేయివేసి చూస్తుంది.

రసికదాదా తనవైపు చూపించుకుంటూ "స్వచ్ఛమైన ఈ బంగారము అతి చౌకగా పోతుంది — ఇప్పటికీ ఏ టంకసాలలోనూ దీనిమీద ఏ రాణీగారి ముద్రకూడా పడలేదు" అని అన్నాడు.

"అయితే, చాలా మంచిదే, చిన్నక్కకు దానం చేస్తున్నాను" అంటూ నీరబాల రసికదాదా చేతిని పట్టుకుని నృపబాల చేతిలో పెడుతూ "అంగీకారమేనా?" అని అడిగింది నృపబాలను.

"నాకు అంగీకారమే" అని అంది నృపబాల.

ఈమాట అని ఆమె రసికదాదాను ఒక బల్లమీద కూర్చోబెట్టి అతని తలమీది తెల్లని వెంట్రుకలను ఏరి వేయ సాగింది. నీరబాల శైలబాల పెట్టుకున్న మీసాలను దువ్వి నిలబెట్టటానికి ప్రయత్నిస్తూఉంది.

"అయ్యయ్యో, ఇదేమి పని? నా మీసాలు వూడి పోతాయి" అని అంది శైలబాల.

"అమ్మాయీ, వాటిసంగతి నీ కెందుకు? ఇటురా. ఈ మీసాలు నువ్వేమిచేసినా వూడిరావు" అని రసికదాదా తన మీసాలను చూపిస్తూ అన్నాడు.

"మళ్ళీ రెండవ పర్యాయమా! చిన్నక్క చేతిలో పెట్టిన దెందుకుమరి! అదిసరేగాని రసికదాదా నీ జుట్టులో ఇంకా ఎక్కడైనా ఒకటిరెండు నల్లని వెంట్రుకలు ఉన్నాయి, మీసాలు పూర్తిగా పండిపోయా యేమిటి?" అని అడిగింది నీరబాల.

"కొందరికి తలకంటెముందు నోరు పండిపోతుంది" అని జవాబు చెప్పాడు రసికదాదా.

"నేనిక ఒకసారి బ్రహ్మచారుల సంఘం ఎలా ఉన్నదో పరిశీలించి వస్తాను" అని అన్నాడు అక్షయ బాబు.

నీరబాల ఈ క్రింది పాట పాడుతుంది—

జయయాత్రకు బయలు దేరుడి దే,
మీ జయ రథము నధిరోహించుడి దే!
అందమైన వరమాలను గుచ్చి
నిరీక్షించుచుండెద నేను;

మార్గములో కొంగుపరచి,
ఆశతోడ ఎదురు చూచుచుండెదను;
విజయము చేకొని తిరిగివచ్చి
నా హృదయములో వసింపుము!!

"బాలా, రథము సిద్ధముగా ఉన్నది. ఏమి తేవలయు నని నీ కోర్కె" అని అడిగాడు అజయబాబు.

—నీరబాల పాట—

అశ్రుపూరిత నయనాలలో,
దరహాసరేఖను తీసుకురా!
పాడుబడిన నిర్జన ఉద్యానవనములో,
నవ వసంతశోభను తేవాలి!
సుందర స్వర్ణదీపము వెలిగించి
ఈ గృహమును వెలుగుతో నింపు!
నల్లని ఈ నిశీథి నుదుట
చంద్రుడనే తిలకము దిద్దు!

ఆమె పాటవిని అజయబాబు "అన్నీ బాగానే ఉన్నాయి, కానీ నీ జాబితాలోని అందమైన బంగారుదీపనే కొంచెం కష్టంగా కనిపిస్తుంది. ప్రయత్నంలో ఎలాంటి లోపమూ రానివ్వను" అని అన్నాడు.

"ముఖర్జీ మహాశయా, మా అక్కచెల్లెండ్రందరూ సభ తీర్చేదెక్కడ?" అని అడిగింది నీరబాల.

"దానికేముంది, నా గది ఉన్నది కదా!" అని అన్నాడు అజయబాబు.

"అయితే ఆ గదిని అలంకరించాలి" అని అన్నది నీరబాల.

"ఇంతకాలంనుంచి నేను ఉపయోగించుకొంటు న్నానుగదా! ఒక్కనాడైనా దానిని అలంకరించాలని మీకు ఆలోచన వచ్చిందా?" అని అడిగాడు అక్షయ బాబు.

"నీ గదిని వూడ్చటానికి పనిమనిషి ఉన్నది కదా, అయినా మీకు సంతృప్తి లేనట్లుంది" అన్నది నీరబాల. ఆమె ఆ మాట అంటూ ఉండగానే పురబాల లోనికివచ్చి "ఏమిటది?" అని అడిగింది.

"అక్కా, ముఖర్జీమహాశయునివద్ద పాఠం చదవాలని వచ్చాను. అందుకని వారు తమగదిని తుడిచి అలంకరించే వరకు పాఠము చెప్పనని అంటున్నారు. చిన్నక్క నేను వెళ్ళి ఆ గదిని వూడ్చి శుభ్రం చేస్తాము. రా అక్కా" అని నీరబాల నృపబాల చేతిని పట్టుకొని లాగింది.

నృపబాల తనచేతిని వదిలించుకొని "కావాలంటే నువ్వువెళ్ళి ఆపనులేమిటో చూచుకో-నేనుమాత్రం రాను" అని చెప్పింది.

"పాపం! ఎంత ఆశ? నేను ఒక్కదానినేవెళ్ళి శ్రమ పడి ఆ గదంతా బాగుచేస్తే మీరందరూ కూర్చొని కులకు దామనుకొంటున్నారా? అలా కుదరదు" అని అన్నది నీరబాల. ఈ మాట అని ఆమె నృపబాలను గట్టిగా పట్టు కొని తీసుకు వెళుతుంది.

"సామానులన్నీ సర్ది వేశాను. రైలుకు ఇంకా సమయం ఉన్నదా?" అని అడిగింది పురబాల.

"ప్రయాణం విరమించుకోదలచిన యెడల రైలుకు ఇంకా చాలా సమయం ఉంది" అని అన్నాడు అక్షయ బాబు.

# 2

చంద్రబాబు కలకత్తాలోని ఒక కాలేజీలో లెక్చరరుగా ఉంటున్నాడు. చిరకుమారసభ అనే బ్రహ్మచారి సంఘానికి వారు అధ్యక్షులు. వారింటిలోనే ఒక గదిని చిరకుమార సభ ఆఫీసుగా ఉపయోగించుకొంటున్నారు. ఒక నాడు అదే ఆఫీసుగదిలో బ్రహ్మచారి సంఘములోని ఇద్దరు సభ్యులు శ్రీశబాబు, విపినబాబు కూర్చొని మాట్లాడు తున్నారు. అంతకుముందు జరిగిన సంభాషణ ననుసరించి శ్రీశుడు "నువ్వెన్ని చెప్పినా అక్షయబాబు హయాములో మన సంఘము ఇంతకంటె ఉన్నతస్థితిలో ఉండేది. ప్రస్తుతం మన అధ్యక్షులు చంద్రబాబుగారి స్వభావము చాలా కఠినంగా ఉంటుంది" అని అన్నాడు.

"అక్షయబాబు హయాములో మన సంఘము మంచి రసవంతంగా ఉన్నమాట యదార్థమే, కానీ ఆజన్మబ్రహ్మచర్య వ్రతానికి మరీ అంత రసవంతంగా ఉండటం మంచిది కాదు అని నా అభిప్రాయం" అని అన్నాడు విపినుడు.

"నా అభిప్రాయం అందుకు పూర్తిగా వ్యతిరేకంగా ఉంటుంది. మన బ్రహ్మచర్య వ్రతదీక్ష చాలా కఠినమైనది

కనుక కొంత రసవంతంగా ఉండటమనేది దానికి చాలా అవసరం. ఎండుమట్టిలో విత్తనాలు చల్లితే అవి మొలకెత్తుతాయా? దానికి నీరు అవసరం లేదా? 'జీవితాంతం వివాహం చేసుకోము' అని ప్రతిజ్ఞ చేసినంత మాత్రాన సరిపోతుందా, ఇక అన్నివిధాలా కృశించి చావటమే మార్గమా?" అని అడిగాడు శ్రీశుడు.

అందుకు విపినుడు ఇలా అన్నాడు — "ఏది ఎలా ఉన్నప్పటికీ అక్షయబాబు బ్రహ్మచారి సంఘాన్ని వదలి వెళ్ళి వివాహం చేసుకున్ననాటినుంచి మన సంఘంలో ఒక విధమైన బలహీనత ప్రవేశించింది. లోలోపల మనదీక్ష సడలిపోయింది."

"అలాంటిదేమీ లేదు; నన్ను గురించి చెప్పాలంటే అంతకుముందుకంటె నేను నా కర్తవ్యనిర్వహణలో మరింత దృఢంగా ఉన్నాను. ప్రతిఒక్కరూ ఆచరించగల వ్రతమైతే ఇంత శ్రద్ధ ఉండేది కాదేమో!" అని అన్నాడు శ్రీశుడు.

"ఒక సంతోషకరమగువార్త చెపుతాను వింటావా!" అని అడిగాడు విపినుడు.

"ఏమిటది? నీ కెక్కడైనా వివాహసంబంధం కుదిరిందా?" అని అడిగాడు శ్రీశుడు.

"మీ ధేనతితోనే కుదిరింది. ఇక నీ ఎగతాళి అంతటితో చాలించు. పూర్ణ మన బ్రహ్మచారి సంఘములో సభ్యుడిగా చేరాడని నీకు తెలుసా?" అని అన్నాడు విపినుడు.

శ్రీశుడు ఆశ్చర్యపడుతూ "ఏమిటీ! పూర్ణ మన

సంఘములో సభ్యుడుగా చేరాడా? అంటే రాయి నీటిలో పడిందన్నమాట!" అని అన్నాడు.

"రాయి దానంతటదే పడదయ్యా బాబూ! దానిని మరొకరు నీటిలోపలికి విసరివేశారు" అని అన్నాడు విపినుడు.

"మిత్రమా విపిన్, పూర్ణ తనంతటతానుగా బ్రహ్మచారి సంఘములో చేరాడంటే అందుకు నాకు సరియైన కారణమేదీ కన్పించటంలేదు. మన సంఘములో అతనికి కావలసిన కేశికాకర్షణా, చుంబకాకర్షణలుగానీ ఏమీ లేవే!" అని అన్నాడు శ్రీశుడు.

శ్రీశుని మాటలు విని విపినుడు "అవన్నీ లేవని ఎవరన్నారు. తెరచాటున ఉన్నాయి" అని అన్నాడు.

"అదేమిటో అర్థమయ్యేట్లు స్పష్టంగా చెప్పు. నువ్వు తెలుసుకున్నదెంతవరకు నిజమో నేనూ ఆలోచిస్తాను" అని అన్నాడు శ్రీశుడు.

"పూర్ణ మన సంఘములో చేరిననాటినుంచీ నేను ఒక కంట కనిపెట్టి చూస్తూనే ఉన్నాను. అతని దృష్టి ఆ ద్వారానికి వ్రేలాడే తెరచాటున ఉన్న రహస్యాన్ని తెలుసుకోటానికి తహతహలాడుతూ ఉంటుంది. అందులోని రహస్యమేమిటా అని నేనుకూడా తెలుసుకోవాలని ప్రయత్నించాను. తెర క్రిందిభాగాన నాకు రెండుపాదాలు కన్పించాయి. అతని తహతహ ఆ చరణదర్శనము కోసమేనని నేను వెంటనే గ్రహించాను. ఇకనుంచి అతడు మరింతపట్టుదలగా

బ్రహ్మచారి సంఘపు కార్యకలాపాలలో పాల్గొంటాడని కూడా నా కర్థమయింది" అని చెప్పాడు విపినుడు.

"ఆ చరణద్వయపు పరమతత్వమును బాగా గ్రహించాడా? ఒకదానినిగురించి కొద్దిగా తెలిసినప్పుడు మనస్సు తహతహలాడుతుంది, కానీ అనేకసార్లు దానినిగురించి పూర్తిగా తెలుసుకున్నప్పుడు మనస్సుకు శాంతి లభిస్తుంది. ఇంతకూ ఆ చరణద్వయము ఎవరిదో చెప్పావుకాదు" అని అడిగాడు శ్రీశుడు.

అప్పుడు విపినుడు ఈవిధంగా చెప్పసాగాడు— "అయితే ఆ చరిత్రనంతా చెపుతాను, విను. సాయంత్ర సమయాలందు పూర్ణ చంద్రబాబువద్దకు వచ్చి వారు వ్రాసుకున్న నోట్సు అడిగి తీసుకు వెళుతూ ఉంటాడనేది నీకు తెలుసుగదా! ఒకనాడు పూర్ణ, నేను కొంచెము ఇంచుమించుగా ఒకేసారి చంద్రబాబుగారింటికి చేరుకున్నాము. చంద్రబాబుగారుకూడా అప్పుడే ఏదో మీటింగుకు వెళ్ళి వచ్చారు. లాంతరు వెలిగించి పెట్టారు — పూర్ణ ఏదో పుస్తకం తిరగేస్తూ కూర్చున్నాడు — ఇంతలో ఏమి జరిగిందనుకున్నావు! బంకింబాబు నవలలోని అపూర్వ సౌందర్యవతి ఒకామె నల్లగా నిగనిగలాడే వాలుజడతో లోపలినుంచి అక్కడికి వచ్చింది."

"ఏమి టేమిటీ, నువ్వు చెప్పినదంతా యదార్థమేనా?" అని అడిగాడు శ్రీశుడు.

"పూర్తిగా విను. ఒక చేతితో చంద్రబాబు కోసం ఫలహారపు పళ్ళెమును మరొక చేతితో మంచినీళ్ళగ్లాసు

పట్టుకొని ఆమె గదిలోకి వచ్చింది. అక్కడ మమ్మల్ని చూడగానే సిగ్గుతో ఆమె ముఖం ఎఱ్ఱబడింది. నమస్కరించటానికిగానీ, తలమీద ముసుగును సవరించుకోటానికిగానీ అవకాశం లేక గబగబ పళ్లెమును, గ్లాసును బల్లమీద ఉంచి లోనికి పారిపోయింది. వెంటనే నా దృష్టి పూర్ణమీదికి మళ్ళించాను. నల్లగా నిగనిగలాడే ఆ జడతోపాటు అతని మనస్సుకూడా ఎక్కడికో పోయినట్లు నేను గమనించాను. ఆ బ్రహ్మదేవుడుకూడా ముప్పదిమూడుకోట్ల దేవతలతోపాటు సిగ్గును వదలివేశాడు.నిజంచెప్పాలంటే సౌందర్యానికి మెరుగులు దిద్దాడు" అని అన్నాడు విపినుడు.

"అంటే ఆమె చాలా అందంగాఉన్నదా ఏం?" అని అడిగాడు శ్రీశుడు.

"చాలా అందంగా ఉంటుంది. అకస్మాత్తుగా ఒక్క మెఱుపు మెరిసినట్లు మెరిసి మా మతులు పోగొట్టింది" అని వ్యాఖ్యానించాడు విపినుడు.

అందుకు శ్రీశుడు తన విచారాన్ని వ్యక్తంచేస్తూ, "ఆహా, నే నెప్పుడూ చూడనే లేదు. ఇంతకూ ఆ అమ్మాయి ఎవరు?" అని అడిగాడు.

"మన అధ్యక్షులవారి మేనకోడలు. అమ్మాయి పేరు నిర్మల" అని చెప్పాడు విపినుడు.

"మేనకోడలా? అయితే గొప్ప చిక్కేవచ్చిందే! ఇక్కడే ఉంటున్నదా?" అని అడిగాడు శ్రీశుడు.

"ఇక్కడే ఉంటుందయ్యా స్వామీ! మన అధ్యక్షుల

వారు ఆరోగ్యవంతులే కానీ ఈ అంటు జాడ్యాన్ని వెంటేసు కొని తిరుగుతున్నారు" అని అన్నాడు విపినుడు.

"మేనకోడలు భర్తవద్దగైరా పీడా లేదనుకొంటాను!" అని అడిగాడు శ్రీశుడు.

"ఇప్పుడు వచ్చిన చిక్కే-అది. ఆ పీడాయే పరిణతి చెందని రూపంలో బ్రహ్మచారి సంఘంలో జొరబడింది. పూర్ణ పరిణతిచెంది బయటికి వెళ్ళిపోయినప్పుడు బ్రహ్మ దేవుడు మన బ్రహ్మచారి సంఘుగోష్ఠిని నామరూపాలు లేకుండా చేస్తాడు" అని అన్నాడు విపినుడు.

"అయితే ఆమె అవివాహితా?" అని అడిగాడు శ్రీశుడు.

"అవివాహితే. మన సంఘంపాలిట మహమ్మారి. ఆరోజున నేను చెప్పినట్లు జరిగిన తరువాతనే పూర్ణ మన సంఘములో సభ్యుడుగా చేరాడు" అని అన్నాడు విపినుడు.

"పూజారిని మెప్పించి నెమ్మదిగా భగవంతుని విగ్ర హాన్ని కాజేయాలనే ఉద్దేశ్యంతో చేరాడన్నమాట. నేను కూడా ఆ విషయాన్ని కనిపెడుతూఉండాలి" అని అన్నాడు శ్రీశుడు.

"నారీతత్వ పరిశోధన ఆరోగ్యకరమైనది కాదు" అని అన్నాడు విపినుడు.

"నీ ఆరోగ్యానికి హానికరము కానప్పుడు నా ఆరో గ్యానికిమాత్రం ఏం—" అని అన్నాడు శ్రీశుడు.

"ప్రారంభములో రోగము ఎలా ప్రవేశిస్తుందో

ఎంతమాత్రం తెలియదు. కానీ లోపలినుండి మన్మథుని వత్తిడి ప్రారంభమయినప్పుడు అశ్వినీకుమారుని చికిత్సకూడా ఏమీ పనిచేయదు. కనుక ప్రారంభంలోనే జాగ్రత్తగా ఉండటం మంచిది" అని చెప్పాడు విపినుడు.

ఇంతలో ఒక ప్రౌఢవ్యక్తి అక్కడికివచ్చాడు. అతనిని చూచి విపినుడు "మహాశయా, ఎవరుమీరు?" అని అడిగాడు.

"చూచారూ, నా పేరు శ్రీ వనమాలి భట్టాచార్య, మా తండ్రిగారి పేరు ఓం రామకమల న్యాయచంచు, మా నివాసము—" అని చదువుకు పోసాగాడు ఆ వ్యక్తి.

శ్రీశుడు అతనిమాటలకు అడ్డొస్తూ, "చాలు చాలు, అంతకంటే మాకుఎక్కువ పరిచయము అనవసరము. ఇప్పుడు తమరు ఇక్కడికి వచ్చిన పనేమిటి?" అని అడిగాడు.

"పనేమీ లేదు. మీరందరూ సజ్జనులు, మీతో పరిచయం చేసుకొని నాలుగుమాటలు మాట్లాడి వెళదామని—" అని శ్రీ వనమాలి భట్టాచార్య మరేదో చెప్పబోవుచుండగా మళ్ళీ శ్రీశుడు అతని మాటలకు అడ్డుతగులుతూ ఇలా అన్నాడు— "తమకేమీ పని లేకపోవచ్చు, మాకు చాలాపను లున్నాయి. ప్రస్తుతానికి మీరు మరెవరైనా సజ్జనునితో పరిచయం చేసుకొని వారితో మాట్లాడండి, మేము మాపని చూచుకుంటాము—"

"అలా అయితే అవసరమైన విషయమే మాట్లాడుతాను" అని అన్నాడు శ్రీ వనమాలి భట్టాచార్య.

"అయితే మంచిదే" అన్నాడు శ్రీశుడు.

"కుమారసభలోని నీలమాధవునికి ఇద్దరు అందమైన కుమార్తెలున్నారు—ఇద్దరూ ఇద్దరే—అపురూప సౌందర్యవతులు, వివాహం చేయవలసిన ఈడువచ్చింది" అని చెప్పాడు శ్రీ వనమాలి.

"అయితే అందుకు మేమేమి చేస్తాము, మాతో చెప్పటం ఎందుకు ? మాతో వారికేమి సంబంధం?" అని అన్నాడు శ్రీశుడు.

"మీరు సంకల్పించుకొంటే సంబంధం అదే ఏర్పడుతుంది, అది అంత కష్టమైన సంగతి కాదు. మిగిలిన విషయాలన్నీ నేను చూచుకుంటాను" అని అన్నాడు వనమాలి.

"అయ్యా, శ్రీ వనమాలిగారూ, మీ దయనంతా ఈ అపాత్రులమీద వృథాగా ఖర్చుపెడుతున్నారు" అని అన్నాడు విపినుడు.

"అపాత్రులా ! విచిత్రంగా మాట్లాడుతున్నారు! మీవంటి సత్పాత్రులు మరెక్కడ దొరుకుతారు? మీలోని వినయవిధేయతలు చూచి నేను ముగ్ధుడనైపోయానంటే నమ్మండి" అన్నాడు శ్రీ వనమాలి.

"ఆ ముగ్ధభావాన్ని అలాగే వుంచుకోదలచిన మీరు తక్షణం ఇక్కడినుంచి వెళ్ళండి. మా వినయవిధేయతలలో సహనశక్తి చాలా తక్కువ" అని అన్నాడు.

"కళ తండ్రి అడిగినంత డబ్బు ఇవ్వటానికికూడా సిద్ధంగా ఉన్నారు" అని చెప్పాడు శ్రీ వనమాలి.

అందుకు శ్రీశుడు కోపంగా "పట్టణంలో డబ్బు

కావలసిన భిక్షుగాళ్ళు అనేకమంది ఉన్నారు. విపిన్, ఏమిటీ మాటలు? నీకు వినటానికి ఆనందంగా ఉన్నదేమోగాని నాకు చాలా రోతగా ఉంది" అని అన్నాడు.

"నన్నేం చేయమంటావు! వినలేక వెళ్ళిపోదామను కుంటే భగవంతుడు వీరికికూడా రెండుకాళ్లు ఇచ్చాడు గదా!" అని అన్నాడు విపినుడు.

"భగవంతుడు వాటిని వెనకవైపున గనుక సృష్టించి ఉంటే మనిషి వాటిని దక్కించుకోగలిగేవాడే కాదు" అన్నాడు శ్రీశుడు.

"మీకు కోపం ఎందుకు? నేను వెళతాను" అని శ్రీవనమాలి భట్టాచార్య బయటకు వెళ్ళిపోతాడు. ఇటు లోపలినుంచి చంద్రబాబు "పూర్ణా" అంటూ అక్కడికి వచ్చాడు.

"కాదండీ, నేను శ్రీశుణ్ణి."

"మనసంఘములో సభ్యులసంఖ్య తగ్గిపోయినందు వల్ల మనం ఎంతమాత్రం నిరాశ చెందనవసరములేదు" అని అన్నాడు చంద్రబాబు.

"నిరాశ ఎందుకు? అదే మనసంఘానికి గర్వించ తగిన కారణము. సామాన్యులందరూ మన సంఘము యొక్క ఉన్నత ఆదర్శాలను, కఠిననియమాలను పాటించ గలరా? అవన్నీ భరించగల కొద్దిమంది మాత్రమే మన సంఘములో ఉంటారు" అన్నాడు శ్రీశుడు.

చంద్రబాబు తమ సంఘపు కార్యకలాపాల రిజిష్టరును కళ్ళకు దగ్గరగా ఉంచుకొని చూస్తూ ఇలా అన్నాడు-

"మన ఆదర్శము అత్యంత ఉన్నతమైనది, మన విధానము చాలా కఠినమైనది, కనుక మనము ఎంతో నమ్రతగా వ్యవహరించాలి; మన సంకల్పము సర్వప్రజలకు ఆచరణయోగ్యమైనది కాదనే విషయం మనం మర్చిపోకూడదు. ఇంతకు పూర్వము మనసంఘములో మనకంటె అన్ని విషయాలలోను గొప్పవారు అనేకమంది ఉండేవారు, వాళ్ళందరూ ఏమయ్యారు! సుఖాలు, సంసారము మొదలగు ఆకర్షణలలోనై ఒక్కొక్కరే లక్ష్యభ్రష్టులైపోయారు. మిగిలిఉన్న మనలో అనేకమంది జీవితమార్గాలలో ఏయే ఆకర్షణలు ఉన్నాయోకూడా, ముందు ముందు ఏమి జరుగనున్నదో మనం చెప్పలేము. కనుక మనం గర్వాన్ని త్యజించి ఏదో ఒక దీక్షాబద్ధులమై దృఢంగా నిలబడటం చాల అవసరం."

ప్రక్కనే ఉన్న గదితలుపులు తెరిచే ఉన్నాయి. ద్వారానికి తెర వ్రేలాడుతూఉంది. గదిలోపల ఉన్న ఒక యువతి చంద్రబాబు మాటలు చలించినట్లు ఆమెకొంగున వ్రేలాడే తాళాలగుత్తి ఒకటి రెండుసార్లు గలగలలాడింది. పూర్ణతప్ప మరెవ్వరూ ఆ శబ్దాన్ని విన్పించుకోలేదు.

మళ్ళీ చంద్రబాబు ఇలా చెప్పనారంభించాడు—"అనేకమంది మనసంఘాన్ని గురించి ఎగతాళిగా మాట్లాడుతున్నారు. 'దేశానికి సేవచేయాలనే సంకల్పంతో మీరు బ్రహ్మచర్యవ్రతాన్నవలంభించారుగదా, అందరికీ అలాంటి సంకల్పమే కలిగినప్పుడు అర్థశతాబ్దం గడచినతరువాత మీరు సేవచేయటానికి ఈ దేశంలో ఎంతమంది ప్రజలు మిగిలివుంటారు' అని మరికొందరు అంటున్నారు. నేను

నమ్రతతో ఏమీ జవాబు చెప్పలేక ఇలాంటి హేళనలను సహించి వూరుకొంటున్నాను. కానీ ఇలాంటి హేళనలకు జవాబేమీ లేదా అనేది మనం ఆలోచించాలి."

తరువాత చంద్రబాబు చెప్పటం ఆపి తనకు ఎదురుగా కూర్చున్న ముగ్గురు సభ్యుల ముఖాలలోకి చూడ సాగాడు.

తెరచాటునుంచి తను సంభాషణలను వింటున్న యువతిని తలచుకొని పూర్ణ ఇనుమడించి ఉత్సాహంతో ఇలా చెప్పసాగాడు — "అందుకు తగిన జవాబుఉంది. ప్రతి దేశములోనూ కొద్దిపాటివర్గము ఒకటుంటుంది, వారు గృహస్థజీవితంకోసము జన్మించరు. అందుకోసము జన్మించిన కొద్దిమందిని ఆకర్షించి ఒక సంకల్పసూత్రములో బంధించుటకే మన సంఘము ఏర్పడినది—ప్రపంచములోని పురుషులందరూ బ్రహ్మచారులుగా ఉండాలనేది మనసంఘ ఆశయంకాదు. మన సంఘములోనికి అనేకమంది రావచ్చును, కానీ వారిలో ఎక్కువమంది మనసంఘాన్ని వదలి వెళ్లిపోతారు. చివరికి అన్నిపరీక్షలు తట్టుకొని మనసంఘములో ఒకరో ఇద్దరో మిగులుతారు. చివరికి మిగిలే ఆ నలుగురు ముగ్గురు మీరేనా అని ఎవరైనా ప్రశ్నిస్తే 'అవును, నేనే' అని సగర్వంగా ఎవరు జవాబు చెప్పగలరు! కానీ అంతిమపరీక్షవరకు నిలబడగలమో లేదో ఆ సర్వాంతర్యామికే తెలియాలి. అంతమాత్రాన మనము నిలవగలమో లేదో అనే విషయాన్నిగురించి మనసంఘాన్ని ఎగతాళి చేసే అధికారం ఎవరికీలేదు. చివరికి మన అధ్యక్షులవా

రొక్కరే సంఘంలో మిగలవచ్చును, అయినా మనంద రమూ వదలివేసిన ఆ సంఘము మన అధ్యక్షులవారి తపో బలంవల్ల దీప్తివంతంగా నిలబడుతుంది, జీవితాంతం వారు చేసిన సేవ, త్యాగము, తపస్సువల్ల దేశానికి తప్పక మేలు చేకూరుతుంది."

చంద్రబాబు ప్రశాంతంగా సంఘకార్యక్రమము గల రిజిష్టరును రెండోసారి తన కళ్ళకు మరింత దగ్గరగా పెట్టుకొని పరధ్యానంగా దేనినో పరిశీలించసాగాడు. పూర్ణ ఉపన్యాసం చేరవలసిన చోటుకు చేరింది. చంద్రబాబు ఒంటరిగా మిగిలిపోయి సంఘంకోసం తపస్సుచేయాలనే మాటవిని నిర్మల కంట నీరుపెట్టుకొంది, చలించిన ఆబాలిక కొంగున వ్రేలాడే తాళాలగుత్తి చప్పుడు పూర్ణ చెవులకు వింపుగా ధ్వనించింది.

ఇంతలో విపినుడు అందుకొని ఇలా అన్నాడు—

"మనము సంఘములో తగినవాళ్ళమా కాదా అనే విషయం కాలమేనిర్ణయిస్తుంది; కానీ పనిచేయటమనేది మన ఉద్దేశ్యమైతే దానిని వెంటనే ఆరంభించటమే మంచిది. అయితే ఇంతకూ మనము చేయవలసిందేమిటి అనేదే నాప్రశ్న."

ఆమాటవిని చంద్రబాబు ఉత్సాహం తెచ్చుకొని ఇలా అన్నాడు—"ఏమిచేయాలి అనేప్రశ్నకోసమే నేనింత కాలము ఎదురుచూస్తున్నాను. ఏమిచేయాలి అనేప్రశ్నే మనలో ప్రతిఒక్కరినీ పట్టిపీడిస్తుంది. సోదరులారా, పని ఒక్కటే మనకు ఏకైక ఐక్యతాసాధనము. అందరూ ఒక

టిగా కలసి పనిచేసేవారే ఒకటిగా ఉంటారు. ఈ సంఘములో మనందరమూ కలసి ఏదో ఒకపనిని ప్రారంభించనంతవరకు వాస్తవంగా మనం ఒకటిగా ఉండలేము. కనుక మనం ఏమిచేయాలి అని ఇవాళ విపినబాబు అడిగినప్రశ్నను చల్లారిపోనివ్వకూడదు. సభ్యులారా, మనము ఏమిచేయాలో మీరే జవాబు చెప్పండి."

కలతచెందిన శ్రీశుడు ఇలా జవాబు చెప్పాడు— "మనం ఏమి చేయాలి అని నన్ను అడిగితే మనందరమూ సన్యసించి భారతదేశంలోని గ్రామగ్రామానికి తిరిగి సేవ చేయాలి, మనం మన సంఘాన్ని మరింత పటిష్టంగా తయారు చేసుకోవాలి. మన సంఘసభ్యులు సూక్ష్మసూత్ర స్వరూపాన్ని స్వీకరించి సమస్త భారతదేశాన్ని తమలో ఇముడ్చుకోవాలి— నేను చెప్పగలిగిందిదే."

అందుకు విపినుడు నవ్వి ఇలా అన్నాడు— "అందుకింకా చాలాసమయం ఉంది. రేపటినుంచే ప్రారంభించగల పని ఏదైనా ఉంటే చెప్పండి. ఇందుకు నేను చెప్పదలచిందేమంటే మనలో ప్రతి ఒక్కరూ ఇద్దరేసి విదేశీ విద్యార్థుల పోషణ భారాన్ని వహించాలి, వారి చదువును గురించి, వారి ఆరోగ్యమునుగురించి, మనస్సునుగురించి చర్చించి నిర్ణయించేహక్కు మనచేతిలో ఉంటుంది."

"ఇదే నీ పని. మనము సన్యాసము స్వీకరించింది అందుకేనా? చివరికి పిల్లల్ని పెంచటమే మన పని అయినప్పుడు మన పిల్లలు చేసిన అపరాధం ఏమిటి?" అని అన్నాడు శ్రీశుడు.

విపినుడు అతని మాటలకు విరక్తిచెంది "అలా అనుకునేట్లయితే సన్యాసి చేయవలసిన పనేమీ లేదు; భిక్షు, తిరుగుడు, మోసముమాత్రమే మనపనిలో మిగులుతాయి" అని అన్నాడు.

ఈ మాటకు శ్రీశునికి కోపంవచ్చింది. అతడు ఇలా అన్నాడు—"మన సంఘముయొక్క మహత్తరమైన ఆశయాలలో ఏ మాత్రము శ్రద్ధలేనివారు మనలో కొందరున్నారని నా ఉద్దేశ్యము. అలాంటివారు మన సంఘాన్ని వదలివెళ్ళి పిల్లల్ని పెంచుకుంటె మనకు మన సంఘానికి చాలా మేలు కలుగుతుంది.

విపినుడు మరింత కోపగించుకొని ఇలా అన్నాడు— "నన్ను గురించి నేనేమీ చెప్పుకోదలచటం లేదు, కానీ మన సంఘములో కొందరు ఇటు సన్యాసం పుచ్చుకొంటానికీ, అటు త్యాగబుద్ధితో పిల్లల్ని పెంచటానికీ రెండింటికీ అనర్హులు."

ఈ వాగ్వివాదమంతా విని చంద్రబాబు రిజిష్టరును చూడటం ఆపి ఇలా అన్నాడు— "ప్రస్తుతం మనము చర్చిస్తున్న విషయాన్నిగురించి పూర్ణ అభిప్రాయం ఏమిటో విని నేను నా అభిప్రాయాన్ని తెలియపరుస్తాను."

అందుకు పూర్ణ తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తపరిచాడు— "ఇప్పుడు ముఖ్యంగా సంఘములో ఐక్యత నిమిత్తము ఏదో ఒక కార్యక్రమాన్ని స్వీకరించాలనే తీర్మానము మనముందున్నది. కానీ కార్యక్రమాన్ని నిర్ణయించే విషయంలో మనలో ఎంత ఐకమత్యం ఉన్నదో

కూడా వ్యక్తమయింది. ఈ విషయంలో మనం ఒకరి నొకరు వేలెత్తి చూపవలసిన అవసరమేమీ లేదు. మధ్యలో నేను వేరే మూడవమార్గాన్ని దేనినైనా సూచించటమంటే ఇప్పుడు రగులుతూన్న అగ్నికి మరొక సమిధను చేర్చినట్లే అవుతుంది—కనుక నేను చెప్పదలచిన దేమంటే అధ్యక్షుల వారే మన సంఘ కార్యక్రమాన్ని నిర్ణయించాలి, దానిని మనందరము మరొక ఆలోచన ఏదీ లేకుండా అక్షరాలా దాని ప్రకారము నడుచుకోవాలి. దీనివల్ల మనలో ఐక్యత సాధ్యమవుతుంది. మనంచేపట్టిన కార్యక్రమాన్ని నెరవేర్చ గలుగుతాము."

ప్రక్కనే ఉన్న గదిలోని బాలిక పూర్ణ మాటలకు కదిలింది, ఆమెకొంగున వ్రేలాడే తాళాలగుత్తి మరొకసారి చప్పుడు చేసింది.

పూర్ణమాటలు విన్నతరువాత చంద్రబాబు ఇలా చెప్పసాగాడు— "భారత దేశంలోని పేదతనాన్ని నిర్మూలించటం మన ప్రథమ కర్తవ్యం, అందుకు శీఘ్ర నివారణో పాయము వ్యాపారము. మనం కొద్దిమంది పెద్ద వ్యాపార మేదీ నడపలేము, కానీ దానికి ప్రారంభము చేయగలము. మనము అగ్గిపుల్లలను గురించి పరిశోధనచేస్తే ఎలాఉం టుందో మీరుకూడా ఆలోచించి చూడండి. త్వరగామండి ఎక్కువసేపు ఆరిపోకుండా ఉండేది, దేశంలో ప్రతిచోట తగినంత లభించే కర్రను కనిపెట్టగలిగితే చౌకగా అగ్గిపెట్టె లను ప్రజలకు అందించగలుగుతాము. దానిని తయారు చేసే విధానము తెలుసుకున్నంతమాత్రాన పని జరుగదు.

మన దేశంలో ఎన్నిరకాల కర్ర దొరుకుతున్నదీ, వాటిలో అన్నిటికంటె ఏది త్వరగా మండే స్వభావముగలదీ అనే విషయం పరిశోధించాలి."

"దహనతత్వాన్నిగురించి పూర్ణబాబుకు బాగా తెలుసునని నా అభిప్రాయము" అన్నాడు విపినుడు.

"అలాగా! ఏం, పూర్ణబాబూ, మీరు దహన పదార్థాలను గురించి పరిశోధించారా?" అని అడిగాడు చంద్రబాబు.

"అవును, ఇప్పుడు గుర్తొచ్చింది. ఝ్యారా అనే ఒక కర్ర అగ్గిపుల్లలు తయారుచేయటానికి చాలా చౌకగా లభిస్తుంది" అని అన్నాడు పూర్ణబాబు.

"అవును, అది మంటను వెంటనే అందుకొంటుంది, కానీ బ్రహ్మచారి సంఘములో దానిని పరిశోధించటం సాధ్యపడే పని కాదు" అన్నాడు విపినుడు.

"మన దేశంలో దహనమయ్యే పదార్థంకావలసినంత దొరుకుతుంది; మంటను రగిలించే వస్తువులుకూడా ఎన్నో దొరుకుతాయి; కానీ బాగా ఆలోచించి పరిశోధన చేయాలి" అని అన్నాడు పూర్ణ.

"నిజం చెప్పావు. అనేకరకాల కర్రలు త్వరగా మండి అంతలోనే కాలి నుసి అయిపోతాయి" అని అన్నాడు చంద్రబాబు.

"నిజం" అన్నాడు విపినుడు.

"త్వరగా అంటుకోవాలి, నెమ్మదిగా కాలాలి, చాలా సేపటివరకు మండుతూ ఉండాలి, అలాంటిది మనకు

కావాలి. పరిశోధనచేస్తే లభించదంటారా?" అని అడిగాడు చంద్రబాబు.

"తప్పకుండా లభిస్తుంది; అది మన చెంతనే ఉందని కూడా మీరు గ్రహిస్తారు" అన్నాడు శ్రీశుడు.

"జనప పుల్లను, భూతద్దాన్ని తెచ్చి వెంటనే పరిశోధన జరుపుతాను" అన్నాడు పూర్ణ.

శ్రీశుడు అటువైపు తిరిగి నవ్వుతాడు. అదేసమయంలో అక్షయబాబు అక్కడికి వచ్చాడు.

"మహాశయులారా, లోనికి రావచ్చునా?" అని అడిగాడు అక్షయబాబు ద్వారంలోనే ఆగి.

వృద్ధుడైన చంద్రనాథబాబు వచ్చిన దేవరో వెంటనే గుర్తించలేక కనుబొమలుచిట్లించి అటే చూడసాగాడు. అది గమనించి అక్షయబాబు "మహాశయా! భయపడకండి. ఆవిధంగా మీరు కనుబొమలు చిట్లించి చూస్తూఉంటే నాకు భయంగా ఉంది. నేను మీకు అపరిచిత వ్యక్తిని కాదు, పైగా మీ సంఘములో మాజీ సభ్యుడను—నా పేరు—" అని అన్నాడు.

మధ్యలోనే చంద్రబాబు అందుకొని "ఇక మీ పేరు చెప్పనవసరములేదు. రండి, రండి అక్షయబాబూ" అని ఆహ్వానించాడు.

అక్కడ కూర్చొనియున్న ముగ్గురుయువకులు అక్షయబాబును నమస్కరించారు. ఇప్పటివరకు జరిగిన చర్చను గురించి విపినుడు, శ్రీశుడు ఇద్దరూ గంభీరంగా కూర్చొని ఉంటారు.

"సుహాశయా, అపరిచితులకంటే మాజీ అంటేనే ఎక్కువ భయంగా ఉంది" అని అన్నాడు పూర్ణ.

అందుకు అతియబాబు ఇలా అన్నాడు—"పూర్ణ బాబు చాలా తెలివిగలమాట మాట్లాడాను. ప్రపంచంలో భూతమంటేనే భయపడుతూ ఉండటం ఆచారము. వ్యక్తి తానే ఒక భూతమైనప్పుడు ఇతరుల జీవిత సంభోగాన్ని సహించలేడు, అది ఆలోచించే మనిషి భూతాన్ని భయంకరంగా వూహించుకుంటాడు. అందుకని అధ్యక్షసుహాశయా, బ్రహ్మచారి సంఘములోకివచ్చిన ఈ భూతాన్ని బయటికి వెళ్ళగొడతారా లేక పాతస్నేహాన్ని పురస్కరించుకొని కూర్చోటానికిఏదైనాబల్లఇస్తారా? వెంటనే చెప్పండి."

"కూర్చోటానికి బల్లనే ఇస్తాము" అని చంద్రబాబు అతియబాబుకు ఒక కుర్చీ చూపించాడు.

చంద్రబాబు చూపించిన కుర్చీలో కూర్చుంటూ అతియబాబు ఇలా అన్నాడు—"అందరి అనుమతితో కూర్చుంటున్నాను. మీరు నన్నింతో మర్యాదగా కూర్చోమని ఆహ్వానించారు, అందుకని ఎక్కువసేపు కూర్చొని మీకు విసుగు కలిగించి అమర్యాదగా వ్యవహరించనని హామీ ఇస్తున్నాను. ముఖ్యంగా నాకు తాంబూలము, తంబాకు, భార్య ఈ మూడు దుర్వ్యసనాలు పట్టుకొని పీడిస్తున్నాయి, ఇవి మీ సంఘ నియమాలకు విరుద్ధమైనవి. కనుక వెంటనే నేనువచ్చిన పనేమిటో ముగించుకొని వెళ్ళిపోతాను."

చంద్రబాబు నవ్వి "మీరు మా సంఘములో

సభ్యులు కానుగనుక మీకు ఈ నియమాలు వర్తించవు. తాంబూలము, తంబాకు కావాలంటే మీకోసం తెప్పించి ఇవ్వగలను, కానీ మూడవ—" అంటూ మధ్యలోనే ఆపేశాడు.

"మీరు శ్రమపడి ఆమెను ఇక్కడికి పట్టి తెప్పించ వలసిన అవసరం లేదు. అది నాకు బహిరంగవ్యసనం కాదు" అని అన్నాడు అక్షయబాబు.

తాంబూలము, తంబాకు తెప్పించటానికి చంద్ర బాబు పురాతన్ అనే నౌకరును పిలవబోతూఉండగా పూర్ణ 'నేను పిలుస్తాను' అని లోనికి వెళతాడు, ప్రక్క గదిలోనుంచి తాళాలు, గాజులు గలగలలాడుతూఉండగా ఎవరో పారిపోయిన చప్పుడు విన్పిస్తుంది.

"మా గ్రామంలోని ఒక ధనికమిత్రుడు తన కుమా రుని బ్రహ్మచారిసంఘములో సభ్యుడుగా చేర్పించాలని కోరుతున్నాడు" అని చెప్పాడు అక్షయబాబు.

చంద్రబాబు ఆశ్చర్యపడుతూ "తండ్రి తన కుమా రునికి వివాహం చేయాలనుకోవటంలేదా!" అని అడిగాడు.

అందుకు అక్షయబాబు ఇలా అన్నాడు—"ఆ విష యంలో మీరు నిశ్చింతగా ఉండండి—ఆ కుర్రాడు అసలు వివాహమే చేసుకోడు, అందుకు నేను గ్యారంటీ ఇస్తాను. ఆ కుర్రాడికి దూరపుబంధువు ఒక తాతగారుకూడా సభ్యు లుగా చేరతారు. ఆయన విషయంలోకూడా మీరేమీ ఆందోళన చెందనవసరం లేదు. వారు మీవలె సుకుమారి కానప్పటికీ మీ అందరికంటె యువకుడు, వారి వయస్సు

అరవై దాటింది — కనుక వారిని సందేహించవలసిన వయస్సు కాదు—అది మీ అందరి అదృష్టము."

"చేరదలచినవారి పేర్లు, నివాసము మొదలగు వివరములు" అని అన్నాడు చంద్రబాబు.

అక్షయబాబు మధ్యలోనే అందుకొని "వారి పేర్లు, నివాసము మొదలగు వివరాలన్నీ ఉన్నాయి—సంఘములో వారిని తప్పక చేర్చుకోవాలి. కానీ మీరు ఉంటున్న ఇరుకైన ఈ చీకటిగది ఆరోగ్యకరమైనది కాదు. ఆ విషయం కూడా మీరు ఆలోచించాలి" అని అన్నాడు.

చంద్రబాబు సిగ్గుపడుతూ రిజిష్టరును కళ్ళకు దగ్గరగా ఉంచుకొని "అక్షయబాబూ, మీరు చెప్పినది నిజమే, కానీ సంఘపు ఆర్థికపరిస్థితులు—" అని అన్నాడు.

"సంఘపు ఆర్థికస్థితినిగురించి మీరేమీ చెప్పనవసరం లేదు; సంతృప్తికరమైన పరిస్థితి కాదని నాకు తెలుసు. మీ ఆఫీసునిమిత్తము మంచి ఇల్లు చూచాము. దానిని గురించి మీరేమీ కుబేరుని ఆశ్రయం పొందనవసరంలేదు. మీరేవచ్చి స్వయంగా అన్నీ చూడండి, లేవండి" అని అన్నాడు అక్షయబాబు.

విచారంగా ఉన్న విపినబాబు, శ్రీశుని ముఖాలు వికసించాయి. అధ్యక్షుడు చంద్రబాబుకూడా సంతోషంగా లేచి నిలబడి చేతితో జుట్టు దువ్వుకోసాగాడు. పూర్ణబాబు మాత్రం చాలా కంగారుపడుతున్నాడు.

"సంఘాన్ని ఇక్కడినుంచి మార్చవద్దు" అనికూడా పూర్ణబాబు పైకి అన్నాడు.

"ఎందుకని? ఈ గాలీ వెలుతురు లేని గదిలోనుంచి అక్కడికి వెళితే మీా బ్రహ్మచర్య దీక్ష గాలికి ఎగిరి పోతుందా?" అని అడిగాడు అక్షయబాబు.

"ఇక్కడమాత్రం ఇప్పుడు వచ్చిన నష్టమేముంది?" అన్నాడు పూర్ణ.

"నష్టమేమిా లేదు. కానీ పట్టణంలో ఇంతకంటె అన్నివిధాల మంచిఇల్లు లేకపోలేదు" అని అన్నాడు అక్షయబాబు.

"సుఖాలను కోరటంకంటె కష్టాలను సహించటం నేర్చుకోవాలని నా ఉద్దేశ్యం—అదేమంచిది"అని అన్నాడు పూర్ణ.

"కష్టాలు సహించట మనేది ఆఫీసుగదిలోకంటె బయట ఆచరించటం మంచిది" అన్నాడు శ్రీశుడు.

"ఒక కార్యక్రమంలో నిమగ్నమైనప్పుడు ఎలాగో కష్టాలు భరించక తప్పదు, కానీ ఏమిా కారణంలేకుండా బాధలుపడడం మూర్ఖత్వమే" అని అన్నాడు విపినుడు.

చివరికి అక్షయబాబు వారినుద్దేశించి ఇలా చెప్పాడు—"మిత్రులారా, నేను చెప్పేదికూడా వినండి. సంఘపుఆఫీసు గదిలోని చీకటితో బ్రహ్మచర్యవ్రతాన్ని మరింత అంధకారమయం చేయవద్దు. గాలి, వెలుతురు స్త్రీజాతికి చెంది నవికావుగదా! అలాంటప్పుడు ఆఫీసులోకి వాటిని రాకుండా నిరోధించటం దేనికి? అదీగాక ఇది చాలా రసవత్తరమైన ప్రదేశము, బ్రహ్మచర్యవ్రతానికి తగినది కాదు. మీా రందరూ ఆలోచించి చూడండి. వ్యర్థచర్చ చేయాలంటే

చేయండి, కాని గాలి, వెలుతురు మీకు చర్చించినంత మాత్రాన రావు. విపినబాబూ, మీ అభిప్రాయం ఏమిటి? శ్రీశబాబూ మీరేమంటారు?"

అందుకు శ్రీశబాబు, విపినబాబు ఒకేసారి "మీరు చెప్పినది యథార్థమే. ఒకసారి మీరు చెప్పే ఇంటిని చూచి రావటం మంచిదే" అని అన్నారు.

పూర్ణ ఏదో ఆలోచిస్తూ ఏమీ మాట్లాడలేదు. ప్రక్కగదిలోని తాళాలగుత్తి మరొకసారి మ్రోగింది, కానీ చాలా అయిష్టత ధ్వనించింది.

"చంద్రబాబూ, ఇప్పుడే నా వెంట రండి, ఇంటిని చూపిస్తాను" అని అన్నాడు అక్షయబాబు.

"అయితే, పదండి" అంటూ చంద్రబాబు లేచి అక్షయబాబు వెంట బయలుదేరాడు. ఇద్దరూ గదిలోనుంచి బయటకు వెళ్ళిపోయారు.

అప్పుడు విపినుడు పూర్ణతో ఇలా అన్నాడు— "ఇదుగో పూర్ణబాబూ, ఒకవిషయం మీతో నిజంచెప్ప కుండా ఉండలేకపోతున్నాను. బ్రహ్మచారిసంఘముయొక్క ఫ్రాంటియర్ పాలసీవల్ల మనము తెర అనేవస్తువును ఆమో దించము. అటునుంచే మన సంఘములోనికి శత్రుసైన్యలు జొర బడతారు."

"అంటే అర్థం ఏమిటి?" అని అడిగాడు పూర్ణబాబు.

"తెరలాంటి ఎగిరేవస్తువు కొంచెము గాలితగిలితేనే చలిస్తుంది, అలాంటిది బ్రహ్మచారి సంఘానికి తగదు" అని అన్నాడు విపినుడు.

"ప్రస్తుతం మనకు సరిహద్దుల రక్షణకు ఇటుకలతో నిర్మించిన గట్టిపదార్థం కావాలి. తెరలు పనికిరావు" అని అన్నాడు శ్రీశుడు.

"మీమాటలు చాలారహస్యంగా కనిపిస్తున్నాయి" అని అన్నాడు పూర్ణ.

"ఆమాట నిజమే. రహస్యపదార్థమే వినాశన హేతువు. బ్రహ్మచర్యవ్రతము అవలంబించినవారి ప్రధాన శత్రువు తెరచాటునే ఉంటుంది" అని అన్నాడు విపినుడు.

"తెరమీద దండెత్తి దానిని చీల్చిచెండాడటమే మన ధ్యేయం. తెరచాటున తిరుగాడే మాయలేడి వెలుతురు రాగానే ఎండమావివలె మాయమైపోతుంది" అని చెప్పాడు శ్రీశుడు.

"శ్రీశబాబూ, ఎండమావి ఎలాగో మాయమైపోయేదే, కానీ దాహముమాత్రం అదృశ్యమయ్యేది కాదు గదా!" అని అన్నాడు పూర్ణ.

"అదెందుకు అదృశ్యమవుతుంది. అది ఉండవలసినదే. దాహమే లేకపోతే మనము తీర్చుకునేదేమిటి? అయితే ఏమార్గాన వెళితే మనకు తగినఫలితం లభిస్తుంది అనేది ఆలోచించుకోవాలి" అని అన్నాడు శ్రీశుడు.

ఇంతలో వెనుక ఎక్కడినుంచో ఒకపాట విన్పిస్తుంది.

"కొంచెం నెమ్మదిగా మాట్లాడు. పాట వినిపించటం లేదా? మంచి పాటే" అని అన్నాడు విపినుడు.

"ఆ పాటమాత్రం ఒక తెరకాదా! దాని చాటున

దాగిఉన్న రహస్యము చెడుమార్గాన నడిపించదంటారా?" అని అన్నాడు పూర్ణ.

"ఆగవయ్యాబాబూ! తత్వచర్చ తరువాతచూద్దాం. పాటను విననివ్వు. దగ్గర ఇంటిలోనుంచే వినిపిస్తున్నట్లుంది. అక్షయబాబు ఇల్లు అటే ఉందనివిన్నాను" అన్నాడు విపినుడు.

"పాట చాలా స్పష్టంగా వినిపిస్తుంది" అని అన్నాడు శ్రీశుడు.

— పా ట —

ఆవలిగట్టుకు చేరేదెవరోయ్?
ఆవలిగట్టుకు వచ్చేదెవరోయ్?
మనోహరమైన సమయం
నావ తీరాన ఉంది,
ఆవలిగట్టున పూలతోటలో
అందమైన పూలెన్నో వికసించాయి
రకరకాల ఆటలతో, పాటలతో
అందరిమనసులు ఆనందంగా ఉన్నాయి
ఇటు ఎడారులు మండుతున్నాయి—
అటుకు ఇటుకు ఉన్న తేడా తెలిసిందా?
ఇదే సమయం, రాదలచినవారు రండి!
పిచ్చివాడా! ఆలోచనలతో
అమూల్యమైన సమయాన్ని పాడుచేసుకోకు!
సాయంత్రం కనుచీకటి పడగానే

నావలు తిరగటం ఆగిపోతాయి!

అప్పుడు ఆదరికి ఎలా చేరతావు?

"ఈపాట బ్రహ్మచారి సంఘాన్ని భయపెట్టటానికే పాడినట్లుంది. నావలు నడవటం ఆగిపోతే కష్టమే" అని అన్నాడు శ్రీశుడు.

" 'ఇటు ఎడారులు మండుతున్నాయి' అని పాడటం విన్నావా?" అన్నాడు విపినుడు.

"అయితే, ఆలస్యం ఎందుకు? అవతలిగట్టుకు వెళ్లే ఏర్పాట్లు చేయండి" అని అన్నాడు పూర్ణ.

"ఆ కంఠస్వరం వింటూ ఉంటే అవతలి గట్టుకు చేర్చకుండా ప్రవాహం మధ్యలో ముంచునట్లుగా ఉంది" అని చెప్పాడు శ్రీశుడు.

తరువాత అందరూ లేచి బయటకు వెళ్ళిపోతారు.

## 3

శ్రీశబాబు తనగదికి కుడివైపున ఉన్న వరండాలో పడక కుర్చీలో కూర్చొని ఉన్నాడు. సాయంత్ర సమయం. సిగరెట్టు కాలుస్తూ ఎటో చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. ప్రక్కనే ఉన్న ముక్కాలిపీటమీద చల్లని లెమనేడ్ పానీయం గ్లాసు నిండుగా ఉంది. దాని ప్రక్కనే ఒక మల్లెపూల దండకూడా ఉంది.

ఇంతలో అతని ఏకాంతానికి భంగంకల్గిస్తూ విపినుడు

అక్కడికి వచ్చి "ఏమండోయ్, సన్యాసి మహాశయా!" అని అన్నాడు.

ఆ మాట విని శ్రీశుడు లేచి సరిగా కూర్చొని బిగ్గరగా నవ్వుతూ "ఇంకా నువ్వు మన తగాదాను మర్చిపోలేదా? ఏం శిశుపాలకా! నేను సన్యాసిని కాలేనని నిజంగా నువ్వు అనుకొంటున్నావా?" అని అన్నాడు.

"ఎందుకు కాలేవు! కానీ జీతం ఇచ్చి అనేకమంది శిష్యులను వెంట ఉంచుకోవాలి" అని అన్నాడు విపినుడు.

"ఆ శిష్యులలో ఒకడు మల్లెపూలదండగుచ్చుతాడు, వేరొకడు బజారులో నా కోసము లెమనేడ్, మంచు భిక్ష అడిగి తెస్తాడు, ఇదేగా వారుచేసే పని? అందులో నష్టమేముంది? మల్లెపూలదండలంటే వైరాగ్యము, చల్లని లెమనేడ్ అంటే విరక్తిగల సన్యాసి. గొప్ప సన్యాసి ఎలా అవుతాడు?" అని అన్నాడు శ్రీశుడు.

"సాధారణభాషలో సన్యాసి ధర్మమని దీనినే అంటారు" అని అన్నాడు విపినుడు.

"భాషలో ఒకేమాటకు అనేక అర్థాలు ఉంటాయని నీకు తెలియదా! ఒక వ్యక్తి విషయంలో సన్యాసి అనే దానికి ఉన్న అర్థమే మరొక వ్యక్తికికూడా ఉన్నట్లయితే 'మనస్సు' అనే ఈ స్వతంత్ర పదార్థం ఉండి ప్రయోజనం ఏముంది!" అని అన్నాడు శ్రీశుడు.

"ఇంతకూ నీ మనస్సు సన్యాసి అనే మాటకు ఏమి అర్థం చెప్తోందో వినాలని నాకు చాలా కోర్కెగాఉంది" అని అడిగాడు విపినుడు.

అందుకు శ్రీశుడు ఈవిధంగా చెప్పాడు—"నా ఉద్దేశ్యంలో సన్యాసి అలంకారము ఎలా ఉండాలంటే మెడలో ఒక పూలమాల ధరించాలి, శరీరమంతా చందనపు లేపనము, చెవులకు కుండలాలు, ముఖములో దరహాసము, మనుష్యులను హృదయాలను ఆకర్షించడమే నా సన్యాసి వ్రత ధ్యేయము. అందమైన ముఖము, మధుర కంఠ స్వరము, అనర్గళంగా మాట్లాడగల శక్తి — ఇవన్నీ లేనప్పుడు సన్యాసి అయినందువల్ల తగిన ఫలితం లభించదు. సొగసు, బుద్ధి, కార్యదక్షత, ప్రసన్నత మొదలగు విషయాలలో నా సన్యాస సాంప్రదాయము గృహస్థులకు ఆదర్శంగా ఉండాలి."

"అంటే కార్తికేయస్వాములవారిదళం ఒకటి నెమలిపిపుమీద ఎక్కి బజారులో తిరగాలన్నమాట!" అని అన్నాడు విపినుడు.

"నెమలి దొరకని యెడల ట్రాములు ఉన్నాయి గదా, అదీ లేకపోతే కాలినడకనైనా కోపమేమీ లేదు. బ్రహ్మచారుల సంఘం అంటేనే కార్తికేయుల సంఘం అని అర్థం. కానీ కార్తికేయుడు పెద్దమనిషిగానేగాక స్వర్గంలో సైన్యాధిపతిగాకూడా ఉన్నాడు —" అని అన్నాడు శ్రీశుడు.

"యుద్ధం చేయటానికి కార్తికేయునికి చేతులు రెండే ఉండేవికాని ఉపన్యాసం చెప్పటానికి ముఖాలు ఆరు ఉండేవి" అన్నాడు విపినుడు.

"అంటే దీనివల్ల ఏమి తేలుతుందంటావు! మన ఆర్య

లకు పూర్వులు బాహుబలముకంటె వాక్యబలాన్ని మూడు రెట్లు అధికమని భావించేవారు. అందుకనే నేనుకూడా వస్తాదుకావటం వీరత్వానికి నిదర్శనంగా అంగీకరించను" అని అన్నాడు శ్రీశుడు.

"అంటే అది నన్ను ఎగతాళిచేయటమా?" అని అడిగాడు విపినుడు.

"అదిగో చూడు. మానవుని అహంకారాన్ని ఎలా నాశనం చేసివేస్తుందో! నువ్వా మంచిపనే చేశావు, నిన్ను వస్తాదూ అని పిలవటమే బాగుంటుంది. నువ్వు కలియుగపు భీమసేనుడవు. సరే రా, యుద్ధం దేహి. ఆ వీరత్వ మెంతో పరీక్షించి చూద్దాం" అన్నాడు శ్రీశుడు.

ఈమాట అన్నతరువాత ఇద్దరూ ఒక్క క్షణకాలంపరిహాసంగా చేతులు చేతులు కలుపుతారు. విపినుడు అకస్మాత్తుగా భీముడు దీనిమీద పతనమై పోయాడు అని అంటూ ధబీమని శ్రీశుని పడకకుర్చీలో కాళ్లుచాచుకొనికూర్చుంటాడు. తరువాత 'అబ్బా, చాలా దాహంగా వుంది' అంటూ లెమనేడ్ గ్లాసును అందుకొని గటగట త్రాగేస్తాడు. ఇంతలో శ్రీశుడు గబగబ మల్లెపూల దండను అందుకొని "కానీ విజయమాలమాత్రం నాకే దక్కింది" అంటూ దానిని తలకు తగిలించుకొని వెదురుపీటమీద కూర్చుంటాడు.

అప్పుడు శ్రీశుడు ఇలా అన్నాడు — "మిత్రమా, నిజం చెప్పు! చదువుకొన్న వాళ్ళొక దళంగా బ్రహ్మచారి సంఘములోచేరి ఆనందంగా, సంగీతం, ఉపన్యాసాలద్వారా

భారతదేశమంతా తిరిగితే దానివల్ల ప్రజలకు ఏదైనా లాభం కలుగుతుందంటావా లేదా?"

"అయిడియా మంచిదే" అన్నాడు విపినుడు.

అందుకు శ్రీశుడు ఇలా అన్నాడు — "అంటే వినటానికి అందంగానే ఉంది, కానీ చేయటం అసాధ్యం అని నీ ఉద్దేశ్యం. నువ్వనుకొంటున్నట్లు అదేమంత అసాధ్యం కాదని నిదర్శనాలతో సహా నిరూపిస్తాను. భారతదేశంలో సన్యాసధర్మమనే ఒక మహత్తరశక్తి ఉంది. ఇప్పుడు దాని మీద ఉన్న బూడిదను దులిపి, బోలెడు దూరంగా పారవేసి, జడలను కత్తిరించి వేసి, దానిని సౌందర్యంలోనూ కర్మనిష్ఠలోనూ ప్రతిష్ఠించటమే బ్రహ్మచారి సంఘము యొక్క ఏకైక లక్ష్యము. పిల్లలను పెంచటానికిగానీ, అగ్గిపుల్లలు తయారుచేయడానికిగానీ మనము ఆజన్మ బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించలేదు. నువ్వేమంటావ్ విపిన్, నా అభిప్రాయాలను అంగీకరిస్తావా? లేదా?"

అప్పుడు విపినుడు ఇలా అన్నాడు— "నువ్వు చెపుతున్న సన్యాసికి కావలసినలాంటి ముఖము మొదలగు ముఖ్యవిషయాలు నాలో ఏమీలేవు. అయినా జీతం డబ్బులకు నీవెంట రావటానికిమాత్రం సిద్ధమే. చెవులకు బంగారు కుండలాలు, కళ్ళకు బంగారు ఫ్రేము కళ్ళద్దాలు ధరించి దేశంవెంటపడి తిరుగుతున్నప్పుడు కాపలాకు నీ వెంట ఒక మనిషి ఉండటం అవసరం, నేను కొంతవరకు అందుకు ఉపయోగపడగలను."

"అదుగో, మళ్ళీ ఎగతాళిగా మాట్లాడుతున్నావు" అని అన్నాడు శ్రీశుడు.

"లేదు మిత్రమా, ఎగతాళికాదు. నేను నిజమే మాట్లాడుతున్నాను. నువ్వు నీ ఉద్దేశ్యాలను ఆచరణలో పెట్టగలిగితే చాలా మంచిది. అయినా యిలాంటి సిద్ధాంత విషయాలలో అందరూ ఒకేవిధంగా పనిచేయలేరు. వారివారి శక్తి సామర్థ్యాలననుసరించిమాత్రమే చేయగలుగుతారు" అని అన్నాడు విపినబాబు.

"అది యదార్థమే. ఒక విషయంలోమాత్రం మనం అత్యంత దృఢంగా ఉండాలి. స్త్రీజాతితో మనకు ఎలాంటి సంబంధమూ ఉండకూడదు" అన్నాడు శ్రీశుడు.

"పూలమాలలు, చందనము, దండ కడియాలు, కుండలాలు అన్నీ ఉండాలంటున్నావు, ఇక ఆఒక్కవిషయం లోనూ అంత పట్టింపు ఎందుకు?" అని అడిగాడు విపినుడు.

"వాటన్నిటినీ ఉంచుకొని ఈ విషయంలో దూరంగా ఉండటమే దృఢత్వాన్ని నిరూపించుకొంటుంది. అందుకనే చైతన్య మహాప్రభువు కఠిననియమాలద్వారా తన శిష్యులను స్త్రీలకు దూరంగా ఉంచాడు. అనురాగము, సౌందర్యము అనేవి స్త్రీల ముఖ్యధర్మములు. అందుకే అటువైపును పురుషులను ఆకర్షించే ఆశలు అనేకం ఉన్నాయి" అని చెప్పాడు శ్రీశుడు.

"అలా అయితే స్త్రీలంటే భయపడాల్సిందే" అన్నాడు విపినుడు.

"నాకు అలాంటి భయమేమీ లేదు. నేను నా

మనస్సును భూమండలంలోని విచిత్రసౌందర్యంలో వ్యాపింప చేసి ఉంచుతాను, అప్పుడు నన్ను ఆకర్షించి వలలో వేసు కోవటం ఎవరికీ సాధ్యం కాదు. కానీ మీరు రాత్రింబవళ్లు ఎప్పుడూ ఫుట్ బాల్, టెన్నిస్, క్రికెట్ మొదలగు వాటిలో మునిగిఉంటారు—అలాంటప్పుడు ఒకసారి ఆ వలలో చిక్కు కున్నారంటే బ్యాటుతోసహా భుజాలవరకు చేతులు విరుగు తాయి" అన్నాడు శ్రీశుడు.

"అలాగే మిత్రమా, సమయం వచ్చినప్పుడు చూద్దాం" అన్నాడు విపినుడు.

"అదే మంచిపద్ధతికాదు, సమయం రాదు, అసలు అలాంటి అవకాశాన్నే రానివ్వకూడదు. సమయ మనేది రథం ఎక్కి రాదు—మనమే దానిని భుజాలమీది కెక్కించుకొనితీసుకువస్తున్నాము—కానీ ఇప్పుడు నేను చెప్పి నట్లు గనుక జరిగితే వాహనమేదీ లభించక సమయం కెక్కడో తారట్లాడుతూ ఉంటుంది."

శ్రీశుడు చెప్పటం ముగించేసరికి పూర్ణబాబు ప్రవే శించాడు. అతనిని చూచి మిత్రులిద్దరూ ఏకకంఠంతో "రండి, రండి పూర్ణబాబూ" అని ఆహ్వానించారు.

విపినుడు కుర్చీలోనుంచి లేచి ఒక బల్లమీద కూర్చుంటాడు. పూర్ణ కుర్చీలో కూర్చుంటాడు.

"మీ వరండాలో వెన్నెల చాలా బాగున్నది సుమా! మధ్యమధ్య స్తంభాల నీడలు చక్కగా అలంక రించినట్లున్నాయి" అని అన్నాడు పూర్ణ.

"డాబామీద వెన్నెల వ్యాపించి చిత్రవిచిత్రమగు

సృష్టిని చేయకముందునుంచే నేను ఇక్కడ ఉంటున్నాను. ఇదుగో పూర్ణ బాబూ, అగ్గిపెట్టెలు వగైరా తయారుచేయట మనే కార్యక్రమం నా కెంతమాత్రం ఇష్టంలేదు" అని అన్నాడు శ్రీశుడు.

పూర్ణ పూలమాలను చూచి "సన్యాసధర్మంలోనే మీకు అపూర్వ ప్రవేశం ఉన్నట్లుంది ?" అని అడిగాడు.

శ్రీశుడు అందుకొని "అదేవిషయం మాట్లాడుతున్నాము. సన్యాసధర్మము అంటే మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి" అని అన్నాడు.

"చాకలి, మంగలి, దర్జీవారితో ఏమీ పని ఉండకూడదు. సాలెవానితోకూడా అవసరం ఉండదు. పియర్సు మొదలగు సబ్బులను కళ్ళతోకూడా చూడకూడదు—" అని పూర్ణ మరేదో చెప్పబోయాడు.

శ్రీశుడు అతనిమాటలకు అడ్డొస్తూ ఇలా అన్నాడు— "ఛీ! ఛీ! మీ రనుకునే ఆ సన్యాసమతము పూర్వకాలము నాటిది. ఇప్పుడు మనము 'క్రొత్తసన్యాస మతము' అనేది ఒకటి స్థాపించాలి."

"విద్యాసుందరుని యాత్రలో వచ్చే ఆధునిక సన్యాసి నిదర్శనము సరిపోతుందా — కానీ అతడు బ్రహ్మచారి సంఘ నియమాలను పాటించలేదుగదా !" అని అన్నాడు పూర్ణ.

"ఆ విధంగా నడుచుకొనిఉంటే వారినే ఆదర్శంగా తీసుకోవచ్చును. అలంకరణలోనూ, మాటలలోనూ, ఆచ

రణలోనూ అందంగా, నైపుణ్యం కలిగి ఉండాలి" అని చెప్పాడు శ్రీశుడు.

"అంటే రాజకుమారివైపుమాత్రం కన్నెత్తి చూడ కూడదు, అంతేగదా! దారం లేకుండా దండ గుచ్చాలి, కానీ ఆ దండను ఎవరి మెడలో వేస్తారు మహాశయా ?" అని అడిగాడు పూర్ణ.

"ఆ మాలను స్వదేశం మెడలో వేస్తాము. నేను అన్నమాట చాలా గొప్పగా ఉన్నది కదూ! ఏం చేయ మంటారు చెప్పండి, తోటమాలి భార్య కావచ్చు, రాజ కుమారి కావచ్చు ఎవరైనా నిషేధమే. పూర్ణబాబూ, నేను పరిహాసంగా చెప్పటంలేదు—"

పూర్ణబాబు శ్రీశుని మాటకు అడ్డొస్తూ "నేను పరి హాసంగా వినటంలేదు - భయంకరమైన కఠోర విషయం వింటున్నాను - మనిషిని పూర్తిగా నిస్సార పర్చివేస్తుం దనుకో" అన్నాడు.

అప్పుడు శ్రీశుడు ఇలా చెప్పసాగాడు - "మన బ్రహ్మచారి సంఘంద్వారా ఒక నవీన సన్యాసమతాన్ని స్థాపించాలి, దాని అభిరుచులు, శిక్షణ, పనులు అన్నీ కూడా గృహస్థులకు ఆదర్శంగా ఉండాలి. సంగీతము మొద లగు లలితకళలలో ఆరితేరినవారు, కత్తి, కర్రసాములలో నిపుణులు, గుర్రపు స్వారీలో నేర్పరులు, తుపాకి కాల్చ టంలో గురి తప్పనివారూ—"

పూర్ణ అతనిమాటలకు అడ్డొస్తూ "మనస్సులను ఆకర్షించటంలోనేగాక ప్రాణాలను హరించటంలోకూడా

దృఢంగా ఉంటారన్న మాట. బంకింబాబు నవలలోని దేవీ చౌధరాణి పురుషదళంవలె ఉండాలి. అంతేగా!" అని అన్నాడు.

"బంకింబాబు నాకు రాబోయే ఐడియాను ఎప్పుడో దొంగిలించాడు — కానీ ఇప్పుడు అదేపనిని మనము నిర్వహించాలి" అన్నాడు శ్రీశుడు.

"మరి మన అధ్యక్షులవారు ఏమన్నారు?" అని అడిగాడు పూర్ణ.

"అనేకరోజులనుండి వారికికూడా నచ్చచెప్పి మా దళంలోకి ఆకర్షించాము. కానీ వారు ఆ అగ్గిపుల్లలను మాత్రం వదలలేదు. సన్యాసులు కృషిశాస్త్రాన్ని, వస్తుశాస్త్రాన్ని నేర్చుకొని గ్రామగ్రామాన రైతులకు ప్రబోధం చేస్తూ తిరుగుతారనీ, ఒక్కొక్క రూపాయి మూలధనం వసూలుచేసి ఒక బ్యాంకు తెరిచి, పెద్దపెద్ద గ్రామాలలో నూతన పద్ధతులలో దుకాణాలు తెరవటంద్వారా భారత దేశం నలుమూలల వ్యాపారరంగాన్ని విస్తరింపజేస్తారని వారంటారు. వారికి నిజంగా వెర్రి పట్టింది" అని అన్నాడు శ్రీశుడు.

"విపినబాబు మాదిరిగానే నన్నమాట!" అన్నాడు పూర్ణ.

"శ్రీశబాబు చెపుతున్నవిధంగా నేను ఆధునిక సన్యాసి మతానికి ఆదర్శపురుషుడను కానప్పటికీ సంఘ ఐక్యతకోసము అలాంటి నిర్ణయము జరిగినప్పుడు నేనుకూడా ఆ వేషం ధరించటానికి సిద్ధమే" అని చెప్పాడు విపినుడు.

"మహాశయా, కౌపీనం ధరించి సన్యాసి అవుదా మనుకుంటున్నారేమో ! ఆధునిక సన్యాసి వేషానికి దండ కడియాలు, ఆభరణాలు, కుండలాలు, అందమైన రూపము ఎన్నో కావాలి" అని అన్నాడు పూర్ణ.

అందుకు శ్రీశుడు ఇలా అన్నాడు - "పూర్ణ బాబూ, మీరు ఎగతాళి చేయండి లేదా మరేమైనా అనండి, బ్రహ్మచారి సంఘము సన్యాసుల సంఘము అవుతుంది. ఒకవైపు మనము కఠోర ఆత్మత్యాగము చేస్తాము, మరో వైపు మనుష్యత్వపు భోగ్యమగు ఉపకరణములనూ అనుభవిస్తాము-రెండింటినీ సమాన భావంతో వరిస్తాము-అత్యంత కఠోరమగు ఈ సాధనవల్ల భారతదేశములో నవయుగము ఆవిర్భవిస్తుంది-"

శ్రీశుని మాటలు విని పూర్ణ బాబు "అర్థమయింది శ్రీశబాబూ - కానీ స్త్రీ అనేది మనుష్యత్వపు ప్రధాన ఉపకరణాలలో ఒకటి కాదంటారా ? ఆమెను చులకనగా చూడటంవల్ల లలిత సౌందర్యాన్ని గౌరవించినట్లెలా అవుతుంది? అందుకు మరేదైనా మార్గం ఆలోచించారా?" అని అడిగాడు.

అందుకు శ్రీశుడు ఇలా అన్నాడు-"స్త్రీలలో ప్రధానంగా ఒక దోషం ఉంది. ఈ స్త్రీలు లతలవలె పురుష జాతిని చుట్టుకొని పట్టుకుంటారు, ఆ పట్టువల్ల పురుషులు పతనమైపోతారనే భయంలేకుండా స్వతంత్రంగా ఉండగలిగితే ఎలాంటి ఇబ్బందీ లేదు. ఒక పనిలో జీవితాన్నే త్యాగం చేయవలసివచ్చినప్పుడు ఆ పనిలో ఎదురయ్యే

బాధల నన్నింటినీ అధిగమించాలి — పాణిగ్రహణంలో జరిగేదేమిటి, తన చేతుల్నికూడా కట్టివేసుకోవలసివస్తుంది, దానివల్ల పనులు జరుగవు పూర్ణబాబూ!"

అందుకు పూర్ణబాబు ఇలా అన్నాడు—"నేను నా వివాహానికి మిమ్మల్ని ఆహ్వానించటానికేమీ రాలేదు గనుక విచారించవద్దు మిత్రమా! మానవజన్మ అనేది మళ్ళీ లభిస్తుందో లేదో సందేహమే, కనుక హృదయంలోని కోర్కెల్ని జీవితాంతం తీర్చుకోనందువల్ల ఫలితం మరెక్కడో ఏమి లభిస్తుంది? మహమ్మదీయుల స్వర్గంలో సుందరాంగులు ఉన్నారు, హిందువుల స్వర్గంలోకూడా అప్సరసలు ఉన్నారు, బ్రహ్మచారి సంఘపు స్వర్గంలో అధ్యక్షులవారు, సభ్యులుతప్ప మనోహరమేదైనా లభిస్తుందా లేదా?"

"పూర్ణబాబూ మీరు అనేదేమిటి, మీరు—" అంటూ నసిగాడు శ్రీశుడు.

"భయపడకు మిత్రమా, ఇప్పుడే నేను చనిపోవటానికి సిద్ధముగా లేను. మనోహరమగు ఈ వెన్నెలరాత్రి, మత్తెక్కించే పూలవాసనలు బ్రహ్మచర్యవ్రతాన్ని దీక్షగా సాగించటానికే సృష్టించబడినవా? మనస్సులోపల మధ్య మధ్య పేరుకొనే ఆవిరిని నిట్టూర్పులద్వారా బయటకుపంపివేయటమే మంచిదని నా అభిప్రాయం—దానిని లోపలే అణచిపెట్టి ఉంచుకోవటంవల్లను, తనను తాను మభ్యపరచుకున్నందువల్లనూ ఏనాటికైనా బ్రహ్మచర్యవ్రతమనే ఈ బాయిలర్ పేలిపోతుంది. ఏది ఏమైనప్పటికీ, సన్యాసులంకావటమే ముఖ్యమని నిర్ణయిస్తే అందుకు నేనుకూడా సహా

కరిస్తాను—సంఘఐక్యతను క్షేమాన్ని కోరకతప్పదుగదా!" అన్నాడు పూర్ణబాబు.

"ఇప్పుడు అలాంటిపరిస్థితులు ఏమొచ్చాయి?" అని అడిగాడు శ్రీశుడు.

"అక్షయబాబు మన సంఘమును అక్కడినుంచి మార్చాలనటం నాకు ఇష్టంలేదు" అని అన్నాడు పూర్ణ.

ఆ మాటవిని శ్రీశుడు ఇలా అన్నాడు—"సందేహ మనే వస్తువు నాస్తికత్వముయొక్క నీడలాంటిది. ఏదో చెడు జరుగుతుంది, అది నాశనమైపోతుందేమో. అలా అయితే అది పతనమవుతుందేమో—ఇలాంటి ఆలోచనలకు మన స్సులో చోటివ్వకూడదు. జరుగుతున్నదేదో మంచికే జరుగుతుంది. సక్రమంగానే జరుగుతున్నది అనుకోవటం మంచిది. మన బ్రహ్మచారి సంఘానికి ఉజ్వలమగు భవి ష్యత్తు ఉన్నదనే నేను ఆలోచిస్తున్నాను-అదే నా మనో నేత్రంతో చూస్తున్నాను. అక్షయబాబు మన ఆఫీసును అక్కడినుంచి మరొకభవనంలోకి మార్చినంతమాత్రాన మనకుజరిగే అపకారం ఏమీలేదు. బజారులో ఒక ఇంటి నుంచి మరొక ఇంటికేగాక దేశదేశాలలో తిరగవలసి ఉంటుంది. సందేహాలు, అనుమానాలు, ఉద్రేకాలు మొద లగువాటికి మనస్సులో చోటివ్వవద్దు పూర్ణబాబూ, ఆత్మ విశ్వాసము, ఆనందము లేకుండా గొప్పపనిని సాధించ లేము."

"కొద్దిరోజులు చూద్దాం, వచ్చే నష్టమేముంది— ఆ ప్రదేశం మనకు అనుకూలంగా లేనప్పుడు అప్పుడే మన

మామూలు చోటుకు మారవచ్చును—మన ఈ చీకటి గుడారాన్ని ఎవరూ ఎత్తుకుపోరు" అని అన్నాడు విపినుడు.

ఇంతలో అకస్మాత్తుగా చంద్రబాబు అక్కడికి వచ్చారు, వారినిచూచి ముగ్గురూ ఆశ్చర్యపడుతూ లేచి నిలబడ్డారు.

"ఇదుగో, నేను ఆ విషయమే ఆలోచిస్తున్నాను" అన్నాడు చంద్రబాబు అక్కడికి వస్తూనే.

"కూర్చోండి" అంటూ శ్రీశుడు చంద్రబాబును ఆహ్వానించాడు.

"లేదు, లేదు. నేను వెంటనే వెళ్ళిపోవాలి. కూర్చునే తీరికలేదు. చూచారూ, నేను చెప్పినట్లు మనము సన్యాస వ్రతానికి వెంటనే సిద్ధంకావాలి. అకస్మాత్తుగా ఎవరికైనా దెబ్బలుతగిలితేగానీ, సామాన్య జ్వరములు మొదలగు వాటికి చేయవలసిన చికిత్స ఏమిటో మనము ప్రజలకు నేర్పాలి—మన ప్రచారసాధనాలలో అదొక భాగంగా వుండాలి—అందుకు డా. రామరతన్‌బాబును ఆదివారాలందువచ్చి మన సంఘకార్యాలయంలో రెండుగంటలు ఉపన్యాసాలు ఇచ్చేందుకు ఏర్పాటుచేసి వచ్చాను" అని చెప్పాడు చంద్రబాబు.

"చంద్రబాబూ, కూర్చోండి" అని శ్రీశుడు మరొకసారి కోరాడు.

"లేదు, లేదు శ్రీశబాబూ! కూర్చోటానికి క్షణం తీరికలేదు. అవతల నాకు చాలాపను లున్నాయి. మనము మరొక కార్యక్రమాన్నికూడా చేపట్టాలి. మనం కొంత

వరకు చట్టాలనుకూడా అర్థంచేసుకొని అవినీతి, దుర్మార్గాల నుంచి రక్షించుకోవటం ఎలాగో, ఎవరికి ఎలాంటి హక్కులుంటాయో నిరక్షరాస్యులగు గ్రామప్రజలకు తెలియ చెప్పాలి—"

శ్రీశుడు చంద్రబాబు మాటలకు అడ్డొస్తూ "తమరు కూర్చోండి" అని అన్నాడు.

"కూర్చోవటం ఇప్పుడు కుదరదు. మనం చేయవలసిన మరొక ముఖ్యమైనపనేమిటంటే—ఎడ్లబండి, ఏతాము, త్రాళ్ళు పేనుట మొదలగు ప్రజల అత్యవసర వస్తువులలో కొత్తమార్పులు తెచ్చి పని త్వరగానూ, చౌకగానూ అగునట్లు చూడటంకూడా మన లక్ష్యాలలో ఒకటిగా ఉండాలి. పాతవాటికంటె అన్నివిధాల ఉత్తమంగా ఉండునట్లువాటిని మనము తయారుచేయు అవకాశాలను పరిశోధించాలి.వచ్చే వేసవి శలవులలో మనము కేదారబాబు కార్ఖానాకు వెళ్ళి వీటినిగురించి పరిశోధించాలి."

చంద్రబాబు నిలబడే ఏవేవో చెపుతూ ఉన్నాడు. వారు నిలబడి మాట్లాడటం శ్రీశునికి చాలా బాధగా ఉంది. అందుకని అతడు వారిమాటలకు అడ్డొస్తూ మరొకసారి కూర్చోమని చెప్పాడు.

"లేదు, లేదు. నేను వెళ్ళిపోతున్నాను. చూడండి, ఇప్పుడు నేను చెబుతున్నదేమిటి! గ్రామప్రజలకు ఉపయోగించే సామాన్యవస్తువులలో మనము కొత్తమార్పులు తెచ్చి అభివృద్ధిని సాధించగలిగినట్లయితే గొప్పగొప్ప పనులు చేసినదానికంటెకూడా ఎక్కువగా రైతుల ఆదరాభిమా

నాలు మారగానగలుగుతాము. వారు అనాదిగా ఉపయోగిస్తూవచ్చే వస్తువులలో ఉపయోగకరమగు క్రొత్త మార్పులను చూచి తాముకూడా మారటానికి ప్రయత్నిస్తారు. భూమి ఒకేచోట కదలకుండానిలబడి లేదనీ సృష్టినిత్యమూ మారుతూఉంటుందని గ్రహిస్తారు.”

మళ్ళీ శ్రీశుడు “చంద్రబాబూ, మీరు కూర్చోండి” అంటూ కుర్చీని వారి ముందుకు జరిపాడు.

కానీ చంద్రబాబు కూర్చోకుండానే ఇలా చెప్ప సాగాడు—“ఇప్పుడు నేను చెప్పినవిషయాలు మీరుకూడా ఆలోచించి చూడండి. మనము ఇంతకాలంగా చదువులు చదువుతున్నాము. మొదటినుండీ మనకు మన ఎడ్లబండి, ఏతాము మొదలగువాటినిగురించి తెలుసుకోవలసింది. పెద్ద పెద్ద యంత్రాలు మొదలగువాటినిగురించి కాకపోయినా నిత్యమూ మన ఇంటిలో మనచుట్టూవుండే వస్తువులను గురించే మనము ఆలోచించలేకపోయాము. మనకు అతి సమీపములో ఉన్నవాటినే మనము గమనించలేదు. ఎలా ఉన్నవి అలాగే ఉండిపోయాయి. ప్రజలు వాటినే ఉపయోగిస్తున్నారు. మానవుడు అభివృద్ధిపథంలో ముందుకు సాగిపోతున్నాడు, కానీ అతడు ఉపయోగించే వస్తువులలో ఏమీ మార్పు, అభివృద్ధిలేదు—ఈ విషయంలో మనము ఇంకెంతమాత్రము ఉపేక్షచేయకూడదు. ఆంగ్లేయులు మన వీపులమీద కట్టేదానిని మనము ‘కర్మము’ గా భావించరాదు అని చదువుకున్నాము. సాధారణ గ్రామ్యజీవిత యాత్ర బాగా వెనకబడిపోయిన పల్లెటూరి బురదమార్గంలో

ఇరుక్కొని స్తంభించిపోయింది. ఆధునికవిషయాలు చేర్చిన మన సన్యాసమతముద్వారా బురదలో కూరుకుపోయిన ఆ బండిచక్రాలను ముందుకు నెట్టాలి. ప్రస్తుతానికి మనము ఇది సాధించగలిగితే చాలు. శ్రీశబాబూ, ఇప్పు డెన్నిగంట లయింది?"

"ఎనిమిదిన్నర" అని జవాబిచ్చాడు శ్రీశుడు.

"అయితే, నే నిక వెళుతున్నాను. మరొక సంగతి. మనం ఇకనుంచి ఈ చర్చలు మాని దీక్షతో ఈ విషయా లన్నీ తెలుసుకొనుటకు అధ్యయనం చేయాలి" అన్నాడు చంద్రబాబు.

"చంద్రబాబూ, మీరు కాస్సేపు కూర్చుంటే నేను రెండుమూడు ముఖ్యవిషయాలు మాట్లాడాలి" అని పూర్ణ అన్నాడు.

"ఇవాళ నాకు క్షణంకూడా తీరికలేదు" అని జవాబు చెప్పాడు చంద్రబాబు అలాగే నిలబడి.

"మీరు ఎక్కువసేపు కూర్చోనవసరం లేదు—ఒక సంగతి...మన సంఘము..." అని చెప్పే పూర్ణమాటలకు మధ్యలోనే అడ్డొస్తూ చంద్రబాబు "ఆ విషయాలన్నీ రేపు మాట్లాడుకుందాం" అని అన్నాడు.

"రేపు మన సమావేశం జరుగుతుందికదా!" అని అన్నాడు పూర్ణ.

"అయితే ఎల్లుండి మాట్లాడదాము. ఇప్పుడు నాకు తీరికలేదు" అన్నాడు చంద్రబాబు.

"చూడండి, అక్షయబాబు—" అని పూర్ణ ఏదో చెప్పబోయాడు.

చంద్రబాబు అతనిని చెప్పనివ్వకుండానే ఇలా అన్నాడు—"పూర్ణబాబూ, మీరు నన్ను క్షమించాలి. ఇప్పటికే చాలా ఆలస్యమయింది. చూడండి, మరొక సంగతి—మన బ్రహ్మచారి సంఘము క్రమంగా అభివృద్ధి చెందినప్పుడు సభ్యులందరూ సన్యాసులై వెళ్ళిపోవుటకు వీలుండదు—అందుకని అప్పుడు మన సంఘములో రెండు విభాగాలు ఉండటమనేది చాలా అవసరం—"

"స్థానికంగా ఉండేవారు, తిరిగి యాత్రలు చేసేవారు అనేగా?" అని అడిగాడు పూర్ణ.

అందుకు చంద్రబాబు ఇలా చెప్పసాగాడు-"దానిని మీరు ఏ పేరుతో పిలిచినా నాకు అభ్యంతరం లేదు. అదీ గాక ఆరోజున అక్షయబాబు చెప్పినవిషయంకూడా త్రోసి వేయవలసినది కాదు. బ్రహ్మచారి సంఘములో మరొక ఉపసంఘము ఏర్పాటుచేసి దానిలోనికి వివాహమైనవారిని, వివాహం చేసుకోదలచినవారిని చేర్చుకోవాలని అక్షయ బాబు సూచించాడు. వివాహితులుకూడా దేశానికి సేవ చేయవచ్చును. అందరూ తమతమ శక్తి ననుసరించి సేవా కార్యక్రమంలో పాల్గొనటమే సాధారణ సేవావ్రతము. మరొక విభాగములోనివారు బ్రహ్మచర్యము నవలంభించి దేశదేశములలో తిరుగుతారు, వివాహిత సభ్యులు తమతమ అభిరుచుల ననుసరించి తమ చేతనైనంతవరకు ఏదో ఒక ఉపయోగకరమైన కార్యక్రమంతో దేశంపట్ల తమ కర్త

వాన్ని నెరవేరుస్తారు. పర్యటనచేసే బృందమువారు దేశ పటములు తయారుచేయుట, భూమిని సర్వే చేయుట, భూగర్భ శాస్త్రము, వృక్షశాస్త్రము, ప్రాణుల చరిత్ర మొదలగున వన్నీ నేర్చుకోవాలి—ఆ బృందము ఏ దేశానికి వెళ్ళినా ఆ యా దేశాలలోని యదార్థములను గ్రహించి సేకరిం చాలి—అప్పుడే భారతవాసులద్వారా భారతదేశపు యదా ర్థములు లిపిబద్ధంకాగలిగే అవకాశం ఏర్పడుతుంది. అప్పుడు మనము ప్రతివిషయానికీ హంటర్ దొరగారిమీద ఆధార పడవలసిన అవసరం ఉండదు.''

''చంద్రబాబూ, మీరు ఒక నిముషం కూర్చుంటే ఒక సంగతి మాట్లాడతాను'' అన్నాడు మళ్ళీ పూర్ణ.

''వద్దు, ఇప్పుడు నేను చెపుతున్నదేమిటి! మనం ఎక్కడికి వెళ్లినాసరే అక్కడి చారిత్రక కింవదంతులను, ప్రాచీన గ్రంథాలను సేకరించటం మన లక్ష్యంగా ఉండాలి- శిలాశాసనములు, రాగిరేకులు మొదలగు వస్తువులను గురించికూడా మనము పరిశోధన చేయాల్సి ఉంటుంది — కనుక మనలో కొందరు ప్రాచీన లిపిని చదవగలగటం కూడా నేర్చుకోవాలి...'' అని అన్నాడు చంద్రబాబు.

''ఇవన్నీ ఎప్పుడో జరగబోయే సంగతులు. ముందు నేను చెప్పేది...'' అని పూర్ణ మరొకసారి ఏదో చెప్పాలని ప్రయత్నించాడు.

''ఇప్పుడవేమీ వద్దు. నాకు తీరికలేదు. చూచారూ, అందరూ అన్ని విద్యలూ నేర్చుకోవాలని నా అభిప్రాయం కాదు. అన్ని విద్యలు ఒక మనిషి నేర్చుకోవాలంటే ఒక

జీవితం చాలదు. తమతమ అభిరుచుల్నిబట్టి ఎవరికి యిష్టమైన విద్యలు వారు నేర్చుకుంటారు..." అని అన్నాడు చంద్రబాబు.

శ్రీశుడు ఆయన మాటకు అడ్డొస్తూ "అలా అనుకున్నప్పటికీ..." అని అన్నాడు.

చంద్రబాబు వెంటనే అందుకుని "అయిదు సంవత్సరాలు నేర్చుకోటానికి వినియోగిస్తాము. అయిదు సంవత్సరాల అనంతరం మనము అన్నివిధాల నేర్పును సంపాదించి కార్యక్రమాన్ని ప్రారంభిస్తాము. జీవితపర్యంతము బ్రహ్మచారులుగా ఉండేవారికి అయిదు సంవత్సరాలు ఒక లెక్కలోనిది కాదు. అంతేకాదు, ఈ అయిదుసంవత్సరాల పరీక్షలో ఎందరు నిలవగలిగేది లేనిదికూడా తేలిపోతుంది— అప్పటికి నిలిచేవారు ఎలాంటి పరీక్షలకైనా తట్టుకొని జీవితాంతం నిలబడతారు" అని అన్నాడు.

"నాదొక మనవి, మన సంఘాన్ని ఇప్పుడున్న చోటునుంచి మార్చాలనుకున్నారుగదా!—" అన్నాడు పూర్ణ తాను చెప్పదలచిన విషయాన్ని ప్రస్తావిస్తూ.

చంద్రబాబు అతని మాటలకు జవాబు చెప్పకుండా మళ్ళీ ఇలా చెప్పనారంభించాడు — "పూర్ణబాబూ, ఇప్పుడు అవన్నీ మాట్లాడటానికి తీరికలేదు. నాకు అవతల చాలా ముఖ్యమైన పనులున్నాయి. పూర్ణబాబూ, నేను చెప్పిన విషయాలను గురించి బాగా ఆలోచించండి. ప్రారంభంలో అన్నీ అసాధ్యంగానే కన్పిస్తాయి, కానీ అదేమీ ఉండదు. కష్టసాధ్యం కావచ్చు, కానీ మంచిపను

లేవైనాసరే కష్టసాధ్యంగానే ఉంటాయి. జీవితాంతం దృఢ దీక్షతో నిలబడగలిగేవారు అయిదుగురు లభిస్తే చాలు, మనము చేసిన పని భారతచరిత్రలో చిరస్థాయిగా నిలుస్తుంది."

"కానీ, మీరు చెప్పినట్లు ఎడ్లబండి మొదలగు చిన్న చిన్న విషయాలతో—" అని శ్రీశుడు ఇంకా ఏదో చెప్ప బోయాడు.

"నిజమే, చిన్న విషయాలని వాటినికూడా ఉపే క్షించకూడదు, పెద్దవిషయాలను అసాధ్యమని భయపడ కూడదు" అని అన్నాడు చంద్రబాబు.

"మన సంఘ సమావేశాన్ని గురించి..." అంటూ పూర్ణ మరొకసారి ఏదో చెప్పాలని ప్రయత్నించాడు.

"అవన్నీ రేపు మాట్లాడుకుందాం. ఇక నేను వెళ తాను" అని చంద్రబాబు వెళ్ళిపోతాడు.

చంద్రబాబు వెళ్ళిన తరువాత విపినుడు శ్రీశునితో "ఏమోయ్ మిత్రమా, బాగా నిషా ఎక్కినవాడి నిషా చూచిన తరువాత మరొక నిషాఎక్కినవాడి నిషా దిగిపో తుందట! అలాగే చంద్రబాబుగారి ఉత్సాహం నిన్ను పూర్తిగా నిరుత్సాహపర్చినట్లుంది" అని అన్నాడు.

"అదేంలేదు మహాశయా, ఆలోచించవలసిన విష యాలు అనేకం ఉన్నాయి. ఉత్సాహమంటే ఎప్పుడూ ఏదో ఒకటి వాగుతూఉండదు. అప్పుడప్పుడు అది మౌనం వహిం చిందంటే దానినే సంఘటితస్థితి అంటారు" అని అన్నాడు శ్రీశుడు.

ఇంతలో పూర్ణబాబు వెళ్లటానికని లేచి నిలబడ తాడు. అది చూచి విపినుడు "ఏం పూర్ణబాబూ, ఎక్కడికి ప్రయాణమయ్యారు?" అని అడిగాడు.

"దారిలో అధ్యక్షులవారిని కలుసుకొని నేను చెప్పే దేమైనా వింటారేమో ప్రయత్నిస్తాను" అని అన్నాడు పూర్ణ.

"మీరు ఆశించేదానికి విరుద్ధంగా జరుగుతుంది. ఇంకా వారు చెప్పదలచిన మాటలు చాలా మిగిలి పోయాయి. అవన్నీ మీతో చెపుతూ ఎక్కడికెళ్ళాలో ఏమి చేయాలోకూడా మర్చిపోతారు" అని అన్నాడు విపినుడు.

ఇంతలో ఎక్కడినుంచో శ్రీవనమాలి మహాశయుడు ప్రవేశించి "ఏం శ్రీశబాబూ, క్షేమమేగదా? విపినబాబూ, ఎలా ఉన్నారు? ఓహో, పూర్ణబాబుకూడా ఇక్కడే ఉన్నారే! నేను రావటం మంచిదే అయింది. నేను ఎన్నో చెప్పి ఆ అమ్మాయిల్ని ఇంకా అలాగే ఆపి ఉంచాను"అని అన్నాడు.

"కానీ మమ్మల్ని ఇంకా మోసగించలేవు. మేము ఏదో ఒక ఘనకార్యం సాధిస్తాం" అన్నాడు శ్రీశుడు.

"మీరు మాట్లాడుతూ ఉండండి. నాకు పని ఉంది" అని పూర్ణ బయలుదేరాడు.

"అయితే మీరే ఇక్కడ కూర్చొని మాట్లాడుతూ ఉండండి పూర్ణబాబూ! నేనూ, శ్రీశుడు ఇద్దరమూ వెళ్ళి మీ పని పూర్తిచేసుకొని వస్తాము"అని అన్నాడు విపినుడు.

"దానికంటె మనం ముగ్గురమూ కలసి వెళితేనే బాగుంటుందేమో" అన్నాడు పూర్ణ.

"మీరేదో తొందరపనిలో ఉన్నట్లున్నారు — మళ్ళీ వచ్చి కలుసుకుంటాను" అని వనమాలి మహాశయుడు కూడా వెళ్ళిపోతాడు.

•

# 4

చంద్రబాబు తన ఇంటివద్ద బ్రహ్మచారి సంఘం ఉన్న గదిలో దేనికోసమో వెతుకుతూ తిరుగుతున్నాడు.

తరువాత లోపలిద్వారంవైపు చూస్తూ "నిర్మలా" అని పిలిచాడు.

"ఏమిటి మామయ్యా?" అని అడిగింది ప్రక్క గది లోనే ఉన్న నిర్మల.

"నా చొక్కా గుండీ ఒకటి కన్పించటంలేదు. ఎక్కడో పోయిందమ్మా" అని చెప్పాడు చంద్రబాబు.

"నాకేం తెలుసు. అక్కడే ఎక్కడో ఉంటుంది చూడండి" అని జవాబు చెప్పింది నిర్మల.

"నాకు కన్పించలేదు. నువ్వొకసారి ఇటువచ్చి చూచివెళ్ళు" అని అన్నాడు చంద్రబాబు.

నిర్మల గదిలోనికి వస్తూ "నువ్వు ఏ వస్తువులు ఎక్కడ పెట్టుకుంటావో అవన్నీ నేనెక్కడ వెతగ్గలను" అని అంది.

చంద్రబాబు నిర్మల కంఠస్వరం విని కోపంగా

ఉన్నట్లు సందేహించి బ్రతిమాలుతున్న ధోరణిలో "నిర్మలా, నీకే కన్పిస్తుందమ్మా. నా లోపాలను ఓర్పుతో సరిదిద్దగలిగేది నువ్వేగదా, ఇంకెవరున్నారు?" అనిఅన్నాడు.

అభిమానవతియగు నిర్మల చంద్రబాబు స్నేహ పూర్వకంగా మాట్లాడటం విని అకస్మాత్తుగా పెల్లుబికిన కన్నీటిని ఆపుకోటానికి ప్రయత్నించింది. నిర్మల ఏమీ జవాబు చెప్పకపోయేసరికి చంద్రబాబు నిర్మల దగ్గరకు వెళ్ళి ఆమె గడ్డము పట్టుకొని ముఖంలోకి చూచాడు.

ఒక క్షణం ఆగి చంద్రబాబు చిరునవ్వు నవ్వుతూ, "నిర్మలా, ఆకాశంలో నల్ల మబ్బులు వ్యాపించినట్లున్నాయి. ఏం జరిగిందో నాతో చెప్పమ్మా" అని అన్నాడు.

నిర్మల చిరుకోపాన్ని నటిస్తూ "ఇంతకాలం ఇక్కడ ఉంచి బ్రహ్మచారి సంఘాన్ని నాకు దూరంగా ఎందుకు మారుస్తున్నారు. నేనేం చేశానని?" అని తన మనసులోని బాధను వ్యక్తంచేసింది.

నిర్మల మాటలువిని చంద్రబాబుకు చాలా ఆశ్చర్యం కలిగింది—"బ్రహ్మచారిసంఘాన్ని నీకు దూరంగా మారు స్తున్నామా? ఆ సంఘంతో నీకేమి సంబంధమమ్మా?" అని అడిగాడు.

"తలుపుచాటున ఉన్నంతమాత్రాన సంబంధం ఉండదా మామయ్యా! సంబంధం ఉన్నంతవరకైనా ఇవాళ కాదంటే ఎలా పోతుంది" అని అంది నిర్మల.

"నిర్మలా, నువ్వీ సంఘంలో పనిచేసేదేమీ లేదు

కదా! పనిచేసేవారి సౌకర్యముకోసం దానిని ఇక్కడినుండి మార్చవలసివచ్చింది" అని చెప్పాడు చంద్రబాబు.

అందుకు నిర్మల వారిమాటకు అడ్డొస్తూ ఇలా అంది—"నేను మాత్రం ఎందుకు పనిచేయను. మేనల్లుడుగా కాకుండా మేనకోడలుగా జన్మించానుకనుక నువ్వు చేసే మంచి పనులలో సహాయం చేయలేనా? చిన్నతనంనుంచి నాకెన్నో విషయాలు నేర్పావు. నా మనస్సును ఉద్దేశ్యాలను మీరే తీర్చిదిద్దారు. చివరికి ఇప్పుడు పనిచేయవలసిన తరుణం ఆసన్నమయినప్పుడు ఎందుకు అవరోధం కల్గిస్తున్నారు? కారణం ఏమిటి?"

"నిర్మలా, ఏనాటికైనా నువ్వు వివాహం చేసుకొని సంసారాన్ని దిద్దుకోవలసినదానవే—అలాంటప్పుడు నువ్వీ బ్రహ్మచారి సంఘములో..." అని చంద్రబాబు ఇంకా ఏదో చెప్పబోయాడు.

నిర్మల అతని మాటలకు అడ్డొస్తూ "నేను వివాహం చేసుకోను" అని చెప్పింది.

"అయితే, ఏంచేస్తానంటావో చెప్పు" అని అడిగాడు చంద్రబాబు.

"దేశసేవా కార్యక్రమంలో నేనుకూడా మీకు సహాయం చేస్తాను" అని చెప్పింది నిర్మల.

"మేమందరమూ దేశంకోసం సన్యసించటానికి సిద్ధంగా ఉన్నాముకదా!" అని అన్నాడు చంద్రబాబు.

"భారతదేశచరిత్రలో ఇంతకుముందెన్నడూ స్త్రీలు మాత్రం సన్యసించలేదంటారా?" అని అడిగింది నిర్మల.

చంద్రబాబు ఏమీ జవాబు చెప్పకుండా వూరుకున్నాడు. అది గమనించి నిర్మల మళ్ళీ ఇలా చెప్పింది— "మామయ్యా, ఎవరైనా ఒక బాలిక హృదయపూర్వకంగా మీ సంఘములో చేరి సేవ చేయటానికి సిద్ధపడివచ్చినప్పుడు ఆమెను మీరు ఎందుకని చేర్చుకోరు? నేను మీ బ్రహ్మచారి సంఘములో సభ్యురాలిగా ఎందుకు చేరకూడదు?"

చంద్రబాబు ఎటూ తోచనిస్థితిలో పడిపోయి "ఇంకా మిగిలిన సభ్యులందరూ ఉన్నారుకదా..." అంటూ నసిగాడు.

"సభ్యులున్నారు, వారు భారతదేశ కల్యాణానికి నడుంకట్టి పనిచేయటానికి సిద్ధంగా ఉన్నారు, సన్యాసం స్వీకరించబోతున్నారు, అలాంటి సేవాభావము, త్యాగబుద్ధి గల మీ సభ్యులు ఒక స్త్రీ నిర్భయంగా మీతో సహకరించి పనిచేయటానికి నిస్వార్థభావంతో మీ అడుగుజాడలలో సన్యాసం స్వీకరించటానికి సైతం సిద్ధపడి వచ్చినప్పుడు నిస్సంకోచంగా ఆమెను మీ సంఘములో చేర్చుకోలేరా? అలా మీ సభ్యులు అంగీకరించలేనియడల వారు వివాహాలు చేసుకొని నాలుగుగోడల మధ్య ఇళ్ళలో కూర్చోవటమే మంచిది, వారు సాధించగలిగేదేమీ ఉండదు" అని అంది నిర్మల.

చంద్రమాధవబాబు అయిదువేళ్ళు జుట్టులో దూరి చకచక ఆడుతున్నాయి, జుట్టంతా రేగిపోయింది. ఇంతలో కన్పించకుండాపోయిన గుండీ చొక్కాలోపలినుంచి క్రింద పడింది. నిర్మల నవ్వుతూ గుండీ తీసి చంద్రబాబు

చొక్కాకు పెడుతుంది. కానీ అతడు ఇదేమీ గమనించే స్థితిలో లేడు. అతని ముఖంలోని ముడతలు తీవ్రాలోచనను తెలియచేస్తున్నాయి. నిర్మల అక్కడినుంచి వెళ్ళిపోవటం కూడా చంద్రబాబు గమనించలేదు. ఆదేసమయంలో వీథిలోనుంచి పూర్ణబాబు అక్కడికి వస్తాడు.

"చంద్రబాబూ, ఆ విషయాన్నిగురించి మళ్ళీ ఏదైనా ఆలోచించారా? మన సంఘాన్ని ఇక్కడినుంచి మార్చటం నాకెంతమాత్రం మంచిపనిగా కన్పించటంలేదు" అని అన్నాడు పూర్ణ.

"ఇవాళ ఒక కొత్త సమస్య ఎదురయింది పూర్ణ బాబూ! ఆ విషయంలో మీతో పూర్తిగా చర్చించాలనుకొంటున్నాను. నా మేనకోడలు ఒకామె ఉంది, మీకు తెలిసే ఉండొచ్చు" అని అన్నాడు చంద్రబాబు.

తనకేమీ తెలియదన్న భావాన్ని వ్యక్తం చేస్తూ పూర్ణ "మీ మేనకోడలా!" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును, ఆమెపేరు నిర్మల. మన బ్రహ్మచారి సంఘమంటే ఆమెకు చాలా ఇష్టము, అంతేకాదు మన సంఘం ఆమె హృదయంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది" అని చెప్పాడు చంద్రబాబు.

పూర్ణ ఆశ్చర్యపడుతూ "మీరనేదేమిటి చంద్ర బాబూ" అని అన్నాడు.

"మనలో ఎవరికీ తీసిపోనంత అధికంగా ఆమె మన సంఘాన్ని ప్రేమిస్తుంది" అన్నాడు చంద్రబాబు.

పూర్ణ ఎంతో ఉత్సాహాన్ని ప్రదర్శిస్తూ "ఈమాట

విని మాలో మరింత ఉత్సాహం కలుగుతుంది. స్త్రీ అయి నప్పటికీ ఆమె..." అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

మధ్యలోనే చంద్రబాబు అందుకొని "నేనూ అదే ఆలోచిస్తున్నాను. స్త్రీలలోని అమాయకపు ఉత్సాహం పురుషుల ఉత్సాహంలో నవచైతన్యాన్ని కలిగించగలదని ఇవాళ నేను అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను" అని అన్నాడు.

పూర్ణ ఇనుమడించిన ఉత్సాహంతో "నేనూ అదే స్థితిలో ఉన్నాను చంద్రబాబూ" అని అన్నాడు.

"పూర్ణబాబూ, మీ అభిప్రాయంకూడా ఇదేనా?" అని అడిగాడు చంద్రబాబు.

"ఏ విషయంలో?" అని ఎదురుప్రశ్న వేశాడు పూర్ణ.

"అదే, నిజమైన అనురాగంతో వచ్చే స్త్రీలు మన కఠోర కర్తవ్యపాలనలో అవరోధం కల్గించకపోగా ఎంతో సహాయపడగలుగుతారుగదూ!" అని అన్నాడు చంద్రబాబు.

పూర్ణ ప్రక్కగదివైపు చూస్తూ బిగ్గరగా ఇలా అన్నాడు—"ఈ విషయంలో నేను పూర్తిగా మీతో ఏకీభవిస్తాను. నా కేలాంటి సందేహమూ లేదు. పురుషుని అనురాగాన్ని సజీవంగా ఉంచే ఏకైక ఆధారము స్త్రీజాతియొక్క అనురాగమేనని నా నమ్మకం — స్త్రీల ఉత్సాహమే మన ఉత్తేజానికి ఆధారము. పురుషునిలోని ఉత్సాహాన్ని పసిపాపను సాకినట్లు సాకి వెలుగులోకి తెచ్చేది స్త్రీయే."

ఇంతలో బయటినుంచి శ్రీశుడు, విపినబాబు వస్తారు.

శ్రీశుడు లోనికి అడుగు పెడుతూనే "అవునవును పూర్ణబాబూ, ఆపని చేయగలదు—ఇప్పుడు ఆ ఉత్సాహం లేనందువల్ల నే సమావేశానికి రావటానికి ఆలస్యమయిందా?" అని అన్నాడు.

"కాదుకాదు, ఆలస్యానికి వేరేకారణం ఉంది. నా చొక్కాగుండీ ఎక్కడో పోయింది, ఎంతవెతికినా ఎక్కడా కన్పించలేదు" అని అన్నాడు చంద్రబాబు.

"ఇప్పుడు మీకు వేరే గుండీలు ఎందుకు, ఒకవేళ కావాలనుకొని గుండీ సంపాదించినా కాజా కుట్టించాలి గదా. మీ గుండీలన్నీ చొక్కానేకన్పిస్తున్నాయి, పెట్టుకో లేదు, అంతే!" అన్నాడు శ్రీశుడు చంద్రబాబు చొక్కా వైపు చూస్తూ.

చంద్రబాబు అటు చూచుకోకుండానే చేతితో తడుముకొని "అవును, గుండీ ఇక్కడే ఉంది. మనందరం ఇక్కడే ఉన్నాము గనుక ఆ విషయాన్ని గురించి చర్చిస్తే మంచిది. ఏమంటారు పూర్ణబాబూ!" అని అన్నాడు.

"అది మంచిదే, కానీ మనం ఇక్కడ ఇవన్నీ చర్చిస్తూ కూర్చుంటే ఆలస్యమవుతుందేమో?" అన్నాడు పూర్ణ.

"ఏమీ కాదు, ఇంకా చాలా సమయం ఉంది. శ్రీశబాబూ, ఒక్కక్షణం మీరుకూడా కూర్చోండి, స్థిమితంగా చర్చించవలసిన విషయం. నాకొక మేనకోడలు

ఉంది, ఆమె పేరు నిర్మల..." అని చంద్రబాబు చర్చించ వలసిన విషయాన్ని చెప్పనారంభించాడు.

పూర్ణకు అకస్మాత్తుగా దగ్గుతోపాటు కోపం వస్తుంది. శ్రీశుడు, విపినబాబు చలించకుండా నిరాసక్త భావంతో వింటూ కూర్చున్నారు.

చంద్రబాబు ఇలా చెప్పసాగాడు— "మన సంఘం యొక్క ఆశయాలన్నిటినీ ఆమె హృదయపూర్వకంగా గౌర విస్తుంది. ఆమెకు మన సంఘంపట్ల చాలా శ్రద్ధాసక్తు లున్నాయి. ఈ విషయంలో ఆమె మనలో ఎవరికీ తీసి పోదని గట్టిగా చెప్పగలను. ఈ విషయాన్ని గురించి నేను పూర్తిగా ఆలోచించిన తరువాత పురుషులు చేసే మహత్తర కార్యాలకు స్త్రీల ఉత్సాహము ప్రధాన ఆధారమనే నిర్ణ యానికి వచ్చాను. మీరేమంటారు పూర్ణబాబూ?"

పూర్ణ చాలా నిరుత్సాహంతో "అవునవును, నిజమే" అని అన్నాడు.

చంద్రబాబు వెనుకనుంచి ఎవరోతరుముకొస్తున్నట్లు "నిర్మల బ్రహ్మచారి సంఘములో సభ్యురాలిగా చేరాలని కోరితే మనం ఆమెను ఎందుకు చేర్చుకోకూడదు" అని అన్నాడు గబగబ.

"మీరనేదేమిటి చంద్రబాబూ" అని అన్నాడు పూర్ణ.

"ఒక స్త్రీ మన సంఘములో సభ్యురాలిగా చేర టానికి వస్తుందని మనము ఎన్నడూ వూహించనైనాలేదు, కనుక ఈ విషయంలో ఇంతకుముందు మనసంఘ నిబంధనా

వళిలో ఎలాంటి నియమమూ చేర్చలేదు—"అని అన్నాడు శ్రీశుడు.

"నియమమేదీ లేదుగాని నిషేధంకూడా లేదుగదా!" అని అన్నాడు విపినుడు.

"నిషేధమనే నియమమేదీ లేదు, కానీ మన సంఘము యొక్క ఆశయాలు స్త్రీలకు సాధ్యమయ్యేవి కావు" అన్నాడు శ్రీశుడు.

అందుకు విపినుడు ఇలాఅన్నాడు—"మన సంఘము యొక్క ఆశయాలు సంకుచితమైనవి కావు. అదీగాక మహత్తరమగు మన ఆశయసాధనకు విచిత్ర వర్గములోని విచిత్రమైన శక్తిగల మనుష్యుల విచిత్ర ప్రయత్నములో నిమగ్నం కావాలి. దేశసేవ చేయుటలో ఒక స్త్రీ చేయ గలిగిన పనిని మనము చేయలేకపోవచ్చును. మనము చేసిన పనిని ఒక స్త్రీ చేయలేకపోవచ్చును — కనుక మన సంఘ ఆశయాలు అన్నివిధాల పూర్తిగా సాధించాలంటే మనము ఎంత అవసరమో స్త్రీలుకూడా అంతే అవసరము."

"పని చేయదలచని వారందరూ ఆశయాలనుగురించి చాలా గొప్పగా చెపుతూవుంటారు. నిజంగా పనిచేయా లంటే మన లక్ష్యానికి కొన్నిహద్దులు అవసరం. మనసంఘ ఆశయాలు చాలా విశాల ప్రాతిపదిక కలవని మీరందరూ ఎంతో నిశ్చింతగా ఉన్నారు. కానీ వాటిని నేను అంత విశాలమైనవిగా భావించటం లేదు" అని అన్నాడు శ్రీశుడు.

అందుకు విపినుడు ఇలా అన్నాడు—"మనసంఘము

యొక్క కార్యరంగము బహు విశాలమైనది. నువ్వు ఆలోచించినది మేము వ్యతిరేకించకూడదు. మేము ఆలోచించినది నువ్వు కాదనకూడదు. నీకు మాకు ఇద్దరికీ ఇక్కడ స్థానం ఉండగలిగి ఇక్కడ మన ఇద్దరి అవసరమూ ఉన్నప్పుడు వేరొక భిన్నాభిప్రాయంగల వ్యక్తికి ఇక్కడ అవకాశం ఇవ్వటానికి అభ్యంతరం ఏముంది?"

శ్రీశుడు అందుకు ఎంతమాత్రం అంగీకరించలేక పోయాడు. దానికి జవాబుగా అతడు ఇలా వాదించాడు— "ఉదారస్వభావము అత్యంతఉత్తమమైనదని నీతిశాస్త్రంలో చదివాను. నేను మీలోని ఉదారస్వభావాన్ని త్రోసి వేయటంలేదు, వేరువేరుగా విభాగం చేయాలని మాత్రమే నా కోర్కె. స్త్రీలు ప్రత్యేకంగా ఒక సంఘములోచేరి తాము చేయగలిగినదేదో చేయవచ్చును. మనము వెళ్ళి వాళ్ళసంఘములో చేరాలని కోరము. మన సంఘములో మనమే ఉంటాము. లేనట్లయితే మనము కార్యరంగములో పరస్పరం అవరోధాలు కల్పించుకొంటూ ఉంటాము. మనస్సుతో ఆలోచించాలి, పొట్టలో ఆహారాన్ని జీర్ణం చేసుకోవాలి — అలాకాకుండా మనస్సుతో చేసేపనిని పొట్టతో, పొట్టతో చేసేపనిని మనస్సుతో చేయించటానికి ప్రయత్నించటం మంచిదికాదు."

"అంతమాత్రాన మనస్సును తెగనరికి ఒకచోట, పొట్టనుకోసి ఒకచోట వేరువేరుగా ఉంచినందువల్లకూడా పని జరుగదుకదా!" అని ఎదురు ప్రశ్న వేశాడు విపినుడు.

శ్రీశుడు విరక్తిభావాన్ని కనబరుస్తూ "ఉపమానాలు

చెప్పటం వాదనకాదు, అంతమాత్రాన నా వాదనను త్రోసివేయటం సాధ్యపడదు. ఉపమానాలు కొంతవరకే పనికొస్తాయి" అని అన్నాడు.

"అంటే నీ వాదనను బలపర్చుకొనుటకుమాత్రమే ఉపయోగిస్తాయన్నమాట" అని అన్నాడు విపినుడు.

ఈ వాదన పూర్ణబాబుకు చాలా విసుగు కల్గించింది. అతడు జోక్యం కల్గించుకొని "విపినబాబూ, మన కార్యక్రమంలో పాల్గొనుటకు స్త్రీలు ముందుకు రావటంవల్ల వారి మాధుర్యమే నశించిపోతుందని నా అభిప్రాయం" అని అన్నాడు.

చంద్రబాబు ఏదో పుస్తకమునుతీసి కళ్ళకు దగ్గరగా ఉంచుకొని చూస్తూ "ఇలాంటి మహత్తర కార్యంలో మాధుర్యం నశించి పోతుందంటే అలాంటి మాధుర్యాన్ని కాపాడటానికి మనము ప్రయత్నించనేకూడదు." అని అన్నాడు.

చంద్రబాబుమాటలకు శ్రీనుడు ఇలా బదులు చెప్పాడు— "అదికాదు చంద్రబాబూ, నేను ఆ సౌందర్యాన్ని, మాధుర్యాన్ని గురించి మాట్లాడటం లేదు. మనము సైనికులవలె అడుగు కలిపి నడవాలి. అలవాటు లేకనో లేక స్వభావసిద్ధమగు బలహీనతవల్లనో మనము ఎవరి వెనుక వెళ్ళకూడదో వారి వెంటనే ముందుకు సాగటం వల్ల మనం చేసేదంతా వృథా అయిపోతుంది."

అదేసమయంలో సగౌరవముగా గదిలోనికి వచ్చి

అందరికీ నమస్కరించి నిలబడుతుంది. లోపలినుంచి ఉబికి వస్తున్న దుఃఖమువల్ల ఆమె కంఠస్వరము పూడిపోయింది.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. చివరికి నిర్మలే ఇలా అంది— "మీ ఆశయాలు ఏమిటో, దేశకల్యాణానికి మీ రెంతవరకు పనిచేయగలరో, ఆ విషయాలేవీ నాకు తెలియవు. నాకు మా మామయ్యనుగురించి మాత్రమే తెలుసును—ఆయన మార్గంలో ఆయనకు సహాయంగా నేనూ పనిచేయాలనుకొంటున్నాను, మీరందరూ నాకెందుకు అడ్డుగా నిలబడుతున్నారు?"

శ్రీశుడు ఏమీ జవాబు చెప్పలేకపోయాడు. పూర్ణ ముఖం వాడిపోయింది. అతడు మనస్సులో ఇలా జరిగినందుకు చాలా బాధపడుతున్నాడు. విపినుడు ప్రశాంతంగానూ చాలా గంభీరంగానూ ఉన్నాడు. చంద్రబాబు కూడా అత్యంత గంభీరంగా ఏదో ఆలోచనలో మునిగి ఉన్నాడు.

అశ్రుపూరిత నయనాలతో నిర్మల పూర్ణబాబు, శ్రీశబాబువైపు చూస్తూ ఇలా అంది— "నేను పనిచేయాలనుకొంటున్నాను. చిన్నప్పటినుండి మా మామయ్యే నాకు గురువు, కనుక జీవితాంతం వారి మార్గాన్నే అనుసరించి వారి ఆశయసిద్ధికోసనే కృషిచేస్తాను. కానీ మీరు ఏవేవో వాదనలతో నాకా యోగ్యత లేదని, నేను అందుకు తగనని నిరూపించాలని ఎందుకు ప్రయత్నిస్తున్నారు? నన్ను గురించి మీకేమి తెలుసు?"

శ్రీశుడు నిశ్చేష్టుడై ముచ్చెమటలుపోసి చూస్తూ ఉండిపోయాడు.

మళ్ళీ నిర్మల ఇలా చెప్పసాగింది — "నేను మీ బ్రహ్మచారి సంఘాన్నో లేక మరొక సంఘాన్నో ఎరుగను. కానీ వారే నాకు విద్యాబుద్ధులు నేర్పి మనిషిగా తయారు చేశారు. వారు బ్రహ్మచారి సంఘంకోసము, దాని ఆశయ సాధనకోసము తమ జీవితాన్ని అర్పించి కృషిచేస్తున్నారు. అలాంటప్పుడు మీరు నన్ని బ్రహ్మచారి సంఘానికి దూరంగా ఎందుకుఉంచాలనుకొంటున్నారు. మామయ్యా, మీరే చెప్పండి. నేను మీకు సహాయపడలేనా? నేను ఆ పనికి తగనా ? మీరు నాకా యోగ్యతలేదని అంటే నేనే తప్పుకుంటాను. వీళ్ళందరూ నన్నే మెరుగుదురు? మీ కార్య క్రమంనుంచి నన్ను దూరంగా ఉంచటానికి వీళ్ళందరూ ఎందుకిలా వాదిస్తున్నారు ?"

శ్రీశుడు ఆమెమాటలు విని అత్యంత వినయ పూర్వకముగా కోమల కంఠస్వరముతో "క్షమించండి, నేను మీ విషయాన్నిగురించి వాదించటంలేదు. నేను మామూలుగా స్త్రీజాతినిగురించి మాట్లాడాను" అని అన్నాడు.

అందుకు నిర్మల ఇలా అంది – "నేను స్త్రీ జాతికి పురుషజాతికి ఉండే తేడానుగురించి నేను మీతో వాదించ దలచటంలేదు – నా హృదయము నాకు తెలుసు, ఎవరిని ఆదర్శంగా పెట్టుకొని ఎవరి అడుగుజాడలలో నడవాలను కొంటున్నానో వారి హృదయం తెలుసు, నేనొక పనిచేయా

లని నిర్ణయించుకొనుటకు ఇంతకంటె అధికంగా తెలుసుకో వలసిన అవసరం లేదనే భావిస్తున్నాను."

చంద్రబాబు తన ఎడమ అరచేతిని కళ్ళకు దగ్గరగా పెట్టుకొని చూస్తూ ఉంటాడు. పూర్ణబాబు అత్యంత చమత్కారంగా ఉండేమాట ఏదైనా చెప్పాలనుకొంటాడు, కానీ, నోటినుండి ఏమాటా పెగలటంలేదు. తనలోతాను అనేకసార్లు అనుకొని "దేవీ, ఈ పంకిలమగు పృథ్వికోసం నీ రెండు హస్తములను ఎందుకు ఉపయోగించాలనుకొంటున్నావో!" అని నెమ్మదిగా అనేశాడు.

విపినుడు తన మామూలు ప్రశాంత గంభీర స్వరంతో "ఈ పృథ్వి ఎంత పంకిలమో, దానిని తీర్చి దిద్దుట అంత పవిత్రమైనది" అని అన్నాడు.

"నిర్మలాదేవిగారూ, స్త్రీలను మా సంఘములో చేర్చుకునే విషయాన్నిగురించి చర్చించి ఒక తీర్మానము ప్రవేశపెట్టి ఆ నిర్ణయమేదో మీకు తెలియజేస్తాము" అని చెప్పాడు శ్రీశుడు.

నిర్మల ఇక అక్కడ ఒక క్షణంకూడా నిలబడకుండా లోనికి వెళ్ళిపోతూఉంది.

అప్పుడు చంద్రబాబు వెనుకనుంచి "అమ్మా నిర్మలా, నా గుండీ ఏదమ్మా?" అని అడిగాడు.

నిర్మల నవ్వుతూ "మీ చొక్కాకే ఉన్నది" అని మృదువుగా జవాబు చెప్పింది.

చంద్రబాబు చొక్కాను తడుముకొని "అవు

నవును, ఇక్కడే ఉన్నదే!" అని అక్కడ కూర్చున్న తన ముగ్గురు శిష్యులవైపు చూచి నవ్వుతాడు.

# 5

అభయకుమార్ ఇంటివద్ద ఒక గదిలో నృపబాల నీరబాల కూర్చొని మాట్లాడుతున్నారు.

"కొద్దిరోజులనుండి మధ్యమధ్య నువ్వెంతో గంభీరంగా ఉంటున్నావేమిటి నీరూ?" అని అడిగింది నృపబాల.

"మన యింటిలో ఉండే గాంభీర్యమంతా నీ ఒక్కదాని సొత్తే అనుకున్నావా! నా ఇష్టం, నేను గంభీరంగా ఉంటాను, ఇంకెలాగైనా ఉంటాను" అని అంది నీరబాల.

"నువ్వు ఏమి ఆలోచిస్తున్నావో నాకు తెలియదనుకొంటున్నావా? నాకు అన్నీ తెలుసు" అని అంది నృపబాల.

"నా ఆలోచనల్నిగురించి నువ్వు అంత శ్రమ పడవలసిన అవసరం ఏమొచ్చింది? నాకు నన్నుగురించి ఆలోచించుకోవటమే సరిపోతుంది."

నృపబాల నీరూ మెడపట్టుకొని "అమ్మ మమ్మల్ని సాధ్యమైనంత తొందరగా వదిలించుకోవాలని ఎందుకింత ఆదుర్దా పడుతుంది! ఈమెతో చాలా చిక్కొచ్చిందే అని ఆలోచిస్తున్నావుగదూ?" అని అడిగింది.

అందుకు నీరూ ఇలా జవాబు చెప్పింది – "అవును మరి, ఎంత వదిలించుకోవాలనుకున్నా పారవేసినంత

మాత్రాన మనము పోయే వస్తువులము కాదుగదా! మన కోసము ఇంత హడావుడి జరగటం నిజంగా గొప్పసంగతే. గౌరి వివాహంకోసము ఒక దేవత కాలి భస్మమైపోయినట్లు కుమార సంభవంలో చదివినట్లు గుర్తు. మన సంగతికూడా ఏ కవిగారికైనా తెలిస్తే మన వివాహాన్ని గురించికూడా అద్భుతంగా ఏదైనా వర్ణిస్తారు."

"నాకుమాత్రం చాలా సిగ్గుగా ఉంది" అని అంది నృపబాల.

"అంటే నేనే సిగ్గుపడటం లేదంటావు? నేనంత సిగ్గుమాలినదానినని నీ ఉద్దేశ్యమా? కానీ ఏం చేయమంటావో నువ్వే చెప్పు. స్కూలులో ఒకసారి బహుమానం తీసుకోటానికి వెళ్ళినప్పుడు చాలా సిగ్గుపడ్డాను, కానీ మళ్ళీ సంవత్సరము బహుమానం పొందటంకోసం రాత్రింబవళ్ళు శ్రమపడి చదివాను. సిగ్గూ పడుతున్నాను, బహుమానాలు వదలటంలేదు, నా స్వభావమే అది."

"అది సరే నీరూ, ఇప్పుడొక బహుమానంకోసం ఈ చర్చంతా జరుగుతుందిగదా, దానికోసం నువ్వంత తహతహలాడుతున్నావా" అని అడిగింది నృపబాల.

"దేనినిగురించో చెప్పు. బ్రహ్మచారిసంఘము లోని ఇద్దరు సభ్యులనుగురించా?" అని అంది నీరూ.

"ఏదైతేనేంలే, నువ్వు అర్థం చేసుకోగలవు" అని అంది నృపబాల.

"నిజం చెప్పమంటావా?" అంటూ నీరూ మెడ చుట్టూ చేతులువేసి ఆమె చెవిలో ఇలా చెప్పింది -

"బ్రహ్మచారి సంఘములోని ఇద్దరు సభ్యులు చాలా సన్నిహిత స్నేహితులట. మనిద్దరము ఆ మిత్రులిద్దరి చేతుల్లోనూ పడినట్లయితే వివాహమయినతరువాతకూడా మనకు ఎడబాటు ఉండదు – అది కానిపక్షములో ఎవరము ఎక్కడికి వెళతామోకూడా తెలియదు. అందుకనే ఆ ఇద్దరు దేవతలకోసము ఈ పూజా పునస్కారాల ఏర్పాట్లన్నీ చేస్తున్నాను. "ఓ బ్రహ్మచారి సంఘములోని అశ్వనీ కుమారులారా! మా అక్కచెల్లెండ్రిద్దరినీ ఒకే కొమ్మకు పూసిన రెండు పుష్పాలుగా మీరిద్దరూ స్వీకరించండి" అని మనస్సులో ఎంతో ప్రార్థిస్తున్నాను.

ఈ విధంగా జరగనియెడల తామిద్దరికీ ఎడబాటు కలుగుతుందని వూహించేసరికి అక్కచెల్లెండ్రిద్దరూ ఒకరినొకరు మరింత గట్టిగా కౌగలించుకుంటారు. నృపబాల మాత్రము ఎంత ప్రయత్నించినా కన్నీరు ఆపుకోలేకపోయింది.

"అది సరే నీరూ, రెండోఅక్కను ఎలావదలి వెళ్ళగలుగుతామో నువ్వే చెప్పు! మనిద్దరము వెళ్ళిపోతే ఆమెకు మరెవరున్నారు" అని అడిగింది నృపబాల.

"ఆ విషయమే నేనూ ఆలోచించాను. మనల్ని ఇక్కడే ఉండనిస్తే మనం ఆమెనువదలి ఎందుకువెళతాము! చిన్నక్కకు భర్తలేదు, మన వివాహాలుకూడా జరగకుండా ఉండే ఒకచోటనే ఉంటాము. ఆమెకంటె ఎక్కువసుఖాలు అనుభవించాలనే కోర్కె మనకు లేదు"అని అంది నీరబాల.

ఇంతలో పురుషవేషాన్ని ధరించిన శైలబాల అక్క

డికి వస్తుంది. నీరూ, నృపబాల బల్లమీద పళ్ళెములో ఉన్న పూలమాలనుతీసి శైలబాలమెడలో వేస్తూ "మేమిద్దరమూ నిన్ను మా భర్తగా వరిస్తున్నాము"అని అన్నారు. ఈ మాట అని ఇద్దరూ శైలబాలకు నమస్కరించారు.

"ఇదేమిటి?" అని అడిగింది శైలబాల.

అందుకు నీరబాల ఇలా అంది—"ఏమీ భయపడకు. మా సవతులిద్దరమూ నిన్నుగురించి దెబ్బలాడుకోము. అలాంటిదేదైనా జరిగినా చిన్నక్క నాతో గెలవలేదు, మీకేమీ కష్టం కలుగకుండా నేనే సమర్థించుకుంటాను. నిజం. అక్కా, నువ్వంటే మాకెంతో గౌరవం, ఇంతగా నిన్నెవరు గౌరవిస్తారో నువ్వే చెప్పు. మమ్మల్ని మరెవరి మెడకో కట్టాలని ఎందుకు చూస్తున్నావు?"

నృపబాల ఏమీ మాట్లాడకుండా కన్నీరు పెట్టుకొంది. శైలబాల ఆమె కన్నీటిని తుడుస్తూ "నృపా, ఏమిటిది, ఛీ! మీకు ఏది సుఖమో ఏదికాదో మీకు తెలుసా? నాతో కలసిఉన్నంతమాత్రాన మీకు సర్వసుఖాలు లభిస్తే నేను మిమ్మల్ని ఎందుకు వదులుకుంటానమ్మా!"అని అంది.

ఇంతలో రసికదాదా అక్కడికి వస్తాడు. "ఇదుగో అమ్మాయిలూ, అనాగరికుడనగు నన్ను నాగరికుడుగా చేశారు—ఇవాళ సమావేశము ఇక్కడే జరుగుతుంది, ఎలా నడుచుకోవాలో ఏమిటో చెప్పండి" అని అన్నాడు రసికదాదా వారితో.

"మళ్ళీ పాతపరిహాసాలేనా? నాగరికుడు, అనాగరి

కుడు అంటూ మొన్నటినుంచి మాట్లాడుతున్నారు" అని అంది నీరబాల.

"ఎవరు సృష్టించినదానిమీద వారికి మమకారం ఉండదంటారా? ఒకసారి నోటినుంచి పరిహాసమువస్తే చాలు రాజపుత్రకన్యవలె దానిని పీకనులిమి చంపివేయట మేనా! దానివల్ల వచ్చే నష్టమేముంది — బ్రహ్మచారి సంఘములో ఉన్నంతకాలము నా పరిహాసాలను మీరు రెండుపూటల వినకతప్పదు" అని అన్నాడు రసికదాదా.

అందుకు నీరబాల ఇలా అంది— "అయితే దానిని కొంచెం త్వరలోనే ముగించాల్సివస్తుందే! చిన్నక్కా, రసికదాదాయొక్క రసికత్వాన్ని పాతబడిపోనివ్వకూడదు, బ్రహ్మచారి సంఘముయొక్క స్థిరత్వమును అస్థిరము చేయాలి. అప్పుడే ప్రపంచమును జయించిన స్త్రీ, అనే పేరు సార్థకమవుతుంది. ఏవిధంగా ఆక్రమణ చేయాలి, ఏమిటి అనేదేదైనా ప్లాను ఆలోచించారా?"

"ఏమీ ఆలోచించలేదు. రణరంగంలోకి వెళ్ళిన తరువాత అప్పటిపరిస్థితులనుబట్టి ఆలోచించిచేయాల్సిందే" అని అంది శైలబాల.

"నా అవసరం కలిగినప్పుడు రణభేరి మ్రోగిస్తేచాలు వెంటనే నేను వచ్చి వాలతాను. నేను బ్రహ్మచారి సంఘాన్ని చూచి ఎందుకు భయపడాలి, తామరతూడుల వంటి నా బాహువులలో లేనిదేమిటో చెప్పు సఖీ!" అని అంది నీరబాల.

ఇంతలో అక్షయబాబు అక్కడికివచ్చి వాళ్ళందరినీ

చూచి "ఇక్కడ సభతీర్చిన విదుషీమణులను ఒక చారిత్రక ప్రశ్న అడగాలనుకొంటున్నాను" అని అన్నాడు.

"సిద్ధముగా ఉన్నాము, అడగండి" అని అంది శైలబాల.

"నిలబెట్టిన రెండు కొమ్మలను నరకకోరిన దెవరో చెప్పండి చూద్దాం" అని అడిగాడు అక్షయబాబు.

"నాకు తెలుసు ముఖర్జీమహాశయా, కాళిదాసు" అని చెప్పింది నృపబాల.

"కాదు, అంతకంటెకూడా గొప్పవాడే. శ్రీ అక్షయ కుమారముఖోపాధ్యాయ" అని అన్నాడు అక్షయబాబు.

"మరి రెండు కొమ్మలు ఎవరు?" అని అడిగింది నీరబాల.

అక్షయబాబు కుడిచేతో నీరబాలను దగ్గరకు లాక్కొని 'ఈమె ఒక కొమ్మ', ఎడమచేతితో నృపబాలను ప్రక్కకు లాక్కొని 'ఒక కొమ్మ ఈమె' అని చెప్పాడు.

"కొమ్మలనునరికే గొడ్డలి ఇవాళ వస్తుందంటారా?" అని అడిగింది నీరబాల.

"రావటం ఏమిటి, వచ్చిందని చెప్పటంకూడా అతిశయోక్తికాదేమో! మెట్లమీద అడుగులచప్పుడు విన్పిస్తుంది చూడండి" అన్నాడు అక్షయబాబు.

ఏమి జరిగిందో ఏమో అందరూ పారిపోతారు. శైలబాల పారిపోతూ రసికదాదానుకూడా లాక్కొని వెళుతుంది. గాజుల గలగలలు, బెదిరిన లేళ్ళవలె పరుగెత్తే

అడుగుల చప్పుడు విన్పించటం ఆగిపోయింది. అప్పుడే శ్రీశబాబు, విపినుడు గదిలోకి వస్తారు.

అక్షయబాబు వాళ్ళిద్దరినీ చూచి "పూర్ణబాబు రాలేదా?" అని అడిగాడు.

"చంద్రబాబు ఇంటివద్ద కలుసుకున్నాము. కానీ అకస్మాత్తుగా అతని ఆరోగ్యము చెడిపోయింది, అందుకని ఇక్కడికి ఇవాళ రాలేకపోయారు" అని జవాబు చెప్పాడు శ్రీశుడు.

అక్షయబాబు బయటివైపు చూస్తూ "మీరు కూర్చొని ఉండండి, నేను బయటనే నిలబడిఉండి చంద్ర బాబును లోనికి తీసుకువస్తాను. వారికి చూపు సరిగా కన్పించదు. ఎక్కడికి వెళ్ళాల్సి ఎక్కడికి వెళతారో వారికే తెలియదు – చుట్టుప్రక్కల కొన్ని ప్రదేశాలు బ్రహ్మచారిసంఘ సభ్యులు వెళ్ళతగినవికూడా కావు" అని లేచి బయటకు వెళ్ళాడు.

అక్షయబాబు వెళ్ళినతరువాత శ్రీశుడు గదిని పరిశీలనగా చూచాడు. గదిలో రెండు దీపాలు వెలుగుతున్నాయి. ఆకుపచ్చ కలిసిన నీలపురంగు తెరలలోనుంచి దీపాలకాంతి చాలా అందంగా ఉంది. బల్లమధ్య గాజు పాత్రలో రంగురంగుల పుష్పాలు అలంకరించి ఉన్నాయి.

అక్కడి వాతావరణాన్ని చూచి విపినుడు నవ్వుతూ "మిత్రమా, నువ్వు లక్ష చెప్పు, ఈ గది బ్రహ్మచారి సంఘానికి తగినది కాదు" అని అన్నాడు.

శ్రీశుడు ఆశ్చర్యపడుతూ "ఎందుకని?" అని అడిగాడు.

"ఈ గదిని అలంకరించినతీరు నువ్వు చెప్పే ఆధునిక సన్యాసుల అలంకరణనుకూడా మించిఉన్నట్లు కన్పిస్తుంది" అని అన్నాడు విపినుడు.

"అంత ఎక్కువగా ఏమీం లేదే!" అని అన్నాడు శ్రీశబాబు.

"స్త్రీలుతప్ప ఎలాంటి అలంకరణలు ఉన్నా ఇబ్బంది లేదంటావు, అంతేనా?" అని అడిగాడు విపినుడు.

"అవును, స్త్రీలుమాత్రమే నిషేధం" అని జవాబు చెప్పాడు శ్రీశుడు.

ఇంతకుముందు ఇలాంటి చర్చ ఎప్పుడైనా వస్తే చాలా తీవ్రంగా ఉండేది, కానీ ఇవాళ ఎందుకనో ఆ విధంగా జరగలేదు.

విపినుడు తన అభిప్రాయాన్ని బలపర్చే నిదర్శనాలు చూపిస్తూ మళ్ళీ ఇలా అన్నాడు - "ఈ గది గోడల మీద వ్రేలాడే చిత్రాలు, ఇంకా ఇతర అలంకరణలు, సామానులు చూస్తే ఈ గదిలో స్త్రీలు ఉన్నట్లుగానే కన్పిస్తూంది."

"ప్రపంచంలో అన్నిచోట్ల స్త్రీజాతి జాడలు కన్పిస్తూనే ఉంటాయి" అని అన్నాడు శ్రీశుడు.

"అది నిజమేననుకో. కవులమాటలు యదార్థమని అంగీకరించినట్లయితే చంద్రునిలోను, పుష్పాలలో, లతలలో, ఆకులలో, అక్కడ ఇక్కడ ఏమిటి స్త్రీజాతి దర్శ

నము కాని దురదృష్టవంతుడు ప్రపంచంలోనే ఉండడు" అని అన్నాడు విపినుడు.

అందుకు శ్రీశబాబు నవ్వి ఇలా అన్నాడు — "చంద్రబాబుగారి చీకటిగది స్త్రీజాతికి దూరంగా ఉన్న ప్రదేశమని ఇంతవరకు నమ్ముతూ వచ్చాను. కానీ ఇవాళ ఆ భ్రమ కాస్తా తొలగిపోయింది. మిత్రమా, స్త్రీజాతి భూమండలమంతా వ్యాపించిఉంది."

"బ్రహ్మచారి సంఘంకోసం కొద్దిచోటునుకూడా వదలలేదు. సమావేశాలు జరిగే చోటకూడా వారే—" అని విపినుడు ఇంకా ఏదో చెప్పబోయాడు.

ఇంతలో శ్రీశుడు ఒకమూల ముక్కాలి పీటమీద ఉన్న స్త్రీలు తలలో ధరించే రెండు పిన్నులు తెచ్చి విపిన బాబుకు చూపించాడు. విపినుడు వాటిని అందుకొని పరిశీలించిచూస్తూ "మిత్రమా, ఇది బ్రహ్మచారులు నిర్భయంగా తిరగగలిగే ప్రదేశంకాదు. అంతా ముళ్ళమయం" అని అన్నాడు.

"పుష్పాలూ ఉన్నాయి, ముళ్ళూ ఉన్నాయి" అని అన్నాడు శ్రీశుడు.

"అదేగదా వచ్చిన చిక్కు. ఒక ముళ్ళే గనుక అయితే తప్పించుకొని వెళ్ళవచ్చును" అని అన్నాడు విపినుడు.

అదేగదిలో ఇంకొకమూల ఉన్న చిన్న పుస్తకాల పెట్టెలోనుంచి శ్రీశుడు ఒక్కొక్క పుస్తకమునే తీసి చూడసాగాడు. కొన్నినవల లున్నాయి, మరికొన్ని ఆంగ్ల

పద్యకావ్యాలు ఉన్నాయి. శ్రీశుడు వాటిలో ఒక ఆంగ్ల కావ్యాన్ని తీసి పేజీలు తిరగేస్తాడు. దానిలో ఒకచోట స్త్రీల దస్తూరిలో నోట్ వ్రాసి ఉంది. వెంటనే శ్రీశుడు పుస్తకమును మూసి అట్టమీద చూస్తాడు. తరువాత ఆ పుస్తకమును విపినుడి ముందుంచుతాడు.

విపినబాబు ఆ పుస్తకముమీది పేరును చూచి "నృపబాల! ఇది పురుషుల పేరు కాదనే నా నమ్మకము. నువ్వేమనుకొంటున్నావు ?" అని అడిగాడు.

"నేనూ అదే అభిప్రాయపడుతున్నాను. ఇదుగో, ఈ పేరుకూడా అలాగే ఉంది" అని శ్రీశుడు మరొక పుస్తకాన్ని తీసి అతని చేతికిస్తాడు.

"నీరబాల! ఈ పేరు కావ్యాలలో బాగా రాణిస్తుంది. కానీ బ్రహ్మచారి సంఘములో ..." అని మరేదో అనబోయాడు.

వెంటనే శ్రీశుడు అందుకొని "ఈ పేర్లుగల స్త్రీలు ఒకవేళ మన సంఘంలోనికి వచ్చినట్లయితే ద్వారందగ్గరే వాళ్ళను ఆపివేయగల బలవంతులు మనలో ఎవరూ కన్పించటంలేదు" అని అన్నాడు.

"పూర్ణబాబు ఒక దెబ్బతోనే దిమ్మతిరిగిపోయాడు–బ్రతుకుతాడో లేదోకూడా సందేహమే" అన్నాడు విపినుడు.

"ఎందుకని ?" అని ప్రశ్నించాడు శ్రీశుడు.

"నువ్వు అంత పరిశీలనగా చూడలేదేమో" అని అన్నాడు విపినుడు.

"అలాంటిదేమీ లేదు; నువ్వు అలా అని అనుకొని ఉంటావు" అని అన్నాడు శ్రీశుడు.

అందుకు జవాబుగా విపినుడు "హృదయమనేది చేతికి చిక్కేదిగానీ కంటికి కన్పించేదికానీ కాదుగదా, వూహద్వారానే దానిసంగతి తెలుసుకోగలుగుతాము" అని అన్నాడు.

"అలాంటప్పుడు పూర్ణకు వచ్చిన రోగముకూడా వైద్యశాస్త్రములో కన్పించదేమో" అని అన్నాడు శ్రీశుడు.

"ఉండదు; ఇలాంటి వ్యాధుల్ని గురించి వైద్యకళాశాలలలో ఏమీ బోధించరు" అన్నాడు విపినుడు.

"మనము ఈ భవనంలోనికి అడుగుపెట్టగానే రసిక చక్రవర్తి అను పేరుగల ఒక వృద్ధయువకుడు కన్పించాడు, అతడు మన బ్రహ్మచారి సంఘపు ద్వారపాలకుని పదవికి తగడని నా అభిప్రాయం" అని అన్నాడు శ్రీశుడు.

"శివుడు తపస్సు చేసుకొనే అడవికి చిచ్చుపెట్టటానికి కామదేవుడే స్వయంగా నంది వేషములో వచ్చాడు, అలాగే ఈ రసికచక్రవర్తినికూడా నమ్మటానికి వీల్లేదు" అన్నాడు విపినుడు.

ఇంతలో చంద్రబాబు అక్కడికి వచ్చాడు. "మీ వాద ప్రతివాదాలవల్ల పూర్ణబాబు ఆరోగ్యం అకస్మాత్తుగా చెడిపోవటం గమనించి నేను వారిని ఇంటికి పంపివేయటం మంచిదనుకున్నాను" అని అన్నాడు చంద్రబాబు.

"అసలే బలహీనమైన మనిషి, మొదటినుంచి

అతడు జాగ్రత్తగా ఉండవలసింది" అని అన్నాడు విపినుడు పూర్ణబాబును గురించి.

"మరీ అంత అజాగ్రత్తగా ఉన్నట్లుకూడా కన్పించే వాడుకాదు" అని అన్నాడు చంద్రబాబు.

ఆ దేసమయంలో అక్షయబాబు, రసికదాదా అక్కడికి వస్తారు.

వస్తూనే అక్షయబాబు "క్షమించండి. ఈ కొత్త సభ్యుణ్ణి మీ చేతుల్లోపెట్టి నేను వెళ్ళిపోతున్నాను" అని అన్నాడు.

రసికదాదా నవ్వి "నాలోని కొత్తదనం పైకి ప్రత్యక్షంగా కన్పించదు—" అని అన్నాడు.

"అత్యంత వినయ విధేయతలతో దానిని బాహ్యమగు పాతదనంతో కప్పిఉంచాడు — లోపలఉన్న నూతనత్వం క్రమంగా కనబడుతుంది. సార్థకనామధేయులు శ్రీ రసికచక్రవర్తి అంటే వీరే" అని చెప్పాడు అక్షయబాబు.

"నాలోని రసగ్రహణశక్తి తెలియకముందే తండ్రిగారు నాకు 'రసికచక్రవర్తి' అని నామకరణం చేశారు, కనుక ఇప్పుడు తండ్రిగారి మాట నిలబెట్టేందుకుగాను నేను రసికత్వంకోసం ప్రయత్నించవలసి వచ్చింది. అయినా 'యత్నే కృతే యదిన సిధ్యతికోత్ర దోషః'" అని అన్నాడు రసికదాదా.

అక్షయబాబు అక్కడినుండి వెళ్ళిపోతాడు. పురుష వేషాన్ని ధరించిన శైలబాల అక్కడికి వచ్చి అందరికీ నమస్కరించింది. దృష్టిఆనని చంద్రబాబు అదొకమాదిరిగా

ఆమెవైపు చూస్తాడు, విపినుడు, శ్రీశుడు రెప్పవేయకుండా ఆమెవైపు చూస్తూ ఉండిపోయారు. శైలబాల వెనుక ఇద్దరు నౌకర్లు భోజనపాత్రలు తీసుకొని ప్రవేశించారు. శైలబాల చిన్నచిన్న వెండి పళ్ళెములను అక్కడకూర్చొని ఉన్నవారిముందుంచుతుంది.

పురుషవేషంలో ఉన్న శైలబాలను చూపిస్తూ రసికదాదా వారితో ఇలా అన్నాడు—"వీరుకూడా మీ సంఘములో మరొక క్రొత్త సభ్యుడు. వీరి నవీనతను గురించి వేరే చెప్పనవసరంలేదు. బాహ్య నవీనత్వంతో వీరు తమ బుద్ధి ప్రావీణ్యాన్ని దాచుకున్నారు. మీకేదో ఆశ్చర్యంగా ఉన్నట్లుందే! మీకు వీరు బాలునివలె కన్పిస్తున్నారుకదూ! వీరు మీకు కన్పిస్తున్నంత పసిబాలుడు కాదని హామీనిస్తున్నాను."

"వీరి పేరేమిటి?" అని అడిగాడు చంద్రబాబు.

"వీరిపేరు శ్రీ అబలాకాంత చట్టోపాధ్యాయ" అని జవాబు చెప్పాడు రసికదాదా.

"అబలాకాంతుడా?" అని గొణిగాడు శ్రీశుడు.

రసికదాదా అందుకు ఇలా జవాబు చెప్పాడు—"ఇలాంటి పేరు మన సంఘానికి పనికిరాదనే విషయం నేను అంగీకరిస్తాను. పేరు విషయంలో నాకు పట్టింపుగానీ అంత వ్యామోహంగానీ లేదు— ఆ పేరును మార్చివేసి విక్రమసింహుడనో, భీమసేనుడనో లేదా మరే పేరుతో పిలిచినా వారికేమీ అభ్యంతరం ఉండదు. 'స్వనామా పురుషో ధన్యః' అని శాస్త్రములలోవ్రాసి ఉన్నప్పటికీ, అబలా

కాంతుడనే పేరుతోనే వీరు ప్రపంచంలో పేరు ప్రతిష్ఠలు పొందాలని ప్రాకులాడటంలేదు"

"అదేమిటి మహాశయా! వారిని ఇప్పుడు పేరు మార్చుకోమని ఎవరన్నారు? వద్దనుకున్నప్పుడు మార్చటానికి పేరు మనం ధరించే దుస్తులవంటిది కాదుగదా!" అని అన్నాడు శ్రీశుడు.

ఆమాటవిని రసికదాదా ఇలా అన్నాడు— "అవునవును, అది మీ సంస్కారాన్ని తెలియజేస్తుంది శ్రీశబాబూ! పూర్వీకులు పేరునుకూడా దుస్తులుమాదిరిగానే భావించేవారు. అందాకా ఎందుకు, అర్జునునికి తల్లిదండ్రులు పెట్టిన పేరేమిటో సరిగా చెప్పటం కష్టమే— పార్థివుడనీ, ధనంజయుడనీ, సవ్యసాచియనీ ఏవేవో అనేక పేర్లు, ఎవరికి ఇష్టం వచ్చిన పేరుతో వారు పిలిచేవారు. కనుక పేరును మీరు సత్యమని భావించవద్దు; వీరిని మీలో ఎవరైనా పొరపాటున అబలాకాంతుడని పిలవక పోయినప్పటికీ అలా పిలవనందుకు వీరేమీ బాధపడరు."

శ్రీశుడు నవ్వి రసికదాదాతో ఇలా అన్నాడు— "మీరు ఇంత గట్టిగా హామీ ఇచ్చారుగనుక నేనిక నిశ్చింతగా ఉంటాను— అసలు పేరు మర్చిపోయి ఏదో పేరుతో పిలిచి వారి ఓర్పును పరీక్షించే అవకాశాన్ని రానివ్వను."

"మీకు అలాంటి పొరపాటు రాదేమో, కాని నేను అప్పుడప్పుడూ పొరపాటు పడుతూ ఉంటాను, చుట్టరికము రీత్యా నాకు మనుమడవుతాడు, నాలుక అప్పుడప్పుడూ తడబడి ఏదో అనబోయి ఏదో అంటూ ఉంటాను, కానీ

మా మనుమడు నన్ను ఏమీ అనడు” అని అన్నాడు రసికదాదా.

శ్రీశుడు అబలాకాంతునివైపు తిరిగి “అబలాకాంత బాబూ, ఇదంతా ఏమిటి! నేటి మన కార్యక్రమంలో విందు మొదలగునవి ఏమీ లేవే!” అని అడిగాడు.

రసికదాదా లేచి నిలబడి “ఆ లోపాన్ని కనిపెట్టి తీర్చినవారికి మనసంఘం తరఫున ధన్యవాదా లర్పించాలి” అని అన్నాడు.

శైలబాల పళ్ళెములను వారిముందుంచుతూ “శ్రీశ బాబూ, ఆహారంకూడా మీకు నియమవిరుద్ధమైనదేనా?” అని అడిగింది.

శ్రీశుడు బలంగా బొద్దుగాఉన్న విపినబాబును తన వైపు లాగుతూ “ఈ సభ్యుని ఆకృతిని చూచిన తరువాత ఆ విషయంలో మరేమీ సందేహం ఉండదు” అని అన్నాడు.

అందుకు విపినుడు ఇలా చెప్పసాగాడు— “అబలా కాంతబాబూ, నియమాన్ని గురించి మాట్లాడినట్లయితే ప్రపంచములోని గొప్ప గొప్ప విషయాలన్నీ తమ తమ స్వంత నియమాలకు లోబడే జరుగుతూ ఉంటాయి. సామర్థ్యముగల రచయిత తన నియమాలననుసరించి నడుచు కుంటాడేకాని ఒక గొప్ప విమర్శకుని నియమాల ననుసరించి నడుచుకోడు. విందుకు కావలసిన తినుబండారములను సమకూర్చాను, వీటికి ఏ సంఘ నియమాలూ వర్తించవు- కూర్చోవటము, తినటమే వీటికి ఏకైక నియమము. తినటం

పూర్తికానంతవరకు ప్రపంచంలోని నియమాలన్నీ ద్వారం వెలుపలే ఉండి నిరీక్షించాలి."

"ఇదెప్పటినుంచి విపిన్, నువ్వు తినటమే చూశాను కానీ ఏకబిగిని ఇన్నిమాటలు మాట్లాడటం ఎప్పుడూ విన లేదు" అని అన్నాడు శ్రీశుడు.

"నాలుక అమితోత్సాహంగా ఉంది, ఇలాంటి సమ యాల్లో సరస సంభాషణ చాలా తేలికగా ఉంటుంది. నా జీవిత చరిత్రను వ్రాసేవారు ప్రస్తుతం ఎక్కడ ఉన్నారు?" అని అన్నాడు విపినుడు.

రసికదాదా తన బట్టతలను సవరించుకుంటూ "నా మీద అలాంటి ఆశలేమీ పెట్టుకోవద్దు, నేను అంతకాలం వరకు నిరీక్షిస్తూ ఉండలేను" అని అన్నాడు.

తమ కొత్త ఆఫీసు అలంకరణ చూచిన తరువాత చంద్రమాధవబాబు మనస్సు వ్యాకులపడుతూఉంది. వారి లోని ఉత్సాహము మామూలుగా పనిచేయటంలేదు. వారు మాటిమాటికి తమ సంఘపు రిజిష్టరును కళ్ళకు దగ్గరగా పెట్టుకొని చూడసాగారు.

అలాంటి స్థితిలో శైలబాల వారి ఎదుటకువెళ్ళి నిల బడి "చంద్రబాబూ, సంఘ కార్యక్రమానికి నేను ఆటంకం కల్గించిఉంటే క్షమించండి, కానీ విందు—" అని ఇంకా ఏదో చెప్పబోయింది.

"ఇలాంటి సాంఘిక మర్యాదలు సంఘ కార్యక్రమా నికి నష్టమే కల్గిస్తాయి" అని అన్నాడు చంద్రబాబు.

అందుకు రసికదాదా "సరే, పరీక్షించి చూడండి.

విందువలన సంఘ కార్యక్రమానికి ఆటంకము కలిగితే—"
అని అన్నాడు. మధ్యలో అతని మాటలకు అడ్డొస్తూ విపి
నుడు మృదుస్వరంతో "భవిష్యత్తులో ఏమీ లేనప్పుడు
సంఘాన్ని ఆపి ముందు విందు పూర్తికానివ్వటమే మంచిది"
అని అన్నాడు.

"రసికబాబూ రండి, మీరు లేవరేమిటి?" అని
అన్నాడు శ్రీశుడు.

"ప్రతిరోజు రుచి చూడటానికి నేను మధ్య మధ్య
చాలాసార్లు తింటూ ఉంటాను. ఇవాళ మీరు బ్రహ్మచారి
సంఘ సభ్యుడుగా అందరితోపాటు నన్నూ గౌరవించి బ్రతి
మాలతారని ఆశించాను, కానీ—", అని అన్నాడు.

వెంటనే శైలబాల అందుకొని "కానీ ఏమిటి రసిక
దాదా! మీరేదో ఆదివారం నోము పట్టినట్లు కూర్చు
న్నారు, మీరేమీ తినరా?" అని అడిగింది.

"చూస్తున్నారుగదా మహాశయా! నియమమనేది
ఒక్క రసికదాదా కోసమే అన్నట్లుంది. అంతేగదూ—
'బలం బలం బాహుబలం' అన్నట్లు బ్రతిమాలటం మొద
లగు వాటికోసం ఎదురుచూడకండి" అని అన్నాడు రసిక
దాదా.

నాలుగు పళ్ళెములలో మాత్రమే వడ్డించడం చూచి
విపినుడు "మాతోపాటు మీరు కూర్చోరా?" అని అడి
గాడు శైలబాలను.

"లేదు, నేను వడ్డిస్తాను" అని జవాబిచ్చింది ఆమె.

"అదెలా కుదురుతుంది?" అన్నాడు శ్రీశుడు.

"నన్ను వడ్డించనివ్వండి. మీతో కలిసి కూర్చోవ టంకంటె నాకు ఇదే ఆనందంగా ఉంటుంది" అని జవాబు చెప్పింది శైలబాల.

"రసికబాబూ, ఇది మంచిదేనంటారా, మీరే చెప్పండి" అని అడిగాడు శ్రీశుడు.

" 'భిన్న రుచిహిం లోకః'. వారికి వడ్డించడమే ఇష్టము, మనకు ఆరగించడం ఇష్టము. ఇలాంటి రుచి భేదా లున్నందువల్ల కొన్ని సదుపాయాలుంటాయి" అని అన్నాడు రసికదాదా.

అందరూ తినటం ప్రారంభించారు. చంద్రబాబు సరిగా కన్పించక తడుముకొంటూ ఉంటాడు. అదిచూచి శైలబాల "చంద్రబాబూ, ఇది మిఠాయి, ముందు ఇది తినవద్దు. ఇదుగో ఇటువైపున కూర ఉంది. మంచి నీళ్ళ గ్లాసు కన్పించలేదా, ఇదుగో" అంటూ వారికి సహాయ పడసాగింది. తరువాత ఆమె మామిడిపండును ముక్కలుగా కోసి చంద్రబాబు పళ్ళెములో ఉంచింది. భోజనము చేస్తు న్నంతవరకు చంద్రబాబుకు ఎలాంటి ఇబ్బంది కలుగకుండా ఆమె చూడసాగింది.

అప్పుడే చంద్రబాబు చర్చను ప్రారంభిస్తూ "శ్రీశ బాబూ, స్త్రీలను మన సంఘములో చేర్చుకొనే విష యాన్ని గురించి మీరేమి ఆలోచించారు?" అని అడిగాడు.

"ఆలోచించాను, దానివల్ల నాకేమీ చెడు కన్పిం

చలేదు. అయితే సంఘం దృష్టిలో ఎలా వుంటుందా అనేదే ఆలోచిస్తున్నాను" అని అన్నాడు శ్రీశుడు.

"అనేక విషయాలలో మనము సంఘాన్ని శిశువుగానే భావించాలి. పసివాని అభ్యంతరాలన్నీ గమనించి నడచుకుంటే ఆ పసివాని అభివృద్ధి సాధ్యంకానట్లే సంఘం విషయంలోకూడా మనము కొన్నింటిని పాటించకూడదు" అని అన్నాడు విపినుడు.

"మన దేశములో అనేక సభలు, సమాజాలు పని చేస్తున్నాయి. అయితే వాటిలో చాలాభాగము ఎక్కువ కాలము మనలేకపోతున్నాయి. వాటి కార్యక్రమాలలో స్త్రీల సహకారము లేకపోవటమే అందుకు ప్రధాన కారణమని నా అభిప్రాయం. మీరేమంటారు రసికబాబూ" అని అన్నాడు శ్రీశుడు.

అందుకు రసికదాదా ఇలా చెప్పాడు— "వయస్సు ననుసరించి స్త్రీజాతితో నాకు ముఖ్యమైన సంబంధాలేవీ లేకపోయినప్పటికీ నాకు తెలిసినంతవరకు స్త్రీలు సహకరించనూ గలరు లేదా బాధలను కల్గించగలరు, సృష్టించనూగలరు లేదా ప్రళయమూ పుట్టించగలరు. కనుక వారిని మన సంఘములో చేర్చుకున్నందువల్ల ఇతరమైన మంచి ఏదీ జరగకపోయినా చెడుమాత్రం జరగకుండా ఉంటుంది. మీరు కూడా ఆలోచించి చూడండి, బ్రహ్మచారిసంఘములోనికి మీరు స్త్రీలనుకూడా చేర్చుకునేట్లయితే వారు రహస్యంగా మన సంఘానికి హాని కల్గించే ప్రయత్నం చేయరు—కానీ ప్రస్తుత పరిస్థితిలో..."

"బ్రహ్మచారిసంఘంమీద స్త్రీలకు ఇంత విరోధ భావం ఉన్నదని రసికదాదా కెలా తెలిసిందో?" అని అడిగింది శైలబాల.

"విరోధభావం ఉన్నట్లు తెలియకముందుమాత్రం జాగ్రత్తపడకూడదా ఏం! ఒకే కన్నుగల లేడికి కన్నులేని వైపునుంచే బాణంవచ్చి తగులుతుంది; అలాగే బ్రహ్మచారిసంఘంకూడా స్త్రీలవిషయంలో ఒకేకన్నుగల ధోరణిలో వ్యవహరించటం జరిగితే గాయపడటం ఖాయమే" అని అన్నాడు రసికదాదా.

శ్రీశుడు కోమలకంఠస్వరంతో "ఒక కన్నుగల లేడి ఇవాళే ఒక దెబ్బ తిన్నది, ఒక సభ్యుడు ఇట్టే నేలకూలాడు" అని అన్నాడు.

తరువాత చంద్రబాబు తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తంచేశాడు – "పురుషులనుమాత్రమే చేర్చుకొని సంఘానికి సేవ చేయాలనుకోవటం ఒక కాలితో నడిచినట్లే అవుతుంది. అలాంటివారు ఒక కాలితో ఎంతోదూరం నడవలేక కొద్దిఅడుగులు నడిచి కూర్చుంటారు. గొప్పగొప్ప ప్రయత్నాలు ఎన్నో జరిగాయి. స్త్రీలను వాటికి దూరంగా ఉంచినందువల్లనే మన దేశ కార్యక్రమాలు సజీవంగా సాగటంలేదు. మన హృదయము, మన పనులు, మన ఆశలు బయటనే, ఇంటిలోపల నిషేధమే. అందుకనే మనము బయటకువెళ్ళి ఉపన్యాసాలు చెపుతాము, ఇంటికి రాగానే మర్చిపోతాము. అబలాకాంతబాబూ, వయసులో మీరు చాలా చిన్నవారు, ఒక విషయం మీరెప్పుడూ

మర్చిపోవద్దు — స్త్రీజాతిని అనాదరముతో చూడకండి. స్త్రీజాతిని మనము అట్టడుగున ఉంచితే వాళ్లు మనల్ని కూడా క్రిందికి లాగుతారు. ఆ స్థితిలో మనము ఉన్నతి మార్గములో నడచుట అసాధ్యమే అవుతుంది — తిరిగి ఇంటికే చేరి ఒక మూలపడి ఉండాల్సివస్తుంది. స్త్రీజాతిని కూడా మనము ఉన్నతస్థితిలో ఉంచినట్లయితే ఇంటిలోపల కూడా మన ఆదర్శాలను సగర్వంగా పాటించగలుగుతాము. మన దేశములో బయటనైతే సిగ్గుపడతాము, కానీ ఇంటిలో ఆ సిగ్గుపడటంకూడా ఉండదు. అందుకనే మన ఉన్నతి యావత్తు బాహ్యాడంబరంగా పరిణతి చెందుతుంది."

"మీ ఆదర్శాలు వ్యర్థంకాకుండా మీ ఆశయసిద్ధికై పాటుపడునట్లు నన్ను ఆశీర్వదించండి చంద్రబాబూ" అని అన్నది శైలబాల.

"నా మేనకోడలు నిర్మల బ్రహ్మచారిసంఘములో సభ్యురాలుగా చేరటానికి మీకెవరికీ ఎలాంటి అభ్యంతరము లేదుగదా?" అని అడిగాడు చంద్రబాబు.

"మరే అభ్యంతరమూ లేదు, ఒక్క వ్యాకరణ సంబంధమైన అభ్యంతరమే ఉంది. బ్రహ్మచారిసంఘంలోనికి ఎవరైనా కన్యారూపంలో వస్తే బోపదేవుని శాపం తగులుతుంది" అన్నాడు రసికదాదా.

"ప్రస్తుతకాలములో బోపదేవుని శాపము పని చేయటంలేదు" అని ఖండించింది శైలబాల.

"అది మంచిదేకదా! కానీ స్త్రీసభ్యురాండ్రు పురుషసభ్యులకు తెలియకుండా వేషము, పేరు మార్చుకొని

గనుక వస్తే మంచిదని నా అభిప్రాయం. అప్పుడు ఎలాంటి చిక్కులూ ఉండవు" అన్నాడు రసికదాదా.

"అలాంటప్పుడు ఎవరు స్త్రీలు, ఎవరు పురుషులు అనే కుతూహలం కలుగుతుంది. ఆ సందేహం స్త్రీలవిషయంలో కావచ్చు, లేదా—" అని అన్నాడు శ్రీశుడు.

"నన్నుగురించిమాత్రం అలాంటి సందేహం కలుగదు" అన్నాడు విపినుడు.

"మా మనుమరాలినిగురించికూడా అంత తేలికగా ఎవరికీ సందేహం కలుగదనే నా అభిప్రాయం" అని అన్నాడు రసికదాదా.

"కానీ అబలాకాంతబాబునుగురించిమాత్రం ఒక సందేహం ఉండనే ఉంటుంది" అన్నాడు శ్రీశుడు.

ఇంతలో శైలబాల ప్రక్కనే ముక్కాలిపీటమీద ఉన్న మిఠాయిపళ్ళెము తెచ్చి అందరికీ వడ్డిస్తుంది.

చంద్రమాధవబాబు రసికదాదాతో ఇలా అన్నాడు— "చూడండి రసికబాబూ, భాషాశాస్త్రములో కన్పించే దేమంటే ఒక శబ్దమును ఉపయోగించినకొద్దీ దాని అసలు అర్థము మరుగునపడిపోయి మరొక వ్యతిరేకఅర్థము వస్తుంది. స్త్రీలను మన సంఘములో చేర్చుకున్నందువల్ల బ్రహ్మచారిసంఘముయొక్క అర్థములో మార్పు రావచ్చును, అందువల్ల నష్టమేముంది!"

"ఏమీలేదు. మార్పుకు నేను వ్యతిరేకిని కాదు— అది పేరు మార్పు కావచ్చు, వేషము మార్పు కావచ్చు, లేదా మరొకటి కావచ్చును. ఎప్పుడు ఏది జరిగితే దానిని

అంగీకరించటానికి నేను సర్వదా సిద్ధంగా ఉంటాను'' అని చెప్పాడు రసికదాదా.

విందు ముగిసింది. స్త్రీలను బ్రహ్మచారిసంఘంలో చేర్చుకునే విషయంలోకూడా ఎవ్వరూ అభ్యంతరం చెప్ప లేదు. అంటే అందుకు అందరూ అంగీకరించినట్లే భావించవచ్చును.

"నేటి సభాకార్యక్రమానికి ఎలాంటి ఆటంకమూ కలుగలేదనే ఆశిస్తున్నాను'' అని అన్నాడు రసికదాదా అందరివైపు చూస్తూ.

"అలాంటిదేమీ కలుగలేదు-ఇంతకుముందు కార్య క్రమాలలో నోటికిమాత్రమే పనితగిలేది, ఇవాళ కుడిచేతికి కూడా పనికలిగించారు'' అన్నాడు శ్రీశుడు.

"దానివల్ల మనస్సుకు మరింత తృప్తికలిగింది. కనుక ఇవాళ సభాకార్యక్రమాన్ని ఇంతటితో ముగిద్దాం. ఇప్ప టికే చాలా ఆలస్యమయింది, అదీగాక ఇంత తిన్నతరువాత మరేమీ ఆలోచించలేము, చర్చించలేము'' అని అన్నాడు విపినుడు.

# 6

**అ**క్షయకుమార్ ఇంటిలో అక్షయకుమార్, నీర బాల, నృపబాల ఉంటారు. ఆ సమయంలో నీరబాల ఈ క్రింది పాట పాడుతుంది—

వెళ్ళినవారెవరో వెళ్ళనివ్వు,
నువ్వు వెళ్ళవద్దు, వెళ్ళవద్దు.

నా మనో ఆకాశంలో
విహరించే మేఘాలు
నిన్ను వెళ్ళవద్దని పాటపాడాయి !!
ప్రతి కుటీరద్వారము మూసిఉంది,
కటికచీకటి, గాఢాంధకారము ;
కొసరి కొసరి వీచే గాలులతో
తరుచేలాంచలములు కంపించాయి,
ఇలాంటి సమయంలో
నన్ను వదలి వెళ్ళవద్దు, వెళ్ళవద్దు !

"ఇంతకూ జరిగిందేమిటో చెప్పరాదూ ! ఇంతకు ముందు నా గది పనిమనిషి ఊడ్చివెళితే శుభ్రంగాఉండేది, ఇప్పుడు రెండుపూటలా మీ అక్కచెల్లెండ్ర చేలాంచలముల విసురుకు దుమ్ము లేస్తూఉంది" అని అన్నాడు అజయబాబు.

"మా అక్కగారు లేదుగదా, ఒంటరిగా ఉంటున్నావని దయతలచి అప్పుడప్పుడు వచ్చి చూచివెళుతున్నందుకు మామీద ఇదొక నేరారోపణా?" అని అడిగింది నీరబాల.

"ఓ దయామయురాలగు దొంగా ! నా శూన్య హృదయమును దొంగిలించుటకు నిర్మానుష్యమగు ఇంటిలోనికి ఎందుకిలా తొంగితొంగి చూస్తావు? నీ ఉద్దేశ్యమేమిటో తెలుసుకోలేకపోతున్నాను"అని అజయకుమార్ అదే భావాన్ని వ్యక్తంచేస్తూ ఒక పాట పాడతాడు.

అందుకు నీరబాల వెక్కిరిస్తూ "మేము మీరు అనుకున్నట్లు అంత తెలివిమాలిన దొంగలము కాదు. మేము

దొంగిలించటానికి ఇప్పుడు మీ హృదయం ఎక్కడఉంది?" అని అన్నది.

"నా హృదయం ఎంతదూరం వెళ్ళిఉంటుందో ఒక సారి ఆలోచించి చెప్పు" అన్నాడు అతియబాబు.

"అది నాకు తెలుసు ముఖర్జీమహాశయా! చెప్ప మంటారా? మీ హృదయం ఇప్పుడు 475 మైళ్ళదూరం వెళ్ళింది" అని అన్నది నృపబాల.

"అక్కా, నీమాట మరీ ఆశ్చర్యంగా ఉంది. నువ్వు ముఖర్జీమహాశయుని హృదయంవెనుకనే మైళ్ళు లెక్క పెడుతూ వెళ్ళావా ఏం?" అని అడిగింది నీరబాల.

"అదికాదు పిచ్చితల్లీ, అక్క కాశీకి బయలుదేరి నప్పుడు రైల్వేగైడ్‌లో ఎన్నో మైళ్ళు చూచాను" అని జవాబు చెప్పింది నృపబాల.

అతియబాబు తన విరహావస్థనుగురించి ఒక చిన్న పాట పాడతాడు.

అతని పాటవిని నీరబాల "కవివర్యా, అద్భుతం, అత్యద్భుతం! కానీ మీ రచనలో కొందరి ఆధునిక కవుల ఛాయలు కనిపిస్తున్నాయి" అని అంది.

అందుకు అతియకుమార్ ఇలా జవాబు చెప్పాడు- "నేను అత్యంత ఆధునికుడనవటమే అందుకు ముఖ్య కారణం. ఈ ముఖర్జీమహాశయుడంటే ప్రకృతివాసతీర్థులకో కవలసోదరుడని మీరు అనుకొంటున్నారా? భూగోళంలోని మైళ్ళు చెప్పావు, చరిత్రలోని తారీఖులు మర్చిపోయావా? అలాంటప్పుడు మా మరదలు చదువుకున్నందువల్ల ప్రయో

జనమేమీలేదు. ఇంత గొప్ప ఆధునికుణ్ణి మీరు ప్రాచీనుడని భ్రమపడుతున్నారంటే అర్థం ఏమిటి?"

"ముఖర్జీమహాశయా, పూర్వకాలంలో శివుడు వివాహమండపములోనికి వెళ్ళినప్పుడు వారి మరదళ్ళుకూడా ఇలాంటి పొరపాటునే చేశారు, కానీ ఉమ దృష్టిమాత్రం వేరు. అలాగే, మీరేమీ విచారించవద్దు. మా అక్కగారు మాత్రం మిమ్మల్ని అత్యంతఆధునికులనే భావిస్తుందిగదా!" అని అంది నీరబాల.

"అలనాడు శివునికి మరదళ్ళేగనుక ఉంటే వారి తపస్సుకు భంగంకలిగించటానికి మన్మధుడురావలసినఅవసరమే ఉండేదికాదు. నన్ను వారితో పోలుస్తున్నారా?" అని అన్నాడు అక్షయబాబు.

"ముఖర్జీమహాశయా, ఇప్పుడవన్నీ ఎందుకుగానీ మీరు ఇక్కడ కూర్చొని చేస్తున్నదేమిటి?" అని అడిగింది నృపబాల.

"మీ గొల్లదాని పాలపద్దు వ్రాస్తున్నాను" అని జవాబు చెప్పాడు అక్షయబాబు.

వెంటనే నృపబాల బల్లమీద అసంపూర్తిగా ఉన్న ఉత్తరాన్ని తటాలున అందుకొని "గొల్లదాని పాలపద్దు ఇదేనా? పద్దులో పాలు నీళ్ళఅంశమే ఎక్కువగా ఉంది" అని అంది.

అక్షయకుమార్ కంగారుపడుతూ "అరెరే, ఆ ఉత్తరాన్ని తీసుకొని గోలచేయకండి, ఇలా ఇవ్వండి" అని అన్నాడు.

"నీరూ, ఉత్తరాన్ని కాల్చేయకు. వారి ఉత్తరాన్ని వారికే ఇవ్వు, ఈ విషయంలో మరదళ్ళ దుండగాలు వారు సహించలేరు. అది సరేకాని ముఖర్జీమహాశయా, మీరు ఉత్తరంలో మా అక్కగారిని ఎలా సంబోధించారో చెప్పండి చాలు" అని అంది నృపబాల.

"నిత్యము నూతనంగా సంబోధిస్తూవుంటాను" అని అన్నాడు అజయకుమార్.

"ఇవాళ ఎలా సంబోధించానో చెపితే చాలు" అని అంది నృపబాల.

"వింటావా? అయితే సఖీ విను, 'చంచలచకిత చిత్త చకోర చోరచంచుచుంబిత చారుచంద్రిక రుచిరచిర చిర చంద్రమా అని సంబోధించాను" అన్నాడు అజయ బాబు.

"చమత్కార చాటు చాతుర్యము" అని అంది నీరబాల.

"ఇందులో చౌర్యవృత్తిలేదు, ఇది చర్విత చరణ శూన్యము" అని అన్నాడు అజయకుమార్.

నృపబాల ఆశ్చర్యపడుతూ "అదిసరే ముఖర్జీమహాశయా, ప్రతిరోజు మీరు ఇలాగే దీర్ఘమైన సంబోధనలు రచిస్తూ ఉంటారా? అందుకనే అక్కగారికి ఉత్తరం వ్రాయటానికి ఇంత ఆలస్యమవుతూ ఉంటుంది" అని అన్నది.

"అందుకనే నృపబాలముందు నా అబద్ధాలేమీ సాగటం లేదు. అప్పటికప్పుడు అతుకునట్లు కల్పించి చెప్ప గల అసాధారణ శక్తిని ఆ భగవంతుడు నాకు ప్రసాదిం

చాడు. కానీ నీముందు అలాంటిదేమీ కుదరటంలేదు. బావగారు చెప్పినదే వేదవాక్యమని భావించి విశ్వసించాలని ఏ మనస్మృతిలో వ్రాశారో చెప్పు" అని అన్నాడు అక్షయబాబు.

అందుకు నీరబాల ఇలా అంది — "శాంతించండి ముఖర్జీ మహాశయా, కోపగించుకోకండి. చిన్నక్క సంగతి అలావదలివేయండి, మీ మాటలలో ఆవగింజలో అర వయ్యోవంతుకూడా నేను నమ్మను, అప్పటికీ మీకు ధైర్యం కుదరటం లేదా ?"

"ముఖర్జీమహాశయా, ఒక సంగతి అడుగుతాను నిజం చెప్పండి, మా అక్కనుగురించి మీరెప్పుడైనా పాట వ్రాశారా?" అని అడిగింది నృపబాల.

"ఒకసారి ఆమె చాలా ఆగ్రహంలో ఉన్నప్పుడు ఆమెను స్తుతిస్తూ ఒక గేయంవ్రాసి చదివాను" అని చెప్పాడు అక్షయకుమార్.

"తరువాత?" అని ప్రశ్నించింది నృపబాల.

"తరువాత ఏముంది, నేననుకున్నదానికి ఫలితం వ్యతిరేకంగా జరిగింది. అగ్నికి వాయువు తోడైనట్లు మరింత ప్రజ్వరిల్లింది — ఆనాటినుంచి స్తుతిరచన మానేశాను" అన్నాడు అక్షయకుమార్.

"ఆనాటినుంచి స్తుతిరచన మానేసి పాలవాళ్ళపద్దులు వ్రాయసాగారన్నమాట? మీరు రచించిన ఆ స్తుతిగేయం విన్పిస్తారా ముఖర్జీమహాశయా?" అని అడిగింది నృపబాల.

"ధైర్యం చాలటం లేదు. తరువాత నా పైవాళ్ళకు రిపోర్టు చేస్తావు" అన్నాడు అక్షయకుమార్.

"లేదులేదు, మేము అక్కతో చెప్పము" అని అభయమిచ్చింది స్వప్నబాల.

"అయితే వినండి" అని అక్షయకుమార్ పాట స్తుతి గీతం అందుకున్నాడు.

మనోమందిర సుందరీ
స్ఖలదంచలా చలచంచలా
అయి మంజులా మంజరీ!
రోషారుణ రాగరంజితా!
గోవన హాస్య కుటిల—ఆస్య
కపట కల హాగంజితా
సంకోచనత—అంగినీ!
చకిత చపల నవకురంగ—
యే వనవన రంగిణీ—
అయి, ఖలఖల గుంఠితా!
లుబ్ధ పవన్ క్షుబ్ధలోభన్
మల్లికా అవలుంఠితా!
చుంబన్ ధన్ వంచినీ!
రుద్ధ కోరిక— సంచిత మధు
కఠినకనక్ కంచినీ!

"ఇకవద్దు. ఇంతటితో కవిసమ్మేళనమును ముగిద్దాం" అని అక్షయకుమార్ పాట ఆపాడు.

"ఏం, ఇంత అవమానం ఎందుకు? అక్కగారిచీవాట్లు

తిన్న విసుగును ఇప్పుడు మామీద చూపించాలనుకొంటు న్నారా?" అని అడిగింది నీరబాల.

"అయ్యయ్యో, మీరు ఆఘోషా మర్యాదనుకూడా మంటగలిపేటట్లున్నారు. ఛీ! అందరూ ఇక్కడికే వస్తారు" అన్నాడు అక్షయకుమార్ వాళ్ళను వదలించుకోవాలనే అభిప్రాయంతో.

"దీనికంటె తమరు ఉత్తరం వ్రాసుకోవాలి గనుక మమ్మల్ని వెళ్ళిపొమ్మనే చెప్పరాదా?" అని అంది నృపబాల.

"అలా అయితే మేము ఇక్కడ ఉండగానే మీ ఉత్తరాన్ని పూర్తిచేయరాదూ? మీ కలంతో మేము మాట్లాడము" అని అంది నీరబాల.

"మీరు ఇక్కడే ఉంటే నా మనస్సుకూడా ఇక్కడే పడిచస్తుంది. దూరానఉన్న మీ అక్కవరకు వెళ్ళటంలేదు. నేను ఎగతాళిగా అనటంలేదు, మీ రిక్కడినుంచి వెళ్ళండి. ఇక్కడికి మరికొందరు రానున్నారు — ఆ పుస్తకం ఒక పేజీ తెరిచినా ఇక మీకిక్కడినుంచి పారిపోయేఅవకాశంకూడా ఉండదు" అన్నాడు అక్షయ్.

"ఇలాంటి సాయంత్రంవేళ మీవద్దకువచ్చే దెవరు?" అని అడిగింది నృపబాల.

"మీరు మదిలో తలచుకునే వారెవరూ రారు, అలాంటి వారెవరూ రారు" అన్నాడు అక్షయబాబు.

"తలచుకునేవారు ఎప్పుడు కావాలంటే అప్పుడు రారు ముఖర్జీమహాశయా! ప్రస్తుతం ఈ విషయం మీకు

కూడా అర్థమయ్యే ఉంటుంది. దేవతను తలచుకొంటు న్నారు. ఉపదేవతలువచ్చి అల్లరిచేస్తున్నారు. ఇప్పుడు అదే గదా జరిగింది" అని నీరబాల చిన్నగేయం పాడింది—

నా మదిలో మెదిలే ధనమా!
నవ్వు, ఆక్రందన హృదయంలో
మేల్కొల్పేది నువ్వే!
మధుర వసంతం వచ్చింది
పొగడపూలు వికసించాయి,
పూపొదరిండ్లలో చంద్రుడు నవ్వేను;
నక్షత్రాలు నీకోసనే వెతుకుతున్నాయి,
ప్రాణాలలో దాగిన రహస్య స్వప్నం వలె
వాటికి నువ్వు కన్పించనే లేదు!

నీరబాల పాటఆపగానే "ఇదెక్కడనేర్చుకున్నావు?" అని అడిగాడు అక్షయబాబు.

"తను శ్రీముఖంనుంచే" అని జవాబు చెప్పింది నీరబాల.

"అయితే చివరికి నేను విరహబాధను అనుభవిస్తు న్నప్పుడే ఇవన్నీ వినిపించి నా హృదయాన్నే దహించి వేయచూస్తున్నావన్నమాట? ఇంతవరకు వచ్చినతరువాత ఇంకా ఆపటం ఎందుకు? పూర్తిగానే వినిపించు" అన్నాడు అక్షయబాబు.

నీరబాల మళ్ళీపాట ప్రారంభిస్తుంది—

కళ్ళలో ఆ ప్రవాహం ఏమిటి—
దానిలో ప్రేమాశ్రువులు నింపు.

మధుర పరిమళమైతే వస్తుంది,
పూలమాల లెక్కడా కనిపించవు.
నిర్మానుష్యంగా ఉన్న మార్గంలో
ఎక్కడో అడుగుల చప్పుడు వినబడుతుంది.
పగలు గడచి పోతుంది,
పూలువాడి పోతున్నాయి,
నా ప్రపంచం శూన్యమయింది!

"అబలాకాంతబాబుగా రున్నారా?" అంటూ బయటినుంచి ఎవరో అడిగారు. మరునిముషంలో శ్రీశుడు అక్కడికి వచ్చి "క్షమించండి" అంటూ వెనుతిరిగి వెళ్ళిపో బోతాడు. అతనిని చూడగానే నృపబాల, నీరబాల గబగబ లోనికి పారిపోతారు.

"రండి, రండి శ్రీశబాబూ"అంటూ అక్షయకుమార్ అతనిని ఆహ్వానించాడు.

శ్రీశుడు సిగ్గుపడుతూ "క్షమించండి" అని అన్నాడు.

"క్షమించటానికేముంది, ఇంతకూ మీవల్ల జరిగిన అపరాధం ఏమిటో చెపితే అలాగే క్షమించవచ్చును" అని అన్నాడు అక్షయబాబు.

"మీ అనుమతి పొందకుండా లోనికి..." అంటూ నసిగాడు శ్రీశుడు.

"మీరుఅనుమతికోసము మునిసిపాలిటీనుంచి బడ్జెటు (బజెట) శాంక్షను చేయించుకొనేవరకు మీరిలాగే అనుమతి లేకుం

డానే వస్తూవుండండి శ్రీశబాబూ" అని అన్నాడు అజయ కుమార్.

"ఇక్కడికి నేను అలాంటిసమయంలో రావటం అనధికార ప్రవేశం కాదని మీరు అంటున్నప్పుడు అలాగే కానివ్వండి" అన్నాడు.

"అదేగదా నేనూ అనేది. మీరు ఏ సమయంలో వచ్చినా ఎక్కడికి వచ్చినా ఎలాంటి ఆటంకమూ ఉండదు. ఎల్లప్పుడు మీకు సుస్వాగతమే. శ్రీశబాబూ, ఎక్కడికి వెళ్ళటానికైనాసరే ఆ బ్రహ్మదేవుడే మీకు పాస్ పోర్టుఇచ్చినప్పుడు మరొకరి అభ్యంతరమేముంటుంది? అబలాకాంతబాబును పిలిపించమంటారా?"అని అజయబాబు లేచాడు. తానుకూడా అక్కడేకూర్చుంటే తన ఉత్తరం ఇక పూర్తి కాదనికూడా అతని అభిప్రాయం. అందుకని అతడు లోనికి వెళ్ళిపోతాడు.

"కళ్ళముందునుంచి రెండు బంగారు మాయలేళ్ళు తప్పించుకొని పారిపోయాయి. ఓయీ అస్త్రశస్త్రములులేని వేటగాడా! నీలో వాటివెనుక పరుగెత్తే సామర్థ్యముకూడా లేదు. గీటురాయిమీద బంగారుగుర్తువలె ఆ చకితనేత్రాల సుందరరూపము దృష్టిపథంలో హత్తుకుపోయింది" అని శ్రీశుడు తనలోతాను అనుకోసాగాడు.

...

ఇంతలో అతని ఆలోచనలకు అంతరాయం కల్గిస్తూ రసికదాదా అక్కడికి వచ్చాడు.

అతనిని చూడగానే శ్రీశుడు "రసికదాదా,

సాయంత్రసమయానవచ్చి నేను మీకేమీ ఇబ్బంది కల్గించలేదుగదా?" అని అడిగాడు.

"భిక్షుకుని వినిక్షిప్తః కిమిక్షుర్నీరసో భవేత్? శ్రీశబాబూ, మీరు వచ్చినందువల్ల మాకు ఇబ్బంది ఏమున్నది? నేను అంత నిర్భాగ్యుడనా?" అని అన్నాడు శ్రీరసికచక్రవర్తి.

"అబలాకాంతబాబుగారు లోపల ఉన్నారా?" అని అడిగాడు శ్రీశుడు.

"ఉన్నారు, పిలిపించమంటారా ?" అన్నాడు రసికదాదా.

"వద్దువద్దు, వారేదైనా పనిచేసుకొంటూఉంటే అవసరంలేదు—నేనేమీ పనిపాటలేని మనిషిని, మరొక నిరుద్యోగి ఎవరైనా తోడు దొరుకుతారేమోనని బయలుదేరాను" అని అన్నాడు శ్రీశుడు.

దానినిగురించి రసికదాదా ఇలా చెప్పాడు—"ప్రపంచంలోని జనులందరూ పనిపాటలేనివాళ్ళే, అలాంటివాళ్ళే ధన్యులు. వాళ్ళిద్దరి కలయికయే మణికాంచనముల సంయోగంవంటిది. సాయంకాలసమయాలు సృష్టించబడింది అలాంటివాళ్ళకోసమే. యోగులకు ప్రాతఃకాలము, రోగులకు రాత్రిసమయము, పనిచేసుకొనేవాళ్ళకు ఉదయం పదినుంచి నాలుగువరకుగల సమయము సృష్టించబడ్డాయి. నిజంచెప్పాలంటే సాయంకాలసమయాన్ని బ్రహ్మచారిసంఘుసమావేశము జరుపుకొనుటకు మాత్రము ఆ బ్రహ్మ

దేవుడు సృష్టించలేదని గట్టిగా చెప్పగలను. మీ రేమం టారు శ్రీశబాబూ?"

"సాయంకాల సమయమనేది మన బ్రహ్మచారి సంఘంకంటే పూర్వమే సృష్టించబడిందనే విషయము అంగీకరించక తప్పదు. అది మన సంఘాధ్యక్షుడు చంద్రబాబుగారు సృష్టించిన నియమాలను పాటించదు" అని అన్నాడు శ్రీశుడు.

అందుకు రసికదాదా ఇలా అన్నాడు—"అదికూడా మరొక చంద్రుని నియమాన్నే పాటిస్తూ ఉంటుంది, అయితే ఆ నియమమే వేరు. శ్రీశబాబూ, మీతో ఒక విషయాన్ని గురించి యదార్థం చెపుతున్నాను, అది విని మీరు నవ్వవద్దు. నేను నా గదిలో మంచంమీద పడుకొని ఉన్నప్పుడు ఆ గది కిటికీలోనుంచి ఒక సన్నని వెన్నెలకిరణము లోనికి ప్రవేశిస్తూ ఉంటుంది—శుక్లపక్షపు సంధ్యవేళ నిర్మలమగు ఆ వెన్నెలకిరణము లోనికిప్రవేశించి నావక్షస్థలముమీద దొర్లాడినప్పుడు ఎవరో నాకు సందేశము పంపినట్లుగా ఉంటుంది. ఏ విరహిణివద్దనుండో చిరవిరహము ననుభవించు నావద్దకు తెల్లని హంస సందేశము తెచ్చి చెవిలో గుసగుస విన్పించినట్లుండేది—

అలిందే కాళిందీకమలసురభౌ కుంజవసతే-
వసంతీం వాసంతీనవ మరిమళోంగార చికురాం
త్వదుత్సంగే లీనాం మదముకుళితాక్షీ పునరిమాం
కదాహం సేవిష్యే కిసలయకలాప వ్యజనినీమ్.

అది విని శ్రీశుడు రసికదాదాను ఎంతో మెచ్చు

కొంటూ ఇలా అన్నాడు— "అద్భుతం, అద్భుతం, రసిక బాబూ మహాచమత్కారంగా ఉంది సుమా! కానీ దీనికి అర్థంకూడా మీరే చెప్పాలి, ఛందస్సుద్వారా దానిలోని మాధుర్యము తెలుస్తుందేకాని అనుస్వారములు, విసర్గలు అర్థాన్ని తెలియకుండా తమచాటున దాచివేశాయి."

"దీనిని తెలుగులోనికి అనువాదంకూడా చేశాను, పత్రికా సంపాదకులు మాకు కావాలి మాకు కావాలి అని ఎక్కడ ఎగబడతారోననే భయంవల్ల దాని నింతవరకు బయటపెట్టకుండా దాచిఉంచాను — వింటారా శ్రీశ బాబూ?" అని రసికచక్రవర్తి అతని జవాబుకు ఎదురు చూడకుండానే చదివి విన్పించాడు.

"అద్భుతంగా ఉంది రసికబాబూ, మీలో ఇంత గొప్పతనం ఉన్నదని నే నింతవరకు తెలుసుకోలేక పోయాను" అని అన్నాడు శ్రీశుడు.

"ఎలా తెలుసుకోగలుగుతారు మీరే చెప్పండి. కావ్యలక్ష్మి తన కమలవనమునుదాటి మధ్యమధ్య వాయు సేవనకై ఈ మోదుగచెట్టు మీదికి వస్తూవుంటుంది. ఈ విషయాన్ని మరొకరు ఎలా అర్థం చేసుకోగలుగుతారు. ఇలాంటి ప్రదేశం మరెక్కడా ఉండదు" అని రసికచక్రవర్తి చేతితో పైకి చూపిస్తాడు.

"ఆహా రసికబాబూ, యమునాతీరాన తళతళలాడు ఆకుగుమీద వ్యాపించిన కుంజకుటీరము నా మనస్సుకు చాలా నచ్చింది. 'పయనీర్' పత్రికలో దానిని అమ్మితా

మని ప్రకటించటం జరిగితే నేను తప్పకుండా కొనుక్కుంటాను" అన్నాడు శ్రీశుడు.

"అదేమిటి శ్రీశబాబూ! అరుగు ఉన్నంతమాత్రాన ఏమవుతుంది. 'మందముకుళితాశ్రీ' సంగతి ఆలోచించండి. అది ఏ వేలంపాటలోనో దొరకటం దుర్లభముకదా!" అన్నాడు రసికదాదా.

"ఇక్కడపడివున్న ఈ జేబురుమాలు ఎవరిది?" అంటూ శ్రీశుడు క్రిందనున్న ఒక జేబురుమాలును అందుకుంటాడు.

"ఏదీ చూద్దాం, ఇలా ఇవ్వండి" అంటూ రసికచక్రవర్తి ఆ రుమాలును తీసుకొని చూస్తూ అతనితో ఇలా అన్నాడు— "నిజంగా మీకు దుర్లభమగు వస్తువు లభించింది. ఛందస్సుకు భంగం కలిగినప్పటికీ మన శ్లోకంలో ఒక పంక్తిని 'వాసంతీనవ పరిమళోద్గార రూమాలాం' అని మార్చాలి. శ్రీశబాబూ, ఈ రుమాలు మన బ్రహ్మచారి సంఘు పతాకముగా ఉపయోగపడదు. దీనిమీద ఒక మూలగా 'న' అనే అక్షరము ఉన్నది చూచారా?"

"అది ఏ పేరు కావచ్చునో చెప్పండి చూద్దాం. నళిని కావచ్చునా? కాదు, అది వాడుకలో ఉన్న పేరేకదా! నీలాంబుజ అవుతుందా? ఇది కొంచెం భయంకరంగా కూడా ఉన్నది. 'నీహారిక' కావచ్చునా? ఇది చాలా పెద్ద పేరు. రసికబాబూ, మీరేమి ఆలోచిస్తున్నారో చెప్పండి" అని అన్నాడు శ్రీశుడు.

అందుకు రసికచక్రవర్తి ఇలా అన్నాడు—"నా మన

స్సులో ఏవేవో భావాలు మెదులుతున్నాయే కాని పేరు మాత్రం గుర్తురావటంలేదు. డిక్షనరీలోఉన్న 'న' లు అన్నీ మనస్సులో ప్రోగుపడుతున్నాయి. 'న' లతో ఒక మాల కట్టి ఏ నీలోత్పలనయనములుగల సుందరి మెడలోనో వేయాలని కోర్కె కలుగుతూవుంది. నిర్మల నవనీనిందిత—తరువాత ఎలా పూర్తిచేయాలో మీరుకూడా చెప్పండి శ్రీశబాబూ!"

"నవమల్లిక అని కూడా చేర్చండి" అన్నాడు శ్రీశుడు.

"అద్భుతం—నిర్మల నవనీనిందిత నవీన నవమల్లిక. గీతగోవిందం దీనిముందెందుకూ పనికిరాదు. ఇంకా అనేక రకముల మంచిమంచి 'న' లు బుర్రలో హాహాకారములు చేస్తూ తిరుగుతున్నాయి. వాటిని వరుసగా కలపలేకపోతున్నాను—నిభృత నికుంజనిలయ, నిపుణ నూపురనిక్వణా, నివిడనీరద నిమూర్త—అతియబాబుఉంటే ఆలోచించవలసిన అవసరమే ఉండదు. మాస్టరుగారిని చూడగానే పిల్లలు క్లాసులలోనికి వెళ్ళి వరుసగా కూర్చున్నట్లే అతియబాబు అలికిడి తగిలితే చాలు మాటలన్నీ వాటంతటవే పరుగెత్తుకొని వచ్చి వరుసగా నిలబడతాయి. శ్రీశబాబూ, ఈ ముసలివానికళ్ళుకప్పి జేబురుమాలును జేబులో దాచుకోవద్దు" అని అన్నాడు రసికదాదా.

"అసలు దీనిమీద దీనిని కనుగొన్నవారికే అధికారం ఉంటుందిగదా!" అన్నాడు శ్రీశుడు.

"నాకు ఆ రుమాలుతో ఒకపనిఉంది శ్రీశబాబూ!

మీకు ఇంతకుముందు చెప్పానుగదా, నా గది కిటికీలో నుంచి చంద్రకిరణముయొక్క వెలుగు నా గదిలోకి ప్రవేశిస్తుంది—నాకు ఒక శ్లోకం గుర్తొస్తూవుంది" అని రసిక చక్రవర్తి ఆ శ్లోకాన్ని చదివాడు—

బీథీషు బీథీషు విలాసినీనాం
ముఖాని సంరీక్ష్య శుచిస్మితాని
జాలేషు జాలేషు కరం ప్రసార్య
లావణ్యభిక్షామటతీవ చంద్రః
సందుసందునా లలనల ముఖాలలో
దరహాస చంద్రికలు చూచి
ప్రతి కిటికీచెంత చేయిచాచి
శశి దానిని యాచించుచుండె.

రసికచక్రవర్తి ఆ శ్లోకానికి తెలుగు అనువాదాన్ని కూడా విన్పించి తిరిగి ఇలా అన్నాడు—"శ్రీశబాబూ, భాగ్యహీనుడగు ఆ భిక్షుకుడు నా కిటికీచెంతకువచ్చి యాచించినప్పుడు అతనికి నేనేమివ్వగలనో మీరే చెప్పండి. కావ్యగ్రంథములలోని రసవత్తరమగు ఘట్టములేవీ అప్పుడు గుర్తురావు. అదీగాక మాటలతో కడుపునిండుతుందా? అలాంటిసమయంలో ఈ రుమాలు చాలా ఉపయోగపడుతుంది. లావణ్యముతో దీనికి చాలా సంబంధం ఉంది."

"ఆ లావణ్యమును అకస్మాత్తుగా మీరెప్పుడైనా చూచారా రసికబాబూ?" అని అడిగాడు శ్రీశుడు.

"చూడకపోవటం ఏమిటి, లేకపోతే ఈ రుమాలు కోసం ఇంతగా దెబ్బలాడటం ఎందుకు? అదీగాక ఆ 'న'

అక్షరముగల మాటలు నా బుర్రలో ఇప్పటివరకు తుమ్మెదల గుంపువలె ధ్వనిచేస్తూ తిరుగుతున్నాయి; వాటి ఎదుట కమల వనవిహారిణియగు ఒక మానవమూర్తి లేదా!" అని అన్నాడు రసికదాదా.

"రసికబాబూ, తమబుర్ర ఒక ప్రత్యేకతగల తేనెటీగల తుట్టెవంటిది, దాని ప్రతిరంధ్రములోనూ కవిత్వమనే తేనె ఉంది, అది నన్ను పూర్తిగా మైమరపించేటట్లుంది" అని శ్రీశుడు దీర్ఘంగా నిట్టూర్చాడు.

ఆ దేసమయంలో పురుషవేషధారిణియగు శైలబాల అక్కడికి వచ్చింది. ఆమె గదిలోనికి రాగానే శ్రీశునికి నమస్కరిస్తూ "శ్రీశబాబూ, నేను రావటం ఆలస్యమైనందుకు క్షమించండి" అని అంది.

"ఇలాంటి సాయంత్రసమయాన వచ్చి మీకు ఇబ్బంది కలిగించినందుకు మీరుకూడా నన్ను క్షమించాలి అబలాకాంతబాబూ!" అన్నాడు శ్రీశుడు.

"ప్రతిరోజు ఇలా సాయంత్రసమయాన వచ్చి ఇబ్బంది కలిగిస్తేనే క్షమిస్తాను, లేనిచో క్షమించటానికి వీల్లేదు" అని అంది శైలబాల.

"అయితే అంగీకరిస్తున్నాను, తరువాత ఇదెక్కడి చిక్కు వచ్చిపడిందిరా అని పశ్చాత్తాపము కలిగినప్పుడు ఈమాటను గుర్తుకు తెచ్చుకోండి" అన్నాడు శ్రీశబాబు.

"నా విషయంలో అలాంటిదేమీ జరుగదు, దానిని గురించి మీరు ఆలోచించనవసరంకూడా లేదు. మీకే

అలాంటి ఇబ్బందికలిగినప్పుడు నాతో చెప్పండి, వదలి వేస్తాను" అంది శైలబాల.

"మీరు జీవితాంతం ఎదురుచూచినా అలాంటిది జరుగదు" అన్నాడు శ్రీశుడు.

"రసికదాదా, అదేంపని? మీరు శ్రీశబాబు జేబువైపు చెయ్యిపోనిస్తున్నా రెందుకు? ఈ ముసలితనంలో జేబులు కత్తిరించేవృత్తిని స్వీకరించారా ఏం?" అని అడిగింది శైలబాల.

"అలాంటిదేమీ లేదు బాబూ. ఆ వృత్తి మీ వయస్సులో ఉన్నవాళ్ళకే చెల్లుతుంది. ఒక జేబురుమాలు విషయంలో శ్రీశబాబుకు నాకు చర్చ జరుగుతుంది, దానిని గురించి నీ అభిప్రాయంకూడా చెప్పాలి" అన్నాడు రసికదాదా.

"ఏమిటది?" అని అడిగింది శైలబాల.

అందుకు రసికదాదా ఇలా చెప్పసాగాడు—"ప్రేమ వ్యవహారంలో వ్యాపారముచేయుటకు తగిన మూలధనము నావద్ద లేదు—నేనే రుమాళ్ళ వ్యాపారిని—రుమాళ్లు, రిబ్బనులు, నాలుగైదు అక్షరాలున్న చినిగిపోయిన కాగితం ముక్కలు—వీటితోనే నేను సంతృప్తి పడాల్సివస్తుంది. ఇలాంటి ప్రేమసామాగ్రినంతా టోకుగా కొనగల మూలధనము శ్రీశబాబువద్ద ఉంది—వారు రుమాళ్ళనేకాదు, నీలాంచలంలో సగభాగాన్నికూడా ఆక్రమించుకొని కూర్చొనగలరు; వారు అక్కడ తిష్ఠవేసి చీలమండలవరకు

వ్రేలాడు కేశరాశినుంచి వెలువడే పరిమళాంధకారంలో పూర్తిగా మైమరచి పోగలడు."

అందుకు ఇలా అన్నాడు—"అబలాకాంత బాబూ, మీరు ఏమీ ఆపేక్షించని వ్యక్తులు. మాకు మధ్యవర్తిగా ఉన్నారుగనుక రుమాలును ప్రస్తుతానికి మీవద్దనేఉంచండి. నేమిద్దరము చెప్పేదివిని ఆలోచించి న్యాయంగా ఆ రుమా లెవరికి చెందాలో వారికే ఇవ్వండి."

శైలబాల రుమాలును అందుకొని తన జేబులో దాచి శ్రీశునితో ఇలా అంది—"మీరు నాకేమీ ఆపేక్ష లేదని అనుకున్నారా? రుమాలు మూల ఎఱ్ఱదారంతో 'న' అనే అక్షరము కుట్టివుంది. మీరు నా హృదయంలో పరిశోధించి చూచినట్లయితే అది రక్తముతో వ్రాయబడిన అక్షరమని గ్రహించగలుగుతారు. ఈ రుమాలును నేను మీలో ఎవ రికీ ఇవ్వను."

"రసికబాబూ, ఇదెక్కడి దౌర్జన్యం? ఈ'న'అక్షరం కూడా చాలా భయంకర అక్షరంవలె ఉన్నది సుమా!" అన్నాడు శ్రీశుడు.

"విదేశీశాస్త్రములలో న్యాయమనేదికూడా గుడ్డిదే నని విన్నాను. ప్రేమకూడా గుడ్డిదే, కనుక ఇప్పుడుగుడ్డివా ళ్ళిద్దరికీ యుద్ధంజరుగుతుంది, ఎవరిలో ఎక్కువ బలం ఉంటే వాళ్లు జయిస్తారు" అని అన్నాడు రసికదాదా.

"శ్రీశబాబూ, ఈ రుమాలు ఎవరిదో మీరు ఆవ్యక్తిని చూడలేదుగదా! అలాంటప్పుడు ఏదో వూహించుకొని తగాదాపడతా రెందుకు?" అని అడిగింది శైలబాల.

"ఆ వ్యక్తిని చూడలేదని మీతో ఎవరు చెప్పారు?" అని అడిగాడు శ్రీశుడు.

"చూచారు, ఎవర్ని చూచారు? 'న'లు ఇద్దరు" అని అన్నది శైలబాల.

"ఇద్దరినీ చూచాను—ఈ రుమాలు ఇద్దరిలో ఎవరిదైనా కావచ్చు, దీనిమీద నాకున్న హక్కును వదులుకునేది లేదు" అని అన్నాడు శ్రీశుడు.

"శ్రీశబాబూ, ఈ వృద్ధుని సలహా కూడా విని తరువాత మాట్లాడండి. మీ హృదయాకాశంలో రెండు చంద్ర బింబాలను సృష్టించుకోవద్దు; ఏకశ్చంద్ర స్తమోహంతి" అని అన్నాడు రసికదాదా.

ఇంతలో బయటనుంచి నౌకరు ప్రవేశించి శ్రీశబాబుతో "బాబూ, చంద్రబాబుగారి ఉత్తరం తీసుకొని ఒకరు మీ ఇంటికి వెళ్ళి, మీరు ఇక్కడ వున్నారని తెలిసి ఇక్కడికి వచ్చారు" అని చెప్పాడు.

శ్రీశుడు ఉత్తరమును అందుకొని చదివి లేచి నిలబడుతూ "చంద్రబాబుగారి ఇల్లు ఇక్కడికి దగ్గరేకదా— వారిని కలుసుకొని వెంటనే తిరిగివస్తాను" అని అన్నాడు.

"అటునుంచి అటే పారిపోతారేమో" అని అడిగింది శైలబాల.

"అలాంటిదేమీ జరుగదు, నా రుమాలు మీవద్దనే ఉందిగదా! ఆ విషయంలో ఏదోఒకటి తేల్చుకున్నతరువాతనే వెళతాను" అని చెప్పి శ్రీశుడు నౌకరువెంట బయటకు వెళ్ళిపోయాడు.

అప్పుడు రసికదాదా శైలబాలతో "శైలా, బ్రహ్మచారి సంఘంలోని బ్రహ్మచారులు మనం అనుకున్నంత భయంకరమైనవాళ్లు కాదు. వీరి బ్రహ్మచర్యవ్రతానికి భంగం కల్గించటానికి మేనక, రంభ, మన్మథుడు, వసంతము మొదలగునవేవీ అవసరంలేదు, ఆ పని ఈ వృద్ధరసిక చక్రవర్తి చేయగలడు" అని అన్నాడు.

"అది కన్పిస్తూనేఉందికదా!" అని అంది శైలబాల.

మళ్ళీ రసకదాదా ఇలా చెప్పసాగాడు – "అసలు విషయం ఏమిటో నీకు తెలుసునా ? డార్జిలింగులో ఉండేవాళ్లు మలేరియా ఉన్న ప్రాంతాలకు రాగానే రోగగ్రస్తులవుతారు. ఈ బ్రహ్మచారులందరూ ఇంతవరకు చంద్రబాబుగారి ఇంటివద్ద ఆరోగ్యకరమైన వాతావరణంలో ఉన్నారు, ఇప్పుడు రోగబీజాలతో నిండియున్న ఈ భవనంలోకి కాలుపెట్టారు. ఇక్కడఉన్న వస్తువులలో రుమాలు, పుస్తకాలు, బల్ల, కుర్చీ మొదలగువాటిని దేనిని తాకినా అక్కడినుండే రోగక్రిములు నోటిగుండా నాసికములద్వారా లోనికి ప్రవేశిస్తాయి – అయ్యో, శ్రీశబాబుకూడా వెళ్ళిపోయాడు."

"రసిదాదా, మీరీ రోగక్రిములకు అలవాటు పడిపోయారా ?" అని అడిగింది శైలబాల.

"నాదేముందిలే ! ప్లీహము, పైత్యరోగము మొదలగు రోగాలు ఇంతకుముందే వచ్చిపోయాయి" అని అన్నాడు రసికదాదా.

అదేసమయాన లోనినుంచి నీరబాల ప్రవేశించి

"అక్కా, మేము ప్రక్కగదిలోనే ఉన్నాము" అని చెప్పింది శైలబాలతో.

"పల్లెవాడు వలను లాగలేక సతమతమవుతూఉంటే గ్రద్ద తన్నుకుపోవటానికి ఎదురుచూస్తూ కూర్చొనిఉంది" అన్నాడు రసికదాదా.

అది విని నీరబాల ఇలా అన్నది– "చిన్నక్క రుమాలుతో శ్రీశబాబు ఎంత హడావుడి చేశాడు? చిన్నక్క సిగ్గుపడి పారిపోయింది. నేనొక మూర్ఖురాలను, పొరపాటునైనా ఒకరుమాలు పారవేయలేదు. పన్నెండు జేబురుమాళ్లు తెచ్చాను, ఈసారి అన్నింటినీ గదిలో వదలివెళతాను."

"నీ చేతిలోని ఆ పుస్తకం ఎవరిది?" అని ప్రశ్నించింది శైలబాల.

"నాకు ఇష్టమైనవారిది, వారికి వ్రాసి ఏనిని నేనే ఉంచుకుంటాను" అని అంది నీరబాల.

"చిన్నమ్మాయీ, ప్రస్తుతము నీకు నచ్చుచున్న పారమార్థికమైన పాటలు ఏమిటో ఉదాహరణంగా ఒక పాట విన్పిస్తావా?" అని అడిగాడు రసికదాదా.

అప్పుడు నీరబాల విన్పించిన పాట యిది —

"సూర్యుడు పశ్చిమాద్రిని జేరె
ప్రకృతిని చీకటులావరించె!
ఆవలి ఒడ్డుకు పోవలయు నేను,
నావికుని ఎలుగెత్తి పిలిచి
ఇచ్చి పుచ్చుకొనుట పూర్తికావించి,
తరువాత విలపించవలసివచ్చె!"

"అమ్మాయీ, చాలా వ్యాకులపడుతున్నావు, ఆవలిఒడ్డుకు చేరుకొనుటకు పిలుస్తున్నావు. ఇచ్చి పుచ్చుకోవటంలో కొంచెం జాగ్రత్తగా ఉండు" అని అన్నాడు రసికదాదా.

నీరబాల మళ్ళీ పాట ప్రారంభించింది —

"అంధకారంలో దీపం వెలగటంలేదు,
మాటిమాటికి నువు నన్ను
పిలిచేది ఇందుకేనా ?
సుఖదుఃఖాల నీ మురళి
వ్యాకుల హృదయంలో మ్రోగుతుంది,
దారితప్పిన బాటసారిని
దుఃఖభరిత స్వరంతో
ఆహ్వానిస్తున్నావు!
ఏమేమో ఆలోచిస్తూ
ఆకాశంలోకి చూస్తున్నాను !
క్షణక్షణము ఈ హృదయ భవనంలో
అకారణంగానే ఆశ కలుగుతుంది !"

ఇంతలో బయటినుంచి "అబలాకాంతబాబుగారు ఉన్నారా ?" అని అడుగుతూ విపినుడు లోనికి వచ్చాడు. అతనిని చూచి ఏమి చేయాలో ఏమీ తోచక నీరబాల క్షణకాలం అలాగే నిలబడిపోయింది. మరుక్షణలోనే గబగబ అక్కడినుండి వెళ్ళిపోయింది.

"రండి రండి, విపినబాబూ" అంటూ శైలబాల అతనిని ఆహ్వానించింది.

"నన్ను మీరు హృదయపూర్వకంగానే ఆహ్వానిస్తున్నారా? నా రాకవల్ల మీకేమీ నష్టం కలుగలేదా?" అని అడిగాడు విపినుడు.

"ఇంట్లో కొంతనష్టం కలితేగాని తరువాత లాభం కలుగదు విపినబాబూ— ఇది వ్యాపార నియమం, పోయేదే తిరిగి రెండింతలుగా వస్తుంది, నువ్వేమంటావు అబలాకాంత బాబూ!" అని అన్నాడు రసికదాదా.

"రసికదాదాలోని రసికత్వం ప్రస్తుతము కొద్దిగా గట్టిపడింది" అని అన్నది శైలబాల.

"బెల్లపుపాకము గట్టిపడినట్లేగదా! కానీ, విపిన బాబు ఏమి ఆలోచిస్తున్నారో చెప్పు చూద్దాం!" అని అన్నాడు రసికదాదా.

"ఆలోచించేదేముంది, ఏదో ఒక వంకతో నన్ను సాగనంపితే అది అమర్యాదగానూ ఉండదు, మీకెలాంటి ఇబ్బందీ ఉండదు" అని అన్నాడు విపినుడు.

"మన స్నేహానికి ఇబ్బందేకదా?" అని అంది శైలబాల.

"అప్పుడు ఏదో ఒక వంకతో నన్ను సాగనంప వలసిన అవసరమే ఉండదు" అని అన్నాడు విపినుడు.

"మీరు అలాంటి ఆలోచనలు మాని స్థిమితంగా కూర్చోండి" అని అంది శైలబాల.

తరువాత రసికచక్రవర్తి ఇలా చెప్పసాగాడు — "విపినబాబూ, మీరు సంతోషాన్ని తెచ్చుకోండి, మమ్మల్ని ఈర్ష్యతో చూడకండి. నేను చూడబోతే ముసలి

వాడిని, యువకులు ఈర్ష్యపడవలసినవాడినికాదు. ఇక పోతే సుకుమారమూర్తి యగు మా అబలాకాంతబాబును స్త్రీ లెవరూ పురుషుడనే భావించటంలేదు. మిమ్మల్ని చూడగానే ఎవరైనా అందమైన యువతి లేడివలె పారిపోయినట్లయితే ఆమె మిమ్మల్ని పురుషునిగా భావించి చాలా గౌరవించిందని ఆలోచించి ధైర్యంగా ఉండండి. నిరాశ చెందనవసరం లేదు. ఓయీ దురదృష్టవంతుడా రసికచక్రవర్తీ, నిన్ను చూచి ఒక్క తరుణికూడా సిగ్గుపడి పారిపోవటం లేదు గదా !"

"అబలాకాంతబాబూ, రసికచక్రవర్తిగారు మిమ్మల్ని కూడా తమలో చేర్చుకొంటున్నారు. ఇదేమిటి ?" అని అడిగాడు విపినుడు.

"ఏమిటో విపినబాబూ — అబలాకాంతుడనే నా పేరే మిథ్య - ఒక్క స్త్రీకూడా ఇంతవరకు 'కాంతుడా' అని నన్ను వరించలేదు" అని అంది శైలబాల.

"నిరాశ చెందకండి, ఇంకా కావలసినంత జీవితం ఉంది" అని అన్నాడు విపినుడు.

"అలాంటి ఆశలేగనుక ఉంటే ఈ బ్రహ్మచారి సంఘంలో చేరేవాడినేకాదు" అని అంది శైలబాల.

"అతని మనస్సులో ఏదో తీరని ఆవేదన ఉంది, లేకపోతే ఇంత చిన్నవయస్సులో ఈ అందమైన ముఖంలో ఇలాంటి కాంతి, కోమలత్వము, కరుణభావము ఉండేవే కాదు" అని విపినుడు అబలాకాంతబాబు స్థితినిగురించి ఆలోచిస్తూ ఉంటాడు. ఎదురుగావున్న పుస్తకమును

అందుకొని ఆసక్తితో చూస్తూ "ఈ పుస్తకం ఎవరిది ? పాటలు వ్రాసినట్లున్నాయి. నీరబాలాదేవి!" అని విపినుడు ఆ పుస్తకంమీద ఉన్న పేరును మనస్సులోనే చదువుకున్నాడు. తరువాత అతడు దానిలోని పాటలను చదవసాగాడు.

అది చూచి శైలబాల "విపినబాబూ, ఏమిటి చదువుతున్నారు ?" అని అడిగింది.

అందుకు విపినుడు ఇలా జవాబు చెప్పాడు — "ఏదో ఒక అనిర్వచనీయమగు బాహ్యచింతకై అపరాధం చేస్తున్నాను, అందుకు క్షమాభిక్ష వేడుకునే సదవకాశము లభించదు, దానికి తగిన శిక్షను పొందే అదృష్టముకూడా కలుగదు; కానీ పాటలు మణిపూసలు, ముత్యాలవంటి అక్షరాలు. ఆశను చంపుకోలేక దొంగతనంగా చదివినప్పటికీ శిక్షించే ఆ భగవంతుడు తప్పక క్షమిస్తాడు."

"భగవంతుడు క్షమిస్తాడేమోకాని నేనుమాత్రం క్షమించను. ఆ పుస్తకంమీద నాకుకూడా ఆశ ఉంది విపిన బాబూ" అని అంది శైలబాల.

వారిద్దరి సంభాషణకు అడ్డొస్తూ రసికదాదా ఇలా అన్నాడు — "అంటే, నేను లోభ మోహాలను త్యజించి కూర్చున్నానని మీ ఉద్దేశ్యమా ? ఆహా, ఆ అక్షరములను మించినదేమున్నది? మనస్సులోని భావాలు సజీవరూపాన్ని ధరించి వ్రేళ్ళ కొనలనుంచి బయటకు వెలువడుతున్నాయి- అక్షరాలమీద దృష్టిపడగానే హృదయము అక్షరాల రూపంలో కళ్ళ యెదుట ప్రత్యక్షమవుతుంది. అబలాకాంత్, ఈ పుస్తకమును వదలిపెట్టవద్దు. మెరపుతీగవంటి నీ నీర

బాలాదేవి చిత్రమగు సెలయేటివలె రాత్రింబవళ్ళు ప్రవహిస్తూనే ఉంటుంది, ఆ సెలయేటిని ఆపటం సాధ్యము కాదుగదా! ఈ పుస్తకములోని పేజీలలో ఆ సెలయేటి జలమే ప్రవహిస్తూఉంది - ఇది చాలా విలువైనది. విపిన బాబూ, నీరబాలాదేవి ఎవరో మీరెరుగరు, అలాంటప్పుడు ఈ పుస్తకాన్ని మీరేమి చేసుకుంటారు?"

అందుకు విపినుడు ఇలా అన్నాడు — "నీరబాలా దేవిని మీరు ప్రత్యక్షముగా ఎరుగుదురుగనుక ఈ పుస్తకమువల్ల మీకేమిటి ప్రయోజనము? ఈ పుస్తకముద్వారా నేను ఎంతో పరిచయాన్ని ఆశిస్తున్నాను, నా ఆశకు మీరెందుకు అంతరాయం కల్గిస్తున్నారు?"

అదే సమయంలో శ్రీశుడు లోనికి వచ్చి "మహాశయా, గుర్తొస్తుంది - ఒకనాడు ఇక్కడ ఒక పుస్తకంమీద నృపబాల, నీరబాల అనే పేర్లు ఉండటం చూచాను - ఎవరా మనిషి? విపినుడా? ఇంత అకస్మాత్తుగా ఊడిపడ్డావేమిటి?" అని అన్నాడు.

"నేనూ అదేప్రశ్న నిన్ను అడుగుతున్నాను" అని అన్నాడు విపినుడు.

అందుకు శ్రీశుడు ఇలా చెప్పసాగాడు - "సన్యాసవ్రతమునుగురించి అబలాకాంతబాబుతో చర్చించాలనే ఉద్దేశ్యంతో నే నిక్కడికి వచ్చాను. వీరి ముఖములాంటి అందమైన ముఖము, కంఠస్వరము, ముఖభావము మనం అనుకున్న ఆదర్శ సన్యాసికి చక్కగా సరిపోతాయి. వీరు తమ లలాటమున చంద్రకళవలె చందనము దిద్దుకొని,

మెడలో మాలలు ధరించి, వీణమీటుతూ ప్రాతఃకాలమున ఏ గ్రామంలో ప్రవేశించినాసరే అక్కడి గృహస్థుల హృదయాలను కరిగించలేరంటావా ?"

"నాకేమీ అర్థం కాలేదు మహాశయా, హృదయాలు కరిగించవలసినంత అవసరం ఏమి కలిగింది" అని అడిగాడు రసికదాదా.

"బ్రహ్మచారి సంఘము హృదయాలను కరిగించే సంఘమే" అని జవాబు చెప్పాడు శ్రీశుడు.

"అదేమిటండోయ్ ? అయితే నాతో ఏమిపని చేయిస్తారు" అని ప్రశ్నించాడు రసికదాదా.

"మీరు ఉత్తర మేరుపర్వతంమీదికి వెళ్ళి మీలో ఉన్న అత్యధిక వేడిమితో అక్కడి మంచును కరిగించి వెల్లువ తేగలరు. విపిన్, లేస్తున్నావెందుకని ?" అన్నాడు శ్రీశుడు.

"వెళతాను, రాత్రికి నేను చదువుకోవాలి" అని అన్నాడు విపినుడు.

లేచి వెళ్ళుటకు సిద్ధంగావున్న విపినునితో రసికదాదా రహస్యంగా "మీరు చదివినతరువాత పుస్తకమును తిరిగి ఇస్తారా లేదా అని అబలాకాంతబాబు అడుగుతున్నారు" అని అన్నాడు.

"ఇప్పుడేమీ చెప్పలేను, చదివిన తరువాత ఆ విషయాన్ని గురించి ఆలోచిద్దాం" అని అన్నాడు విపినుడు రసికదాదాతో నెమ్మదిగా.

"శ్రీశబాబూ, ఏమిటలా వెతుకుతున్నారు? మీ

దేమైనా వస్తువు పోయిందా?" అని మృదువుగా అడిగింది శైలబాల.

"ఏమీలేదు, ఇప్పుడు వద్దు. మరొకసారి వెతికి చూస్తాను" అని అంటూ శ్రీశుడుకూడా విపినుడి వెనుకనే బయటకు వెళ్ళిపోయాడు.

ఇటు లోపలినుంచి నీరబాల గబగబవచ్చి "అక్కా, ఇదెక్కడి బందిపోటుతనం! నా పాటలపుస్తకమును తీసుకు పోయారేమిటి! అయ్యో! రసికచక్రవర్తిగారూ, నా పాటల పుస్తకాన్ని నాకు తెచ్చివ్వండి" అని అంది.

"దొంగను పట్టుకోనేపని నాదికాదు, ఆ విషయం పోలీసులతో చెప్పు" అన్నాడు రసికదాదా.

"అక్కా, నా పుస్తకాన్ని ఎందుకు తీసుకు వెళ్ళనిచ్చావు" అని అడిగింది నీరబాల.

"అంత అమూల్యమైన వస్తువును నువ్వు ఇక్కడ ఎందుకు వదలివెళ్ళావు?"అని ఎదురుప్రశ్నించింది శైలబాల.

"అంటే నేను కావాలని వదలివెళ్ళానంటావా?" అని బుంగమూతి పెట్టింది నీరబాల.

"చూచేవాళ్ళకు అలాంటి సందేహమేకలుగుతుంది" అని అన్నాడు రసికదాదా.

"అదేమీకాదు, నీ పరిహాసాలు నాకేమీ నచ్చటం లేదు" అని అంది నీరబాల.

"అయితే చాలా భయంకరపరిస్థితే ఏర్పడింది" అని అన్నాడు రసికదాదా.

కోపంతో రుసరుసలాడుతూ నీరబాల లోనికి వెళ్ళి

పోతుంది. అటునుంచి సిగ్గుపడుతూ నెమ్మదిగా నృపబాల అక్కడికి వచ్చింది.

"ఏమమ్మా, పోగొట్టుకున్న ధనాన్ని వెతుక్కొంటు న్నావా?" అని అడిగాడు రసికదాదా.

"నావస్తువు లేవీ పోలేదు" అని అంది నృపబాల.

"అయితే ఇది చాలా సంతోషకరమైన సమాచారమే. శైలూ, ఇక మనము చేయగలిగిందేముంది, ఈ రుమాలు పోగొట్టుకున్న దీని స్వంతదారు ఎవరో తెలిసే వరకు ఇది ఎవరికిదొరికిందో వారికే ఇచ్చివేయటంమంచిది" అంటూ రసికదాదా శైలబాల చేతిలోనుంచి జేబురుమాలును తీసుకొని "ఇది ఎవరిది?" అని ప్రశ్నించాడు నృపబాలను.

"ఇది నా రుమాలు కాదు" అని జవాబు చెప్పింది నృపబాల.

ఈ మాటఅని నృపబాల అక్కడినుంచి లోనికి వెళ్ళి పోబోతూవుండగా రసికదాదా ఆమె చేతిని పట్టుకొని "పోగొట్టుకున్న వస్తువునుగురించి నాది అనికూడా చెప్ప గల అధికారాన్ని వదులుకోదలిచావా" అని ప్రశ్నించాడు.

"నాచేతిని వదులు, అవతల నాకు పనివుంది" అని నృపబాల రసికదాదా పట్టు విడిపించుకొని లోనికి తుర్రుమంది.

# 7

శ్రీశుడు, విపినుడు ఒక చెరువువద్దకు వెళ్ళేమార్గంలో మాట్లాడుతూ నడిచివెళుతున్నారు. విపినుడు ఇంటికి తిరిగి వెళదామని అంటున్నాడు. శ్రీశుడు అందుకు అంగీకరించటంలేదు. దానినిగురించి వారిద్దరికీ ఇలా సంభాషణ ప్రారంభమయింది:

"ఇదుగో విపిన్, ఇవి మాఘమాసపు చివరిరోజులు, నవవసంతపుగాలి హాయిగొలుపుతూ ఉంది, వెన్నెలకూడా అపూర్వంగా ఉంది, ఇలాంటిసమయంలో ఇప్పుడే ఇంటికి వెళ్ళి నిద్రపోతే ఆ దేవతలుకూడా మెచ్చరుసుమా!"

"ఆ దేవతలు మెచ్చినా మెచ్చకపోయినా వచ్చే ఇబ్బంది ఏమీలేదు, కానీ రోగపుతాకిడికి—"

"ఇదుగో, ఈ విషయంలోనే నీకూ నాకూ తగాదా వస్తుంది. దక్షిణపుగాలి తగిలేసరికి నీమనస్సు స్థిమితాన్ని కోల్పోయిందని నాకు తెలుసు. కానీ తరువాత నియమానికి విరుద్ధంగా కవిత్వం ఎక్కడ పుట్టుకొస్తుందోననే భయంతో నువ్వు మలయమారుతాన్ని దగ్గరకు చేరనివ్వటం లేదు. ఇందులో నీ గొప్పతనాన్నిగురించి ఎవరూ అడగరు. నాకు ఈ పుష్పాలు, ఈ వెన్నెల అన్నీ బాగానే ఉన్నాయి, అన్నీ అందంగానే ఉన్నాయని ఇవాళ నీముందు నిర్భయంగా అంగీకరిస్తున్నాను—"

"ఇంకా—"

"ఇంకా అందంగా ఉండతగినవన్నీ అందంగానే కన్పిస్తున్నాయి."

"ఆ బ్రహ్మదేవుడు నిన్ను ఆశ్చర్యకరమగు మూసలోపోసి తయారుచేసినట్లున్నాడు."

"నిన్ను అంతకంటెకూడా ఆశ్చర్యంగా తయారు చేశాడు విపిన్! నీకుకూడా అన్నీ అందంగానే కన్పిస్తున్నాయి. కానీ నువ్వు అందుకు విరుద్ధంగా మాట్లాడుతున్నావు—నా గదిలోవున్న గడియారమును చూచావా, అది బాగానే ఆడుతుంది, కానీ సరియైన సమయాన్ని చూపించదు—నువ్వుకూడా అంతే."

"మిత్రమా, అందమైన వస్తువులన్నీ నీకు మనోహరంగా కన్పిస్తున్నాయంటే త్వరలోనే ఆపదరానున్న దన్న మాట."

"అలాంటిఆపదలేవో వస్తాయని నేననుకోవటంలేదు."

"ఆ లక్షణమే అన్నిటికంటె మరీచెడ్డది. రోగము వల్ల కలిగే బాధను తెలుసుకోగలస్థితి నశించినప్పుడు ఆ రోగానికి చికిత్సచేసే మార్గమే ఉండదు. శ్రీశబాబూ, స్త్రీజాతిలో ఒక ఆకర్షణ ఉంది—బ్రహ్మచారిసంఘము ఆ ఆకర్షణను తొలగించదలచినట్లయితే, స్త్రీలకు చాలా దూరంగా ఉండటం అవసరమని నేను అంగీకరిస్తున్నాను."

"పొరపాటు, శుద్ధపొరపాటు, భయంకరమైన పొరపాటు! నువ్వు దూరదూరంగా తప్పుకు తిరిగినంత మాత్రాన స్త్రీలు నీకు దూరదూరంగా తప్పుకు తిరగరు. ప్రపంచమును రక్షించుటకు బ్రహ్మదేవుడు అనేకమంది

స్త్రీలను సృష్టించాడు, వాళ్ళకు దూరంగా తప్పుకుతిరగటం అసంభవమే. కనుక మనము మన బ్రహ్మచర్యాన్ని కాపాడుకోవాలంటే క్రమంగా స్త్రీలకు దగ్గరగా ఉండటం అలవర్చుకోవాలి. స్త్రీలనుకూడా మన సంఘములో చేర్చుకోవాలని తీర్మానించటంద్వారా మనము మన సంఘానికి ఒక స్థిరత్వాన్ని చేకూర్చగలిగాము. కానీ ఒక్కరో ఇద్దరో స్త్రీలను చేర్చుకున్నందువల్ల ఆ సమస్య తీరదు. అనేకమంది స్త్రీలను మన సంఘంలో చేర్చుకోవాలి. బయట తిరిగే అలవాటు లేనివాళ్ళకు తలుపులన్నీ మూసుకొని ఒక్క కిటికీ తెరిచి గదిలో కూర్చున్నా చలిగాలి తగిలి జలుబు చేస్తుంది. ఆరుబయట తిరుగుతూ ఉంటే అలాంటి ప్రమాదం ఉండదు."

"గదిలోపల, గదిబయట ఇవేమీ నాకు తెలియవు ఒక మనిషి ఆరోగ్యమే జలుబు చేసేదైనప్పుడు అతనికి జలుబు చేయకుండా మనుషులు కాదుగదా భగవంతుడు కూడా కాపాడలేడు."

"ఇంతకూ మీ తత్వము ఎలాంటిదంటారు?"

"ఆ విషయాన్ని కొంత స్పష్టంగా చెపితేగాని నీకు అర్థంకాదు. నీ తత్వానికి, నా తత్వానికి ఒక విచిత్రమైన అనుకూలత ఉంది. నాడిమాత్రం ఎప్పుడూ బ్రహ్మచారి నాడివలె ఆడుతుందనిమాత్రం సగర్వంగా చెప్పుకోలేను."

"ఇదికూడా నీ పొరపాటే. బ్రహ్మచారినాడికి రకరకముల గాలులు ఎన్ని తగిలినప్పటికీ ఏమీ భయం లేదు. ఇలా ఒత్తులు ఒత్తటంగానీ, అసలు విషయాన్ని

మరుగుపర్చి మాట్లాడటంగానీ చేయవద్దు. బ్రహ్మచర్య వ్రతంలాంటి కఠోరవ్రతాన్ని అవలంబించేవారు హృదయాన్ని సుకుమారంగా పట్టుపరుపులమీద వత్తిడి తగలకుండా ఉంచరు; అశ్వమేధ యజ్ఞాశ్వమువలె దానిని విడిచిపెట్టాలి; దానిని బంధించినవారితో యుద్ధం చేయాలి."

"అటునుంచి వెళుతున్న మనిషి ఎవరు! పూర్ణబాబువలె ఉన్నాడు. పాపం, అతనికి వెళ్ళటానికి ఈ సందు తప్ప మరొక మార్గం లేదు. ఆ వీధిని అశ్వమేధాశ్వము కాలు విరిగి కుంటుతూ ఉంది. అతనిని ఒకసారి పిలుద్దామా?"

"పిలువు! కానీ అతడు ఈ సందులలో మనిద్దరికోసమూ వెతుకుతున్నట్లు కన్పించటం లేదు."

"పూర్ణబాబూ, పూర్ణబాబూ!" అంటూ విపినుడు అతనికోసం కేకలు పెట్టాడు. అతడు దగ్గరకు రాగానే "ఏమిటి సమాచారం?" అని అడిగాడు.

"పాత సంగతులే. నిన్న, మొన్న ఏ సంగతులు ఉన్నాయో ఇవాళకూడా అవే సంగతులు" అని అన్నాడు పూర్ణ.

"నిన్న, మొన్న శీతాకాలపు గాలి వీస్తూవుండేది; ఇవాళ వసంతసమీరము వీస్తూ ఉంది – అందువల్ల ఒకటి రెండు క్రొత్తసంగతులు ఉంటాయని ఆశించవచ్చును" అని అన్నాడు శ్రీశుడు.

"మలయమారుతమువల్ల జనించే వార్తలకు బ్రహ్మచారి సంఘపు పత్రికలో తావుండదు. తపోవనములో ఒకనాడు అకస్మాత్తుగా మలయమారుతము వీచింది. దానివల్లనే

మహాకవి కాళిదాసు కుమారసంభవకావ్యాన్ని రచించాడు-కానీ మన కపాలగుణమునుబట్టి ఆ మలయమారుతమువల్ల 'కుమార-అసంభవ' (బ్రహ్మచర్యము అసంభవం) మనే కావ్యము జనిస్తుంది" అన్నాడు పూర్ణ.

"అలాగే కానివ్వండి—ఏమంటారు పూర్ణ బాబూ-ఆ కావ్యములో దగ్ధమైపోయిన దేవత ఈ కావ్యములో పునర్జన్మ పొందుతుంది" అని అన్నాడు విపినుడు.

ఆ మాటకు పూర్ణ ఇలా అన్నాడు - "ఈ కావ్యములో బ్రహ్మచారి సంఘము దగ్ధమైపోతుంది. దానిలో దగ్ధమైన దేవతలే దీనిని దగ్ధం చేస్తారు. శ్రీశబాబూ, నేను నవ్వుతూ మాట్లాడటం లేదు, యదార్థమే చెపుతున్నాను. మన బ్రహ్మచారిసంఘము ఒక అఖండమైన లక్కయిల్లు వంటిది. నిప్పు అంటుకుంటే ఏమీ మిగలదు. దీనికంటే వివాహితుల సంఘాన్ని స్థాపించండి. స్త్రీల విషయంలో అప్పుడు భయం అనేదేమీ లేకుండా ఉండగలుగుతాము. ఇటుకలను కాల్చిన తరువాతనే ఇల్లు కట్టటానికి ఉపయోగిస్తారు. అప్పుడు అవి కాలిపోతాయనే భయం ఉండదు."

"మొదట వివాహమనేది ఎవరు చేసుకున్నారో ఏమో కానీ, అందువల్ల వివాహమనే వస్తువే నశించిపోయింది. అందుకనే ఈ బ్రహ్మచారి సంఘం వెలిసింది పూర్ణ బాబూ! నేను జీవించివుండగా ఈ సంఘంలో ఆ బ్రహ్మసృష్టిని ప్రవేశించనివ్వను" అన్నాడు శ్రీశుడు.

"మన్మథుడు ప్రవేశించవచ్చునా?" అని ప్రశ్నించాడు విపినుడు.

"అతడు రావచ్చును. ఒకసారి అతనితో సన్నిహిత సంబంధం ఏర్పడితే తరువాత అతనినిగురించి మరేమీ భయం ఉండదు" అని చెప్పాడు శ్రీశుడు.

"ఇదిగో, చూడండి శ్రీశబాబూ–" అంటూ పూర్ణ ఏదో చెప్పబోయాడు. కానీ శ్రీశుడు అతని మాటకు అడ్డొస్తూ ఇలా అన్నాడు — "ఇంకా చూడటమేమిటి! అతనికోసమే వెతుకుతున్నాను. దీర్ఘంగా నిట్టూర్పులు వదులుతాను. కవిత్వము వ్రాస్తాను. అందమైనవాటిని చూచి ఆనందిస్తాను. అప్పుడే అన్నివిధాల సన్యాసిని కాగలుగుతాను. మన కవి ఒకరు ఏమి వ్రాశారో తెలుసా—

ప్రియా, జీవనజ్యోతిని వెలిగించి వెళ్ళు,
ఈ చీకటి రాత్రి గడచుట కష్టము!
నీ వెలుగుతో చీకటిని చీల్చు;
నీ రాకకై నేను వేచియున్నాను,
నా శూన్య హృదయములో ప్రవేశించి
వెలుగును నింపు ప్రియా!

"ఆహా, అద్భుతం శ్రీశబాబూ, మీ కవిగారెవరో కాని చాలా బాగా చెప్పారు – 'ఈ చీకటిరాత్రి గడచుట కష్టము! ప్రియా! జీవనజ్యోతిని వెలిగించి వెళ్ళు'— అద్భుతంగా ఉంది, గృహము అలంకరించబడివుంది— మాలసిద్ధముగా ఉన్నది. పాన్పుమీద పుష్పములు చల్లివున్నాయి. జీవనజ్యోతి మాత్రమే వెలగటం లేదు. చీకటి కూడా పడింది. చాలా బాగా వ్రాశారు. ఇది ఏ పుస్తకం లోనిదో చెపుతారా శ్రీశబాబూ!" అనిఅన్నాడు పూర్ణ.

"పుస్తకం పేరు 'ఆహ్వానము'" అని చెప్పాడు శ్రీశుడు.

"పేరుకూడా బాగుంది" అని పూర్ణబాబు తనలో తాను ఆ పాటలోని మొదటి చరణాన్ని చదువుకున్నాడు. తరువాత అతడు దీర్ఘంగా నిట్టూరుస్తూ "మీరిద్దరూ ఇంటికే వెళుతున్నారా?" అని ప్రశ్నించాడు.

"మిత్రమా, ఇల్లు ఎటుఉన్నదోకూడా మరచి పోయాను" అన్నాడు శ్రీశుడు.

"మార్గం తెలియకుండా మైమరపించేరాత్రి ఇది. మీరేమంటారు విపినబాబూ" అని అన్నాడు పూర్ణ.

"విపినబాబు ఈ విషయాలనుగురించి ఏమీ మాట్లాడడు, తరువాతమాత్రం వారిలోనుండి కవిత్వం పుట్టుకొస్తుంది. తాను అధికంగా ప్రేమించే వస్తువును అతడు భూమిలో పాతిపెట్టి ఉంచుతాడు" అని అన్నాడు శ్రీశుడు.

"మిత్రమా, అవునుగాని ప్రదేశాలలో అనవసరంగా దానిని ఖర్చుచేయటం నాకిష్టంలేదు, అనువైన ప్రదేశంకొరకు వెతుకుతున్నాను. చనిపోదలచినప్పుడు ఎక్కడో చావటంకంటె గంగానదీతీరాన చావటం మంచిది కదా !" అన్నాడు విపినుడు.

"అది శాస్త్రసమ్మతమైన ఉత్తమ విషయమే. విపినబాబు అంతిమకాలం కోసమని కవిత్వాన్ని ప్రోగుచేసుకొని ఉంచుకున్నాడు, ఇతరులు మాట్లాడినప్పుడు వారు జవాబు కూడా చెప్పరు. ఇతరులమాటలు మీకు తేనెసోనలు కావాలని ఆశీర్వదిస్తున్నాను" అని అన్నాడు పూర్ణబాబు.

"తీపితోపాటు కొద్దిగా ఘాటుతనంకూడా ఉండటం మంచిది" అని అన్నాడు శ్రీశుడు.

"వాక్యములు వర్షించినంతమాత్రాన నోరు చేయ వలసిన కర్తవ్యము పూర్తికాకుండుగాక!" అని అన్నాడు విపినుడు.

"వాక్యములకంటె వాక్యముల విరామస్థలములు మరింత మధురంగా ఉండుగాక" అని పూర్ణబాబు అనగానే "ఆ రోజున కంటికి నిదురే రాకూడదు" అని అన్నాడు.

"అంతేకాదు, రాత్రి త్వరగా గడచిపోకూడదు" అని అన్నాడు పూర్ణ.

"చంద్రుడు పూర్ణచంద్రుడై ఆకాశంలో ప్రకాశించుగాక" అన్నాడు విపినుడు.

"విపినుడుకూడా వసంత పుష్పాలతో ప్రసన్నవదనుడు కావాలి" అన్నాడు పూర్ణబాబు.

"దురదృష్టవంతుడగు శ్రీశుడు లతామండపందగ్గర జేరి దొంగచూపులు చూడకూడదు" అని అన్నాడు శ్రీశుడు.

"సరే, అవన్నీ ఎందుకుగాని 'ఆహ్వానం' కావ్యము నుండి మరొకపాట విన్పించండి. ఇంతకుముందు మీరు పాడినపాట అద్భుతంగా ఉంది" అని పూర్ణ ఆ పాటలోని మొదటి చరణమును పాడి తరువాత తన్మయుడై ఇలా అన్నాడు —

"ఆహా! ఒక జీవనజ్యోతి వెలుగుతూఉంది, మరొక జీవనజ్యోతి వెలగటంలేదు, వెలుగుచున్న జీవనజ్యోతిని రెం

డవదాని చెంతకు చేర్చి సుకుమారమగు రెండు చేతి వేళ్ళు తాకగానే అమితాశ్చర్యము కలుగునట్లు వెలుగుతో నిండి పోతుంది."

మరొకసారి పూర్ణబాబు ఆ పాట చరణమును మనస్సులో చదువుకున్నాడు.

"పూర్ణబాబూ, మీరెక్కడికి వెళుతున్నారు?" అని అడిగాడు శ్రీశుడు.

"చంద్రబాబుగారి ఇంటివద్ద ఒక పుస్తకమును మరచిపోయివచ్చాను, దానిని తెచ్చుకోటానికి వెళుతున్నాను" అని జవాబు చెప్పాడు పూర్ణ.

"వెతికితే కన్పిస్తుందంటారా ? చంద్రబాబుగారిఇల్లు చాలా విశాలమైన ప్రదేశంలో ఉంది - అక్కడ ఏదైనా వస్తువు పోతే అది తిరిగి దొరకటం కష్టం" అని అన్నాడు విపినుడు.

తరువాత పూర్ణబాబు వారివద్ద శలవుతీసుకొని వెళ్ళిపోతాడు. పూర్ణ కొంచెం దూరం వెళ్ళిపోయినతరువాత శ్రీశుడు దీర్ఘంగా నిట్టూర్చి "మిత్రమా విపిన్, పూర్ణబాబు కూడా విచిత్రమైన మనిషే!" అని అన్నాడు.

"లోపలఉన్న గాసును అణచిపెట్టి ఉంచటంవల్ల సోడాసీసామీద ఉండే మూతవలె అతనితల 'టప్' మని లేచిపోవచ్చు" అని అన్నాడు విపినుడు.

అందుకు శ్రీశుడు ఇలా అన్నాడు — "లేచిపోతే పోయిందిలే! ఏదోవిధంగా ఇనపతీగలతో లేచిపోయే తలను అక్కడే కట్టివుంచటం జీవిత పురుషార్థం కాదుగదా!

మధ్యమధ్య ఈ తలవల్ల తప్పాలు జరగకపోతే రాత్రింబవళ్లు కూలివాని బరువువలె బరువు బ్రతుకును ఈడ్చటమెందుకు? మిత్రమా, దానిని నరికి అవతల పారెయ్, టపీమని ఎగర గొట్టు. ఒకనాడు నీకొకపాట విన్పించాను గుర్తుందా?"

ఆ మాట అని శ్రీశుడు ఒకపాట పాడి విన్పించాడు.

"మిత్రమా, ప్రస్తుతం నువ్వు కవిత్వాన్ని బాగా అధ్యయనం చేస్తున్నట్లుంది; అంటే త్వరలోనే ఏదో ఆప దలో చిక్కుకుంటావని అనుమానంగా ఉంది"అని అన్నాడు విపినుడు.

"ఆపదలు కావాలని తానే వాటిని వెతుక్కొంటూ వెళ్ళేవ్యక్తికి ఆపదలవల్ల భయం ఏముంటుంది! ఆపదలకు దూరదూరంగా తప్పుకొని తిరుగునప్పుడు అకస్మాత్తుగా కాలుజారి ఆపదలో చిక్కుకోవటమే నిజంగా ప్రమాదకర మైనది"అని అంటూ శ్రీశుడు ఎదురుగా రసికదాదారావటం చూచి "రండి, రండి రసికబాబూ! రాత్రులందు ఇలా రోడ్లవెంట తిరుగుతున్నారేమిటి?" అని అన్నాడు.

"నాకు ఒక రాత్రి ఏమిటి, పగలు ఏమిటి, అన్నీ ఒకటే—" అంటూ రసికదాదా ఒక శ్లోకం చదివాడు —

వరమసౌ దివసో న పునర్నిశా,
నను నిశైవ వరం న పునర్దినమ్!
ఉభయమేతదుపైత్వథవా క్షయం॥
ప్రియజనేన న యత్ర సమాగమ్!

"అస్యార్థః?" అని అడిగాడు శ్రీశుడు.

"సూర్యోదయం కావచ్చు లేదా చంద్రోదయమే కావచ్చు. ఇప్పటికి ఎన్నో రాత్రింబవళ్ళు గడచిపోయాయి, కానీ ఇంతవరకు ప్రియుడు రాలేదు — కనుక నాకు రాత్రింబవళ్లు రెండూ సమానమే అని దాని అర్థం" అన్నాడు రసికదాదా.

"అదిసరే రసికబాబూ! ఒకవేళ ప్రియుడు అకస్మాత్తుగా ఈ క్షణంలోనే వస్తే?" అని అడిగాడు శ్రీశుడు.

"అలాంటి దేదైనా జరిగినా వాడు నావైపు కన్నెత్తి కూడా చూడడు. ఆ అదృష్టం మీలో ఒకరికి లభిస్తుంది" అన్నాడు రసికదాదా.

"మేము వెంటనే మాలో రసికత్వమేమీ లేదని నిరూపించుకుంటాము" అన్నాడు శ్రీశుడు.

అందుకు రసికదాదా ఇలా అన్నాడు — "మరుక్షణంలోనే అత్యంత ఆనందంతో కాలక్షేపం చేస్తారు. అయితే, నేనేమీ ఈర్ష్య పడదలచుకోలేదు శ్రీశబాబూ! నాకు అలాంటి అదృష్టం కలిగించకుండా ఇంతకాలం ఆలస్యము చేసిన ఆ వ్యక్తిని నేను మీకోసం త్యాగం చేస్తున్నాను. దేవీ, నువ్వు నీ పరమాత్మను కూర్చుకొని రా! ఇవాళ వసంతకాలపు వెన్నెలరాత్రి, నేడు అభిసారమునకై రమ్ము దేవీ!

మందం నిధేహి చరణౌ పరిధేహి నీలం,
వాసః పిధేహి వలయావలిమంచలేన!
మా జల్ప సాహసిని శారద చంద్రకాంత—
దాంత్యాంశవస్తప తమాంసి సమాపయంతి!

అందమైన నీలాంబరమును ధరించి
మెల్ల మెల్లగా నడచిరమ్మ సుందరీ !
గలగలలాడే ముంజేతి కంకణములు
నీ చేలాంచలమున బంధించి ఉంచు !
వెన్నెలవంటి నీ తెల్లని నవ్వు
అంధకారమును పారద్రోలును !

"రసికబాబూ, మీ సంచి బాగా నిండుగానేఉంది. ఇలాంటి అనువాదాలు ఎన్ని చేశావేమిటి?" అని అడిగాడు శ్రీశుడు.

"కుప్పలు కుప్పలు! లక్ష్మీదేవి రాలేదుకాని వాణితోనే కాలక్షేపం చేస్తున్నాను" అన్నాడు రసికదాదా.

"మిత్రమా విపిన్, అభిసారమనేవిషయం వూహించుకొనుటకు చాలా బాగుంటుంది" అన్నాడు శ్రీశుడు.

"దానిని తిరిగి అమలుపర్చటానికి బ్రహ్మచారి సంఘంలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టరాదూ!" అని అన్నాడు విపినుడు.

అందుకు శ్రీశుడు ఇలా అన్నాడు — "అనేక విషయాలు వూహకు చాలా అందంగా కన్పిస్తాయి. కానీ సంసార జీవితంలో వాటిని ఆచరించటానికి సాహసించలేము. అభిసారము జరిగే మార్గములో మగువల హస్తాల నుంచి చెదిరిన ముత్యాలు పడిఉంటాయి. ఆ మార్గము మన పటల్‌డాంగా వీధికాదు. ఆ మార్గము ప్రపంచములో ఎక్కడా లేదు. విరహిణియొక్క హృదయము నీలాంబరమును ధరించి వూహాలోకములోని మార్గాన బయలుదేరు

తుంది — హృదయంమీదిగుండా ముత్యాలు చెదరి క్రిందపడతాయి, కానీ ఆమె వాటివైపు చూడనేచూడదు. నిజమైన ముత్యాలయితే ఏరుకోవచ్చును, ఏమంటారు రసిక బాబూ!"

"ఈ విషయం అంగీకరించాల్సిందే — అభిసారము మనస్సులో వూహించుకుంటేనే అందంగా ఉంటుంది. గుర్రాలు, బండ్లు మొదలగునవి నడిచే మార్గాలు తీరు తెన్ను లేకుండా ఉంటాయి. శ్రీశబాబూ, ఇలాంటి వసంత కాలపు వెన్నెలరాత్రి ఏదో ఒక కిటికీగుండా ఒక తరుణి వ్యాకులహృదయము నీగదివైపు అభిసారానికి బయలుదేరాలని ఆశీర్వదిస్తున్నాను" అని అన్నాడు రసికదాదా.

"అది జరుగుతుంది రసికబాబూ, మీ ఆశీర్వాదం ఫలిస్తుంది. ఇవాళ వీచుచున్న గాలిద్వారా నా మనస్సుకు ఈ వార్త అందింది. విశుదాంగ ముందుగా కబురుపంపి దోపిడీకి వచ్చినట్లే నా అపరిచిత అభిసారికకూడా అదే విధంగా ముందుగానే నాకు అభిసారమునకు బయలుదేరు తున్నట్లు వార్తపంపింది" అన్నాడు శ్రీశుడు.

"అయితే త్వరగా వెళ్ళి నీ డాబామీది వసారాను అలంకరించి సిద్ధంగా కూర్చొని ఉండు" అని అన్నాడు విపినుడు.

"అవును, దక్షిణపువైపు వసారాలో ఒక బల్లమీద నేను కూర్చొని మరొక బల్లని అలంకరించి సిద్ధంగా ఉంచుతాను" అన్నాడు శ్రీశుడు.

"నేనువచ్చి దానిమీంద కూర్చుంటాను" అన్నాడు విపినుడు.

"మధ్వాభావే గుడం మద్యాత్ లోటు కలిగినప్పుడు నీవల్లకూడా పని జరుగుతుంది" అని అన్నాడు శ్రీశుడు.

"ఆ మధుమయి వచ్చినప్పుడు ఈ భాగ్యహీనుని అదృష్టంలో లగుడం దద్యాత్" అన్నాడు విపినుడు.

రసికదాదా శ్రీశుని చెవిలో మెల్లగా "శ్రీశబాబూ, దక్షిణపు వసారాలో గుర్తుకోసం అవసరమైన జండాను ఎగరవేసి వచ్చారా?" అని అన్నాడు.

"ప్రయత్నించేస్తే ఇప్పుడు ఆ రుమాలు లభిస్తుందా?" అని అడిగాడు శ్రీశుడు.

"ప్రయత్నించడంలో తప్పులేదుగదా!" అన్నాడు రసికదాదా.

రసికదాదాతో ఈ సంభాషణ జరిగిన తరువాత శ్రీశుడు "మిత్రమా, నువ్వు రసికబాబుతో మాట్లాడుతూ ఉండు, నే నిప్పుడే వస్తాను" అని చెప్పి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

ఒంటరిగా మాట్లాడే వీలు చిక్కేసరికి విపినుడు రసికబాబుతో "రసికబాబూ, మీకు కోపగించుకోవద్దు" అని అన్నాడు.

"ఒకవేళ నాకు కోపంవచ్చినా మీరేమీ భయపడనవసరంలేదు, నాలో దెబ్బలాడగల బలం ఎలాగూ లేదు" అని అన్నాడు రసికదాదా.

"మిమ్మల్ని ఒక విషయం అడుగుతాను, కోప గించుకోవద్దు."

"నా వయస్సునుగురించి ఏమీ అడగరుకదా?"

"ఆ విషయం కాదు."

"అయితే అడగండి, తెలిసినంతవరకు యదార్థమే చెపుతాను."

"ఆ రోజున నేను చూచిన స్త్రీ—"

"ఆమెనుగురించిన మంచిచెడ్డలు మీరు తెలుసుకో తగినవే. మీరేమీ సంకోచించవద్దు విపిన్‌బాబూ! ఆమెను గురించి మీరు మధ్యమధ్య విచారించినా, చర్చించినా దానివల్ల మీ అసాధారణత్వమేమీ రుజూకాదు - నేను కూడా అదేపని చేస్తూవుంటాను."

"అబలాకాంతబాబు బహుశా—"

"వారి విషయమే మీరు ఆలోచించవద్దు - వారు కూడా మరో విషయమే స్మరించరు."

"అంటే వారు..."

"అవునవును, అదే. అయితేమాత్రం ఏమిటి? వారు నృపబాల, నీరబాల వీళ్ళిద్దరిలో ఎవరిని ఎక్కువగా ప్రేమి స్తున్నారో ఈనాటివరకు స్థిరపర్చుకోలేకపోయారు - వారు వాళ్ళిద్దరిమధ్య దొర్లాడుతూ ఉంటారు."

"వాళ్ళిద్దరిలో వీరిని ఒకరైనా..."

"అదేమీలేదు, వారిని వివాహం చేసుకోవాలని ఇద్దరిలో ఎవరికీ లేదు. అలాజరిగితే ఏమీ యిబ్బందే ఉండేదికాదు."

"అందుకనే అబలాకాంతబాబు ఏదో..."

"విచారంగా ఉంటారు."

"కుమారి నీరబాలగారికి పాటలంటే ఇష్టమా?"

"చాలా ఇష్టం — అందుకు నిదర్శనం మీ జేబులోనే ఉన్నదికదా!"

అప్పుడు విపినుడు తన జేబులోనుంచి పాటలపుస్తకమును బయటకుతీసి "నేను దీనిని తీసుకురావటం అమర్యాదగా ఉందంటారా?" అని అడిగాడు.

"మీరు కాకపోయినా మాలో ఒకరు ఆ పని చేసేవాళ్ళమే."

"మీ రెవరైనా తీసుకున్నప్పటికీ ఆమె క్షమించేది కానీ, నేను—నిజంగా చాలా అన్యాయమే జరిగింది. ఇప్పుడు తిరిగి యివ్వటానికికూడా..."

"అందువల్ల అంతకుముందు జరిగిన అన్యాయము పోదుకదా!"

"అందుకని..."

"దొంగిలించటము అపరాధమే. కానీ దానిని రక్షించుకోలేకపోవటం మరింత అపరాధమే అవుతుంది".

"పుస్తకమునుగురించి మీతో ఏమైనా అన్నారా?"

"ఆమె చెప్పినది బహు తక్కువ. చెప్పకుండా మనసులో దాచుకున్నది చాలా ఎక్కువ."

"ఎందుకని?"

"సిగ్గుతో ముఖం ఎఱ్ఱబడి, నోటివెంట మాటలే రాలేదు."

"అలాంటి పని చేసినందుకు సిగ్గుపడాల్సింది నేను."

"సూర్యుని సిగ్గుతో ప్రభాతసమయము అరుణకాంతి దాల్చినట్లుగా మీ సిగ్గును ఆమె పంచుకొంది."

"నన్ను మరింత పిచ్చివాడిని చేయకండి రసిక బాబూ!"

"మిమ్మల్ని కూడా మా దళములో చేర్చుకొంటు న్నాను మహాశయా!"

విపినుడు చేతిలోని పుస్తకమును తిరిగి జేబులో దాచుకొంటూ "తప్పులు చేయుట మానవధర్మము. క్షమిం చుట దేవత ధర్మము అని ఇంగ్లీషులో చెపుతారు" అని అన్నాడు.

"అలా అయితే మీరు మానవధర్మమును పాలిం చాలనే నిశ్చయించుకున్నారు."

"దేవతధర్మము ఏదైతే ఉందో అది ఆమె పాటి స్తారా?"

ఇంతలో పానకంలో పుడకవలె శ్రీశుడు గబగబ వచ్చి "రసికబాబూ, అబలాకాంతబాబు కన్పించలేదు" అని చెప్పాడు.

"మీరు ఈ రాత్రికిరాత్రే అతనిని సన్యాసిని చేయా లనుకొంటున్నారా?" అని అడిగాడు రసికదాదా.

"ఏదైతేనేం, పని జరుగలేదు. అక్షయబాబుతో మాట్లాడి వచ్చేశాను" అన్నాడు శ్రీశుడు.

"ఇప్పుడు గుర్తొచ్చింది. సాయంత్రం అక్షయ

బాబుతో చెప్పకుండానే వచ్చేశాను—ఒకసారి వెళ్ళి వారిని కలుసుకోమంటారా?" అని అన్నాడు విపినుడు.

ఆ మాటవిని రసికదాదా విపినుని చెవిలో మెల్లగా. "మళ్ళీ ఈసారి మరొకటి దొంగిలించాలని కోర్కెగా ఉన్నదా? మీ మానవధర్మము మిమ్మల్ని అలా నిరంతరము వత్తిడి చేస్తుంది" అని అన్నాడు.

ఆ మాట విని విపినుడు చిరునవ్వు నవ్వుతూ వెళ్ళిపోతాడు.

"రసికబాబూ, మీరు నాకొక సలహా చెప్పాలి–" అన్నాడు శ్రీశుడు.

"తెలివితేటలు లేకపోయినా సలహాలు చెప్పే వయస్సేగదా ఇది!"

"ఆరోజున మీ ఇంటివద్ద కన్పించిన యువతులిద్దరు చాలా అందంగా ఉన్నారు."

"మీరు ఆ విధంగా అనుకోవటంలో తప్పులేదు. అందరూ అదేమాట అంటున్నారు."

"వారినిగురించి ఎప్పుడైనా మిమ్మల్ని ఏదైనా అడిగితే గానీ, లేదా వారిని గురించి ఏదైనా మాట్లాడితేగాని..."

"ఏమీ ఇబ్బంది లేదు. అది నాకూ సంతోషంగానే ఉంటుంది, మీకుకూడా సంతోషం కలుగుతుంది, దానివల్ల వాళ్ళకు ఏమీ కష్టంకలుగదు."

"అలాంటిదేమీ ఉండదుగదా! కీచురాయి ఒకవేళ నక్షత్రాలనుగురించి వూహించితే..."

"అందువల్ల నక్షత్రాల నిద్రకేమీ భంగం కలుగదు."

"ఆ కీచురాయికే అనిద్రరోగం వస్తుంది, కానీ అందువల్ల నాకేమీ ఇబ్బంది ఉండదు."

"ఇవాళ అలాగే కన్పిస్తూ ఉంది."

"రసికదాదా, నాకు రుమాలు దొరికింది చూచారూ, అది ఎవరిది, ఆమె పేరేమిటి?"

"ఆమె పేరు నృపబాల."

"ఆమె ఎవరు?"

"మీరే వూహించి చెప్పండి చూద్దాం."

"ఇద్దరిలో ఎర్రరంగు పట్టుచీర కట్టుకున్న యువతేనా?"

"పూర్తిగా చెప్పండి."

"చాలా సిగ్గుపడి పారిపోవాలనుకుంది, పారిపోటానికికూడా సిగ్గుపడినట్లుంది ... ఒకక్షణకాలం అకస్మాత్తుగా బెదిరిన లేడివలె అలాగే నిలబడిపోయింది, ముఖంమీద పడిన ముంగురులు కళ్ళకుకూడా అడ్డువచ్చాయి — తాళం చెవులగుత్తి కట్టిన కొంగును ఎడమచేతితో పట్టుకొని గబగబ అక్కడినుండి ఆమె వెళ్ళిపోయినప్పుడు ఆమె వీపు మీద వ్రేలాడు నల్లని కేశరాశి నా దృష్టిపథంలో ఒక నల్లని నక్షత్రమువలె నృత్యముచేస్తూ వెళ్ళిపోయింది."

"ఆమే నృపబాల. సిగ్గుతో తడబడు పాదాలు, చేష్టలుడిగిన చేతులు, బెదురుచూపులు, హృదయంలో మాత్రము బాధను కలిగించేవేమీ లేవు — పుష్పములో

దాగియుండు తేనెవలె మధురమైనది, మంచువలె చల్లని కరుణామూర్తి. శ్రీశబాబూ, నాకొక శ్లోకం గుర్తొస్తూ ఉంది —

"కవీంద్రాణాం చేతః కమలవనమాలా తపరుచిం
భజంతే ఏ సంతః కతిచిద రుణామేవ భవతీం ॥
విరించి ప్రేయస్యా స్తరుణతర శృంగార లహరీం
గభీరాభిర్వాగ్ భిర్విద్ధతి సభారంజనమయీం ॥

"కవీంద్రుల హృదయంలోని కమలవనములోని పూలమాలనుంచి వెలువడు వెలుగురేఖవు నీవే. నిన్ను లేశమాత్రము ఉపాసించినప్పటికీ వారు గంభీరవాక్యముల ద్వారా సరస్వతీదేవి సభను రంజింపజేయు తరుణ లీలా తరంగముల వెలుగును సృష్టించగలరు. కవిహృదయంలోని ఆ కమలవన పుష్పముల వెలుగురేఖను నేను దర్శించ గలిగాను."

"నాకుకూడా కొద్దిరోజులనుండి అలాంటి దర్శన భాగ్యము కలుగుతూఉంది. ఆనాటినుంచి కవిత్వము ఎంతో సునాయాసంగా నాలోనుంచి వెలువడుతుంది."

అప్పుడే అటునుంచి అక్షయబాబు వస్తూఉంటాడు. వాళ్ళిద్దరినీచూచి ఒక క్షణకాలం అక్కడే నిలబడిపోయాడు. శ్రీశుడు, విపినుడు అతనికి ఒక సమస్యగా తయారయ్యారు, వారినిగురించే ఆలోచించసాగాడు - "ఈ యువకులిద్దరూ చేరి ఇక నన్ను క్షణంకూడా ఇంటిలో కూర్చోనిచ్చునట్లు లేరు. ఇంతకుముందు వీరిలో ఒకరు దొంగవలె లోనికి ప్రవే శించి దేనికోసమో వెతుకుతున్నాడు - పట్టుబడిపోయి

కూడా సంతృప్తికరమైన జవాబు చెప్పలేదు - ఎదురు నాతోనే ఏదో సంభాషణ ప్రారంభించాడు. తరువాత కొద్ది సేపటికే రెండో యువకుడు వచ్చి పుస్తకాలను కెలుకుతూ కన్పించాడు. అతనిని అంతదూరాన చూచే ఇటు పారి పోయి వచ్చాను. నేను వ్రాసుకునే ప్రేమలేఖలు వీళ్ళచేతికి చిక్కితే తిరిగి యివ్వరేమో! ఆహా! వెన్నెల ఎంత అందంగా ఉంది!"

ఈవిధంగా ఆలోచిస్తూ అక్షయబాబు రెండడుగులు ముందుకు వేసేసరికి శ్రీశుడు వారిని చూడనే చూచాడు.

"ఇదుగో అక్షయబాబు వచ్చారు" అని రసిక దాదాతో చెప్పాడు శ్రీశుడు.

"అయ్యయ్యో! ఒక బందిపోటు ఇంటిలో ఉన్నాడు, మరొక బందిపోటు దారిలోనే ఎదురయ్యాడు. ప్రియా, ఏకాగ్రతతో నేను నిన్నే స్మరించుతూఉంటే రంభ, మేనక, ఊర్వశి మొదలగువారు ధ్యానభంగము కలిగించినా నాకు ఇంత దుఃఖము కలిగేదికాదు - కలికాలంలో ఇంద్రుని వయస్సు అధికమగుటవల్ల అతనిలో రసికత్వము లోపించింది."

ఈ విధంగా ఆలోచిస్తూ అక్షయబాబు మరి రెండడుగులు ముందుకు వేశాడు. ఇంతలో విపినుడు అటుగా వచ్చి "మీరు ఇక్కడే వున్నారా అక్షయబాబూ, నేను మీ కోసమే వెతుకుతున్నాను" అని అన్నాడు.

"పిచ్చివాడా, ఇదంతా మీ దురదృష్టం, లేకపోతే ఇంత అందమైన రాత్రివేళ నాకోసం వెతుకుట ఎందుకు"?

అని అన్నాడు అక్షయబాబు. తరువాత అతడు ఒక ఇంగ్లీషు పద్యమును చదివాడు.

In such a night as this,
When the sweet wind did gently kiss the trees,
And they did make no noise, in such a night,
Troilus me thinks mounted the Trojan walls,
And sighed his soul toward the Grecian tents,
Where cressid lay that night.

"అక్షయబాబూ! In such a night మీరు ఎందుకోసం బయలుదేరారు?" అని అడిగాడు శ్రీశుడు.

"అపసరతి న చక్షుషో మృగాక్షీ
రజనిరియం చ న యాతి నైతి నిద్రా॥
లేడికన్నుల చిన్నదాని రూపము
కన్నులలో నిలచిపోయె!
రాత్రి గడచుటలేదు
కంటికి నిదురకూడా లేదు!"

అని రసికదాదా ఒక శ్లోకము దాని అనువాదము చదివి "అక్షయబాబు పరిస్థితి నాకు తెలుసు మహాశయా!" అని అన్నాడు.

"మీ రెవరండి?" అని అడిగాడు అక్షయబాబు.

"ఇరువైపుల ఇద్దరు యువకుల ఆశ్రయము పొంది యవ్వన సముద్రంలోని ఆకాశమున మెరయు రసికచంద్రుడను" అన్నాడు రసికదాదా.

"ఈ వయస్సులో యవ్వనాన్ని భరించలేను రసిక దాదా" అన్నాడు అక్షయబాబు.

"యవ్వనాన్ని ఏ వయస్సులో భరించవచ్చునో తెలియదు, ఇది చాలా దుస్సహవ్యాపారము. శ్రీశబాబూ, మీకెలా అనిపిస్తుంది?" అని అడిగాడు రసికదాదా.

"ఇంతవరకు పరిపూర్ణంగా తెలుసుకోలేకపోయాను" అని చెప్పాడు శ్రీశుడు.

"బహుశా నేనున్నలాంటి పరిణతిదశకొరకు ఎదురు చూస్తున్నట్లున్నారు? అక్షయదాదా, ఇవాళ మీరేదో పరధ్యానంగా కన్పిస్తున్నారు" అన్నాడు రసికదాదా.

"మీకు అలాగే పరధ్యానంగాఉన్నట్లే కనిపిస్తుంది, నీ మనస్సువలెమాత్రము లేదు—విపినబాబూ, నాకోసమే వెతుకుతున్నామని అన్నారుకదూ! కానీ అంత అవసరమైన పని ఉన్నట్లు కన్పించటంలేదు. నాకొక ముఖ్యమైన పని ఉంది, వెళతాను" అని అక్షయబాబు వెంటనే అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

రసికదాదా అక్షయబాబు వెళ్ళినవైపే చూస్తూ "విరహవేదనలో ఉత్తరము వ్రాసుకొనుటకు వెళ్ళినట్లున్నాడు" అని అన్నాడు.

"అక్షయబాబు సమయానికేవచ్చారు! రసికబాబూ, వారి భార్య నృపబాల పెద్దక్కగారా? ఆమె పేరేమిటి?" అని అడిగాడు శ్రీశుడు.

"పురబాల" అని చెప్పాడు రసికదాదా.

ఆమాట వినగానే విపినుడు రసికదాదాకు మరింత దగ్గరగావచ్చి "ఏమి పేరు?" అని అడిగాడు.

"పురబాల."

"అక్కచెల్లెండ్రలో అందరికంటె పెద్దామె ఆనే కదా!" అని అడిగాడు విపినుడు.

"అవును."

"అందరిలోను చిన్నామె పేరేమిటి?" అని ప్రశ్నించాడు విపినుడు.

"నీరబాల."

"మరి నృపబాల ఎవరు?" అని అడిగాడు శ్రీశుడు.

"నీరబాలకంటె పెద్దావిడ."

"అంటే నృపబాల రెండో సంతానమన్నమాట?" అని అన్నాడు శ్రీశుడు.

"నీరబాల కడగొట్టు సంతానము" అని అన్నాడు విపినుడు.

"నృపబాల పురబాలకంటె చిన్నది, అంతేకదూ?" అన్నాడు శ్రీశుడు.

"ఆమెకంటె చిన్నది నీరబాల" అన్నాడు విపినుడు.

"పిల్ళ్ళ నామజపము ప్రారంభించలేదుగదా? నాకు చాలా చిక్కే వచ్చింది. నడిరోడ్డుమీద నిలబడి ఈ చలిని భరించటంకూడా కష్టమే. ఇక ఇక్కడినుంచి తప్పించుకొని వెళ్ళటం మంచిది" అని రసికదాదా ఆలోచించుకో సాగాడు.

శ్రీశుడు, విపినుడుకూడా రసికబాబు ఏమి చెపుతాడోనని అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయారు.

ఇంతలో ఇటునుంచి వనమాలి ప్రవేశించి "అరే, మీరు ఇక్కడే ఉన్నారా! మీకోసం నేను ఇంటికి వెళ్ళి వస్తున్నాను" అని అన్నాడు.

అతనినిచూచి శ్రీశుడు, విపినుడు కంగారు పడసాగారు. అతనిని ఏదోవిధంగా వదిలించుకొని వెళ్ళాలనే ఉద్దేశ్యంతో "ఇక మీరు ఇక్కడ ఉండండి, మేము ఇంటికి వెళుతున్నాము" అని అన్నాడు శ్రీశుడు.

"ఎప్పుడుచూచినా మీరు ఏదో ఒక పనితొందరలోనే ఉంటున్నారు" అని అన్నాడు వనమాలి.

"అవును, మిమ్మల్ని చూడగానే ఏదోఒక పని గుర్తొస్తూనే ఉంది" అన్నాడు విపినుడు.

"అయిదునిముషాలు మీరు ఓపికపడితే......"అని వనమాలి ఇంకా ఏదో చెప్పబోయాడు.

అదేమీ విన్పించుకోనట్లు శ్రీశుడు "రసికబాబూ, మీకు చలిగా లేదూ?" అని అడిగాడు.

"మీకు ఆ విషయం ఇప్పుడు గుర్తొచ్చిందా ? నేను చాలాసేపటినుంచి చలిని భరించలేకుండా ఉన్నాను" అని అన్నాడు రసికదాదా.

"అయితే, ఇంటికే వెళదాము, పదండి" అని అన్నాడు వనమాలి.

"మహాశయా, ఇంత రాత్రివేళ మీరు మా ఇంటికి

వచ్చినా ...... కానీ ......" అంటూ శ్రీశుడు నీళ్ళు నమిలాడు.

అది గమనించి వనమాలి "అయితేసరే, మీరేదో పనిలో ఉన్నట్లున్నారు, మరొకసారి కలుసుకుందాం" అని అన్నాడు.

# 8

అక్షయబాబుగదిలో రసికచక్రవర్తి, శైలబాల కూర్చొని మాట్లాడుతూ ఉంటారు.

"ఇది నేను చేయవలసినపనేనా? పూర్వము శివునికి తపోభంగము కల్గించుటకు ఆ మన్మథుడే స్వయముగా వచ్చాడు—అలాంటిపని ఈ వృద్ధునివల్ల......"

"మీరు వృద్ధులే, అలాగే ఆ యువకు లిద్దరూ శివులు కాదుగదా !"

"వారిలో అంత తపోనిష్ఠ లేదనేసంగతి నేను ఎప్పుడో గ్రహించాను. అందుకనే ఏమీ భయపడకుండా వచ్చేశాను. కానీ, వారితోపాటు అర్ధరాత్రివరకు నడిరోడ్డు మీద చలిలో నిలబడేశక్తి ఈ శరీరానికి లేదు."

"ఆ యువకుల సహవాసమునుండి వేడిని పుట్టిస్తూ ఉండండి."

"సజీవంగాఉన్న వృక్షము సూర్యుని వేడితగిలితే కళకళలాడుతూ ఉంటుంది, నరికివేసిన చెట్టు ఆ సూర్యుని వేడి తగిలితే మరింత ఎండి పగిలిపోతుంది. యవ్వనంలో ఉండే వేడిమి వృద్ధులకు అంత ఉపయోగకరమైనది కాదు."

"ఎందుకని? మిమ్మల్ని చూస్తే మీరు అలా పగిలి పోతారని నాకేమీ అనుమానంలేదు."

"ఆవిషయం హృదయాన్ని చూస్తే అర్థమవుతుంది."

"అదేంమాట రసికదాదా! ఎలాంటి ప్రమాదాలు దగ్గరకు చేరని నిరపాయకరమగు వయస్సు మీది. యవ్వన దాహం మిమ్మల్ని ఏమి చేయగలుగుతుంది?"

"శుష్కేంధనే వహ్నిరుపైతి వృద్ధిమ్. యవ్వన దాహమనేది వృద్ధుడు కన్పిస్తేచాలు భగభగ మంటలు లేస్తుంది—అందుకనే 'వృద్ధస్య తరుణీ భార్యా' ఆపదలకు కారణమన్నారు, ఇంతకంటె నేను చెప్పేదేముంది."

అప్పుడే లోనినుంచి నీరబాల అక్కడికి వచ్చింది. రసికదాదా ఆమెనుచూచి "ఆగచ్ఛవరదే దేవీ! నువ్వు నాకు వరము ఇస్తావో లేదో తెలియదు కానీ నేనుమాత్రం నీకు వరము ఇవ్వటానికి నానాబాధలు పడుతున్నాను. శివుడు ఏమీ చేయటంలేదు, అయినా నీపూజలు అందు కొంటున్నాడు; అలాంటప్పుడు నీకోసం ఇన్ని బాధలుపడే ఈ ముసలివానికి ప్రతిఫలం ఏమీ లభించదంటావా?" అని అన్నాడు.

"తాంబూలము, పుష్పములువగైరా శివునికి, దాని ఫలితము మాత్రము నువ్వే పొందుతావు — వరమాల నీ మెడలోనే వేస్తాను" అని అంది నీరబాల.

"అవునవును, నువ్వు తెలివిగలదానివనే సంగతి నాకు తెలుసు. విగ్రహంముందు నైవేద్యంపెడితే తరువాత అంతా మనకే చెందుతుంది—అలాగే నువ్వు నిర్భయంగా

వరమాల నా మెడలోనే వేస్తావు. అవసరమైనప్పుడు మళ్ళీ తీసుకోవచ్చునని నీ ధైర్యము. నాకు నీ వరమాల వద్దుకానీ చలికాలం ఈ వృద్ధునికి ఉపయోగపడేట్లు ఒక మఫ్లరు అల్లి పెట్టు."

"అలాగే అల్లి పెడతాను — ఒక జత ఉన్ని దుస్తులు కూడా తమకు సమర్పించుకుంటాను."

"ఆహా! కృతజ్ఞతఅంటే అలా ఉండాలి, ఇదుగో నీరూ, నాకు మఫ్లరు ఒకటిచాలు—ఆపాదమస్తకం ధరించే దుస్తులు అవసరంలేదు, అవి కావలసినవారు వస్తారు."

"అలాగే, కాస్త మీ ఉపన్యాసాన్ని కట్టిపెట్టండి" అని అంది నీరబాల సిగ్గుపడుతూ.

ఆమె ముఖంలో సిగ్గుదొంతరలుచూచి "చూచావా శైలా, ఈమధ్య మన నీరూలోకూడా సిగ్గు కన్పిస్తూఉంది- ఈ లక్షణాలు అంత ఆరోగ్యకరమైనవి కావు" అన్నాడు రసికదాదా.

ఇవాళ అక్కడ బ్రహ్మచారిసంఘు సమావేశము జరుగబోతుంది. సంఘుసభ్యులు ఏ క్షణంలోనైనా అక్కడికి రావచ్చును, కనుక నీరబాల అక్కడికిరావటం శైలబాలకు ఇష్టంలేదు. అందుకని ఆమెను అక్కడినుంచి పంపివేయాలనే ఉద్దేశ్యంతో "నీరూ, ఇంతకుముందు నేను చెప్పాను గదా! మళ్ళీ నువ్వీ గదిలోకి ఎందుకు వచ్చావు? అకస్మాత్తుగా ఎవరైనావస్తే నువ్వే ఇబ్బందిలో పడతావు"అని అంది శైలబాల.

"ఆ యిబ్బందిలో ఉండే ఆనందమేదో ఇంతకు

ముందు ఒకసారి రుచిచూచిందిగనుక మాటిమాటికి ఆ యిబ్బందికోసమే ఎదురుచూస్తుంది" అని అన్నాడు రసిక దాదా.

నీరబాల చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ ఇలా అంది— "ఇదిగో రసికదాదా, నాకు కోపంవచ్చిందంటే నీకు మఫ్లరు అల్లిన్వను. అక్కా, రసికదాదా అనే మాటలకు నువ్వు నవ్వుతూవుంటే ఇంకా మాట్లాడతాడు."

"అమ్మాయీ శైలా చూస్తున్నావుగదా! ప్రస్తుతం నీరూ పరిహాసమాడినా సహించలేకుండా ఉంది. నీరూదీదీ, మానవస్వభావమే అంత—ఒక్కొక్కప్పుడు కోకిలగానము కూడా కర్ణకఠోరముగా ఉంటుందని శాస్త్రములలో చెప్పనే చెప్పారు—అలాగే నీకు ప్రస్తుతం ఈ రసికదాదా ఎగతాళి కూడా కోకిలగానంవలెనే కర్ణకఠోరంగా ఉందన్నమాట."

"అందుకనే నీ కంఠస్వరాన్ని తగ్గించటానికి మఫ్లరు అల్లి మెడకు చుడతాను" అని అంది నీరబాల.

"నీరూ, రసికదాదాతో తరువాత పోట్లాడవచ్చును కాని నువ్వు లోనికివెళ్ళు, ఎవరైనా వస్తారు" అని శైల బాల నీరబాలను వెంటతీసుకొని లోనికి వెళ్ళిపోతుంది.

మరుక్షణమే ఇటు బయటినుండి పూర్ణబాబు లోనికి వస్తాడు. అతనిరాకను గమనించి రసికదాదా "దయ చేయండి పూర్ణబాబూ" అంటూ ఆహ్వానించాడు.

"ఇంకా ఇంతవరకు ఎవరూ రాలేదా?" అని అడిగాడు పూర్ణబాబు.

"అందరూ వస్తారు పూర్ణబాబూ ! ఈ ముసలివానిని చూచి మీకు చాలా నిరాశ కలిగినట్లుంది !"

"నిరాశ ఎందుకు రసికబాబూ?"

"ఎందుకో నాకెలా తెలుస్తుంది. కానీ మీరు లోనికి అడుగుపెట్టగానే మీ రెండుకళ్ళనుచూచి నేను గ్రహించిన దేమంటే మీ కళ్లు ఎవరిని చూడాలని తహతహలాడుతున్నాయో ఆ వ్యక్తిని నేను కాదు."

"చక్షుతత్వాన్నిగురించి ఇంత గొప్పగా మీ కెలా తెలిసింది ?"

"పూర్ణబాబూ, ఇంతవరకు నావైపు ఎవరూ ఏనాడూ చూచిఎరుగను; అందుకనే ఈ వయస్సు వచ్చేవరకు ఇతరుల కళ్ళను అర్థంచేసుకోగల సదవకాశం లభించింది. మీలాంటి అదృష్టనే ఉంటే దృష్టితత్వాన్ని తెలుసుకొని సంతృప్తి చెందటం ఎందుకు, అనేకమంది దృష్టిని ఆకర్షించేవాడిని. కానీ, పూర్ణబాబూ, ఒకటిమాత్రం అంగీకరించి తీరాలి. ఈ ప్రపంచములో నేత్రములవంటి ఆశ్చర్యకరమగు సృష్టి మరొకటి లేదు. శరీరములోని ఇతర అవయవములలోకంటె మనస్సు నేత్రములలోనే ప్రత్యక్షముగా కన్పిస్తూ ఉంటుంది."

రసికదాదా మాటలువిని పూర్ణబాబుకు చాలా ఉత్సాహం కలిగింది.

"రసికబాబూ, మీరు చెప్పినది నిజమే. ఈ క్షుద్ర శరీరములో అనంతాకాశముగానీ, లేదా అనంత సముద్ర

మును గానీ పోల్చి చెప్పాలంటే ఆ పోలిక నేత్రములతోనే సాధ్యమవుతుంది."

పూర్ణబాబు ఉత్సాహాన్ని చూచి రసికచక్రవర్తి ప్రేయసీప్రియులు పరస్పర దర్శనమునకు పరితపించే ఒక శ్లోకమును చదివి దానికి అర్థం చెపుతాడు. పూర్ణబాబు తన్మయుడై రసికదాదా చెప్పేది వింటూవుంటాడు.

ఆదర్శమనేది ఎంత నిర్దయంగా ఉంటుందో రసిక దాదా మరొకశ్లోకంద్వారా వ్యక్తంచేస్తాడు –

"హాత్వా లోచన విశిర వైర్గత్వా కతిచిత్ పదాని
పద్మాశ్రీ।
జీవిత యువా న వాకిం భూయోభూయో విలోకయతి॥

"అంటే ఏమిటో అర్థమయిందా పూర్ణబాబూ! ఆ వయ్యారి నవయువకులమీద తన వాడిచూపుల బాణములు వేసి వెళుతూ వెళుతూ వాటి ప్రభావము ఎలా ఉన్నదోనని మాటిమాటికి వెనుతిరిగి చూస్తూఉంది."

"రసికబాబూ, అలా మాటిమాటికి వెనుతిరిగి చూడటమనేది మనకు కావ్యాలలోనే కన్పిస్తూఉంటుంది."

"అందుకు కారణం లేకపోలేదు పూర్ణబాబూ! కావ్యాలలో వెనుతిరిగి చూచినందువల్ల వచ్చే నష్టమేమీ ఉండదు. కానీ వా స్తవప్రపంచంలో అది కుదరదు, మన ప్రపంచంకూడా ఆ శ్లోకాలవలె ఛందస్సుతో తయారై ఉంటే ఇక్కడకూడా అలాగే వెనుతిరిగి చూడటమనేది సాధ్యపడుతుంది. ఇక్కడ మనస్సు వెనుతిరిగి చూడాలని కోరుతుంది కానీ కళ్లు అటుతిరిగి చూడవు."

పూర్ణబాబు దీర్ఘంగా నిట్టూర్చి "అయితే ఈ ప్రపంచం చాలా ఘోరమైనది రసికబాబూ! కానీ ఇంతకు ముందు మీరు చెప్పిన శ్లోకం చాలా అద్భుతంగా ఉంది" అని అన్నాడు.

"పూర్ణబాబూ కన్నులనుగురించి ఎలాగో చర్చ రానేవచ్చిందీ గనుక మరొకశ్లోకం చెప్పి ముగిస్తాను —

"లోచనే హరిణగర్వ మోచనే
మా విదూషయ నతాంఘ్రి కజ్జలైః।
సాయకః సపది జీవహారకః
కిం పునర్హి గరలేన లేపితః॥"

"అంటే అర్థం చెప్పమంటారా? ఈ కన్నులు లేడి కన్నులనుసైతం ధిక్కరించి వాటికున్న గర్వమును హరించేవిగా ఉన్నాయట. కనుక వాటికి ఇంకా కాటుకను దిద్దటం ఎందుకు, వద్దు అంటాడు. అసలు చూపులబాణాలే వాడిగా ఉంటాయి, బాణములకు విషం పూసినట్లు అందమైన కన్నులకు కాటుకను దిద్ది తాకగానే ప్రాణములు హరించు బాణములుగా చేయవద్దు."

"రసికబాబూ, ఒకక్షణం ఆగండి, ఎవరో వస్తున్నట్లున్నారు."

చంద్రమాధవబాబు, నిర్మల లోనికి వస్తారు. చంద్రబాబు లోనికిరాగానే నిర్మలకు రసికదాదాను చూపిస్తూ "వీరే అక్షయబాబు" అని చెప్పాడు.

"అక్షయబాబు నేనూ ఒకేమాదిరిగా ఉన్నామని మీరనటం, వారుగానీ, వారి బంధువర్గముకానీ వింటే

కోపగించుకుంటారు. నేను రసికచక్రవర్తిని చంద్రబాబూ" అని అన్నాడు రసికబాబు.

"క్షమించండి – అసలే చూపుతక్కువ, బయటినుంచి లోనికి వచ్చేసరికి ఆ పొరపాటు జరిగింది" అని అన్నాడు చంద్రబాబు.

"ఇందులో క్షమించటానికేముంది! మీరు నన్ను అక్షయబాబుగా భావించటము నాకేమీ అగౌరవముకాదు. పూర్ణబాబుతో నేనిప్పుడు విజ్ఞానవిషయమునుగురించి చర్చిస్తున్నాను చంద్రబాబూ" అని చెప్పాడు రసిక చక్రవర్తి.

"నెలకు ఒకరోజు మన బ్రహ్మచారి సంఘంలో విజ్ఞానవిషయాలు చర్చిస్తే బాగుంటుందని నేనుకూడా ఆలోచించాను. ఇవాళ మీరు దేనినిగురించి చర్చించారు పూర్ణబాబూ?" అని అడిగాడు చంద్రబాబు.

"ఏమీలేదు, అదేమంత ప్రాముఖ్యమైన విషయం కాదు" అన్నాడు పూర్ణ.

"కన్నులు, వాటి చూపులు మొదలగు వాటిని గురించి ఒకటిరెండు విషయాలు మాట్లాడాము" అని చెప్పాడు రసికదాదా.

"దృష్టిరహస్యము తెలుసుకొనుట చాలా కఠిన మైనది" అని అన్నాడు చంద్రబాబు.

తరువాత దానినిగురించే రసికదాదాకు చంద్రబాబుకు కొంతచర్చ జరిగింది. పూర్ణ అభిప్రాయాలనుకూడా రసిక బాబు చెప్పాడు, అయితే నిజంగా అవి పూర్ణయభి

ప్రాయాలోకాదో మనకు తెలియదు, పూర్ణమాత్రము రసికదాదా చెప్పేవిషయాలను కాదని ఖండించనూలేదు.

"మర్చిపోయాను, నిర్మలను రసికచక్రవర్తిగారికి పరిచయనే చేయలేదు. రసికబాబూ, మన బ్రహ్మచారి సంఘములో సభ్యురాలుగా చేరిన మొట్టమొదటి స్త్రీ ఈనే" అని చెప్పాడు చంద్రబాబు.

రసికదాదా నిర్మలకు నమస్కరించి "ఈమె మన సభాలక్ష్మి. తమ దయవల్ల మన సంఘములో విద్యాబుద్ధులకు లోటులేదు, ఇప్పుడు నిర్మలగారివల్ల మనకు సౌందర్యదానముకూడా లభిస్తుంది" అని అన్నాడు.

"సౌందర్యమేకాదు, శక్తికూడా" అని చిన్న సవరణను ప్రతిపాదించాడు చంద్రబాబు.

"అన్నీ ఒకటే చంద్రబాబూ, శక్తే సౌందర్యరూపంలో అవతరించినప్పుడు అది అత్యంత శక్తివంతముగా ఉంటుంది. మీ ఉద్దేశ్యం ఏమిటి పూర్ణబాబూ?" అని అన్నాడు రసికచక్రవర్తి.

అదేసమయంలో లోనినుంచి పురుషవేషంలో ఉన్న శైలబాల అక్కడికి వచ్చి "క్షమించాలి చంద్రబాబూ, నేను రావటం ఆలస్యమయిందనుకుంటాను" అని అంది ఎంతో వినయంగా.

చంద్రబాబు తన గడియారంలోకి చూచి "లేదు, లేదు. సమయానికంటె ముందుగానే వచ్చారు. అబలాకాంతబాబూ మా నిర్మల ఇవాళ మన సంఘంలో సభ్యురాలుగా చేరింది" అని అన్నాడు.

శైలబాల నిర్మల ప్రక్క కుర్చీలో కూర్చుంటూ "చూడండి నిర్మలాదేవిగారూ, పురుషులందరూ స్వార్థపరులే, తమకు సేవ జేయించుకొనుటకే వాళ్లు స్త్రీలను నాలుగుగోడల మధ్య బంధించి ఉంచాలనుకుంటారు. ఈ పరిస్థితిలో చంద్రబాబు మిమ్మల్ని సంఘ శ్రేయస్సుకు అర్పిస్తున్నారంటే దీనివల్ల వారి ఔన్నత్యము తేటతెల్లమవుతుంది" అని చెప్పింది.

నిర్మల తన మామగారి దేశభక్తినిగురించి, వారి నిస్వార్థభావాన్ని గురించి తన మామగారిని తాను పూర్తిగా అర్థము చేసుకోవటాన్ని గురించి వివరంగా చెప్పింది.

చంద్రబాబుయొక్క యదార్థరూపాన్ని గురించి, వారి గొప్పతనమును, వారి ఆశయాలను తెలుసుకొని మామగారి అడుగుజాడలలో నడచుకొనుటకు నిర్ణయించుకున్న నిర్మలను శైలబాల అభినందించింది.

తన మామగారు కల్లకపటములేని స్వచ్ఛమైన మనిషిగనుక వారిని అర్థంచేసుకోవటం కష్టమైన పనేమీ కాదని నిర్మల అన్నప్పుడు అందుకు శైలబాల అడ్డొస్తూ ఇలా అంది—"చూడండి, అందుకనే వారిని అర్థం చేసుకోవటం చాలా కష్టము. కల్లకపటములేని నిర్మలహృదయుల్ని అందరూ అర్థంచేసుకోలేరు. పైగా వారిని ఎగతాళి చేస్తారు. పైపైఆడంబరాలకే ఈ ప్రపంచం ఆకర్షింపబడుతూ ఉంటుంది."

ఆ మాటలు విని నిర్మలకు చాలా సంతోషం కలిగింది. వెంటనే ఆమె అబలాకాంతబాబును మెచ్చుకొంటూ

"మీరు చెప్పినది యదార్థమే. బయటివారెవ్వరూ మా మామగారిని అంతగా అర్థంచేసుకోలేకపోయారు. కానీ మీరు మా మామగారిని గురించి యదార్థము మాట్లాడటము విని నాకు ఎంత సంతోషంగా ఉన్నదో మాటలద్వారా చెప్ప లేను" అని అన్నది.

"మీ మామగారియందు మీకున్న భక్తిభావము చూచి నాకుకూడా అలాగే ఉంది" అని అంది శైలబాల.

మిగిలినవారందరూ శైలబాల, నిర్మల సంభాషణను వింటూ కూర్చున్నారేతప్ప ఎవరూ ఏమీ మాట్లాడలేదు. నిర్మల శైలబాలతో అంత చనువుగా మాట్లాడటం పూర్ణ బాబుకు ఎందుకనో ఇష్టంలేనట్లుగా ఉంది. అతని ముఖంలో అలాంటి భావనే వ్యక్తమవుతూ ఉంది.

ఇంతలో చంద్రబాబు వాళ్ళమాటలకు అడ్డొస్తూ "అబలాకాంతబాబూ, నేను మీకిచ్చిన పుస్తకమును చదివారా?" అని అడిగాడు.

"చదివి దానికి నోట్సుకూడా తయారు చేశాను చంద్రబాబూ" అని చెప్పింది శైలబాల.

"చాలా సంతోషం, దానివల్ల చాలా. ఉపయోగం ఉంది. ఇంతకుముందు ఒకసారి పూర్ణబాబు ఆ పుస్తకమును తీసుకువెళ్ళారు. కాని ఆరోగ్యం బాగా లేనందువల్ల వారేమీ చేయలేకపోయారు" అని అన్నాడు చంద్రబాబు.

పుస్తకమును తీసుకువస్తానని చెప్పి శైలబాల లోనికి వెళ్ళింది.

ఇంతకు ముందునుంచి పూర్ణబాబు ముఖభావాన్ని

గమనిస్తున్నా! రసికచక్రవర్తి అతనితో "పూర్ణబాబూ, మీరు అదోమాదిరిగా ఉన్నారేమిటి? మీలో ఏమీ ఉత్సాహం కన్పించటంలేదు. ఆరోగ్యం బాగా లేదా?" అని అడిగాడు.

"ఏమీలేదు, బాగానే ఉన్నాను. రసికబాబూ, అబలాకాంతబాబు అంటే ఇప్పుడు లోనికి వెళ్ళిన వారేనా?" అని అడిగాడు పూర్ణబాబు.

"అవును, ఏం?" అన్నాడు రసికదాదా.

"నాకు వారి వ్యవహారమేమీ నచ్చలేదు" అన్నాడు పూర్ణ.

"చిన్న వయస్సుగదూ, అందుకని..." అంటూ రసికదాదా ఇంకా ఏదో చెప్పబోయాడు.

కానీ పూర్ణబాబు అతని మాటకు అడ్డొస్తూ "ముఖ్యంగా వారికి స్త్రీలతో ఎలా వ్యవహరించాలో నేర్పడం చాలా అవసరం" అని అన్నాడు.

"అది నేనూ గమనించాను. స్త్రీలతో ఎలా వ్యవహరించాలో తెలియదు-చిన్నతనం కదూ!" అని అన్నాడు రసికదాదా.

రసికదాదా అబలాకాంతబాబును సమర్థించటం పూర్ణకు రుచించలేదు — "మేము మాత్రం అంత తల నెరసిన వాళ్ళమూ ఏమిటి, మేము ఇలాగే—" అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

"మీరు అంటీ ముట్టనట్లు దూరదూరంగా ఉండటం నేను చూస్తూనే ఉన్నాను గదా? కానీ వారు దానిని

అమర్యాదగా భావించక పోవచ్చును. మీరు వాళ్ళను పూర్తిగా వదలి వేశారనే వాళ్ళు భ్రమపడుతూ ఉంటారు."

"అదేమిటి రసికబాబూ! ఏం చేయమంటారో మీరే చెప్పండి! ఏమి మాట్లాడటానికి నేను వారికి దగ్గరగా వెళ్ళాలో కూడా ఆలోచించలేకపోతున్నాను."

"ఆలోచిస్తూ కూర్చుంటే అసలేమీ ఆలోచించనే లేరు. ఏమీ ఆలోచించకుండా ముందుకు సాగండి, మాటలు వాటంతటవే వస్తాయి."

"లేదు రసికబాబూ! నేనలా మాట్లాడలేను, ఏమి మాట్లాడాలో మీరే చెప్పండి."

"ప్రపంచంలో ప్రళయం వచ్చే మాటలేమీ మాట్లాడరు. దగ్గరగా వెళ్ళి 'అబ్బా, ఈమధ్య ఇంత వేడిగా ఉంటుందేమిటి' అని అనండి అదిచాలు."

"అవును, వేడిగానే ఉంది అని ఆమె అంటుంది. ఆ తరువాత నేనేమి మాట్లాడాలి?"

పూర్ణబాబు సలహా సంప్రదింపులు అంతటితోనే ఆగిపోయాయి. అదేసమయంలో శ్రీశబాబు, విపినుడు లోనికి వచ్చారు.

శ్రీశుడు లోనికి రాగానే చంద్రబాబుకు, నిర్మలకు నమస్కరించి, తరువాత నిర్మలనుద్దేశించి "మీ ఉత్సాహము గడియారముకంటె ముందు నడుస్తుంది. చూడండి, ఇప్పటికింకా ఆరున్నర కాలేదు" అని అన్నాడు.

"నేను మీ సంఘంలో చేరిన మొదటిరోజు కావటం వల్ల సమావేశం ప్రారంభమయ్యే దానికంటె ముందుగా

వచ్చాను-సమయానికివచ్చి క్రొత్తకావటంవల్ల సిగ్గుపడుతూ దూరంగా కూర్చునే దానికంటె ముందుగావచ్చి మీ అందరితో పరిచయం చేసుకోవటం మంచిదికదా!" అంది నిర్మల.

ఆమె మాటలువిని విపినుడు ఇలా అన్నాడు-"మీరు సిగ్గుపడుతూ దూరదూరంగా ఉంటే లాభంలేదని సవినయంగా మనవి చేస్తున్నాను. నేటినుండి మీరు మా అందరి భారాన్ని స్వీకరించారు; లక్ష్మీహీనులమగు ఈ పురుష సభ్యులను అనుగ్రహంతో చూడండి, నేము చెప్పేదివిని, మీ ఆదేశముతో మమ్మల్ని నడపండి."

"పూర్ణబాబూ మీరుకూడా ఏదైనా మాట్లాడండి" అని అన్నాడు రసికదాదా.

"ఏం మాట్లాడను?" అని మెదలకుండా ఊరుకున్నాడు పూర్ణ.

"మిమ్మల్నందరినీ నడపగల సామర్థ్యము నాలో లేదు" అని అంది నిర్మల విపినబాబుకు జవాబుగా.

"అయితే నేము అంత చలనంలేని వాళ్ళమని మీరు అనుకొంటున్నారా?" అని అడిగాడు శ్రీశుడు.

విపినుడు అతని మాటకు అడ్డొస్తూ నిర్మలతో ఇలా అన్నాడు— "ఇనుముకంటె చలనంలేని వస్తువు మరేముంటుంది. కాని అగ్ని ఇనుమునుకూడా నడిపించగలుగుతుంది— అత్యంత భారమైన మావంటి వస్తువుల్ని నడిపించటానికి మీవంటి దీప్తికావాలి."

"వింటున్నారా పూర్ణబాబూ?" అని అడిగాడు రసికదాదా ఇటు పూర్ణవైపు తిరిగి.

"ఏం చెప్పమంటారు, మీరే చెప్పండి" అని అన్నాడు పూర్ణబాబు.

"ఇనుమును నడిపించాలనుకున్నా అగ్ని కావాలి, ఇనుమును కరిగించాలనుకున్నా అగ్ని కావాలి అని మీరు అనండి" అన్నాడు రసికదాదా పూర్ణబాబుతో.

"ఏం పూర్ణబాబూ, రసికచక్రవర్తిగారితో మీకు మంచిపరిచయం కలిగిందనుకుంటాను" అని అన్నాడు విపినుడు.

అవునన్నట్లు తల వూపాడు పూర్ణబాబు. మీ ఆరోగ్యం బాగున్నదా అని విపినుడు అడిగినదానికికూడా అతడు తలవూపటంద్వారానే జవాబు చెప్పాడు.

తరువాత విపినుడు "మీరు వచ్చి చాలాసేపయిందా ?" అని ప్రశ్నించాడు తిరిగి.

"లేదు, ఇంతకుముందే వచ్చాను" అని అన్నాడు పూర్ణ.

"ఈసారి చలి పరుగుపందెములోని గుర్రమువలె వడివడిగా పరుగెత్తి మాఘమాసం మధ్యలోకి వచ్చేసరికి అకస్మాత్తుగా ఆగిపోయినట్లుంది" అని అన్నాడు విపినుడు పూర్ణతో.

"అవును, అలాగే ఉంది" అన్నాడు పూర్ణ.

"ఏం పూర్ణబాబూ, క్రితంసారి మీరు చాలా అనారోగ్యంగా ఉన్నారు– ఇప్పుడు ఆరోగ్యంగా ఉన్నదికదా?" అని అడిగాడు శ్రీశుడు.

పూర్ణ తల వూపాడు.

తరువాత శ్రీశుడు ఇలా అన్నాడు – "ఇంతకాలం మన బ్రహ్మచారి సంఘంలో ఏదో పెద్దవెలితి ఉండేది, అలాంటిది ఇవాళ లోనికి అడుగుపెట్టగానే బంగారు కిరీటానికి మధ్య వెలితిగా కన్పించే వజ్రమును తాపించినట్లు కనుగొన్నాను. మీరేమంటారు పూర్ణబాబూ ?"

"మీకున్నలాంటిరచనాశక్తి నాలో లేదు–నేను మీవలె కల్పనలతో మాటలు తయారుచేయలేను, ముఖ్యంగా స్త్రీల విషయంలో ఒక్కమాటకూడా చెప్పలేను" అని అన్నాడు పూర్ణ.

"మీకా సామర్థ్యము లేదని విని నాకు చాలా దుఃఖంగా ఉంది" అన్నాడు శ్రీశుడు.

"క్రమంగా నేర్చుకొని నేనూ మీ స్థాయికి చేరుకుంటాను" అన్నాడు పూర్ణ.

విపినుడు రసికదాదాను అక్కడినుంచి అవతలికి తీసుకువెళ్ళాడు – "రసికబాబూ, ఆ పిల్లలిద్దరికీ అలాగే యుద్ధం సాగనివ్వండి, మీతో ఒకవిషయం మాట్లాడాలి, ఇలా రండి. చూచారూ, ఆ పుస్తకం విషయాన్నిగురించి మళ్ళీ ఏదైనా ప్రస్తావన వచ్చిందా ?" అని అన్నాడు.

"అపరాధం చేయటం మానవధర్మము, క్షమించటం దేవతధర్మము – అని మీరన్న విషయాన్ని ఏదో సంభాషణలో నేను వారితో అన్నాను –"

"అందుకు ఆమె ఏమన్నది?"

"ఏమీ మాట్లాడకుండా మెరుపుతీగెవలె అక్కడినుంచి వెళ్ళిపోయింది."

"వెళ్ళిపోయిందా !"

"కానీ, ఆ మెరుపులో పిడుగులేదు."

"గర్జన ఉన్నదా?"

"అదికూడా లేదు."

"మరి?"

"ఆమూలనో ఇంకొకమూలనో కొద్దిగా వర్షం పడే సూచనలు కన్పించాయి."

"అంటే దాని అర్థం?"

"ఏమో మహాశయా ! అర్థమూ ఉండవచ్చును, అనర్థమూ కావచ్చును."

"రసికబాబూ, మీరు మాట్లాడేదేమిటో నాకేమీ అర్థం కావటంలేదు."

"ఎలా అర్థం చేసుకోగలుగుతారు– విషయం చాలా నిగూఢమైనది."

విపినుడు, రసికదాదా అవతల దూరంగా నిలబడి మాట్లాడటం శ్రీశునికి ఇష్టంలేదు. లేదా అతడుకూడా రసికదాదాతో మాట్లాడాలనే అనుకుంటున్నాడో, తానుకూడా లేచి వారిదగ్గరకు వస్తూ "ఏమిటా నిగూఢవిషయం?" అని అడిగాడు.

"వర్షము, పిడుగు, మెరుపులు మొదలగువాటిని గురించి" అన్నాడు రసికదాదా.

"ఇంతకంటె నిగూఢమైన విషయం వినదలచినట్లయితే పూర్ణబాబువద్దకు వెళ్ళు విపిన్" అని అన్నాడు శ్రీశుడు.

"నిగూఢవిషయాలు వినాలని నాకు అంతగా ఆసక్తి లేదు" అని చెప్పాడు విపినుడు.

"యుద్ధం చేయటంకంటె సంధి చేసుకునేవిద్య అత్యంత దుర్లభమైనది – అది నీకు తెలుసు. నీకు పుణ్యం ఉంటుంది, వెళ్ళి పూర్ణబాబును శాంతింపచెయ్యి. ఈ లోపల మెరుపులు పిడుగులనుగురించి రసికదాదాతో నేను మాట్లాడుతూఉంటాను" అని చెప్పి శ్రీశుడు విపినబాబును పంపివేశాడు.

తరువాత శ్రీశుడు రసికబాబుతో ఇలా అన్నాడు – "రసికబాబూ, ఆరోజున మీరు నృపబాలనుగురించి చెప్పారు – వారు–వారు–వారినిగురించి కొంచెం వివరంగా చెప్పండి. ఆ రోజున ఆశ్చర్యములమధ్య ఆ మెముఖంలో సుకుమార సుందరతేజస్సును చూచాను, ఆ మెనుగురించి తెలుసుకోవాలని చాలా కుతూహలంగా ఉంది."

"వివరంగా చెపితే మీకు మరింత కుతూహలము కలుగుతుంది. ఇలాంటి కుతూహలము 'హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఎవాభివర్ధతే.' నేను ఆ మెను ఎంతోకాలంగా చూస్తున్నాను, కానీ ఆ కోమల హృదయంలోని స్నిగ్ధ మధురభావము నాకు 'క్షణే క్షణే తన్నవతాముపైతి' "

"వారే, ఆ నృపబాలవిషయమే నేను మిమ్మల్ని అడిగాను."

"మీరు అడిగినది నాకు అర్థమవుతూనే ఉంది శ్రీశబాబూ!"

"వారి విషయమే, ఏ విషయమని అడుగుతాను!

వారిని గురించి ఏ విషయం చెప్పినాసరే, నిన్న ఆమె ఏమన్నారు, ఇవాళ ఉదయం ఏమి చేశారు, మీరు చెప్ప గలిగినంతవరకు చెప్పండి."

రసికదాదా శ్రీశుని చేతిని పట్టుకొని ఇలా చెప్ప సాగాడు—"శ్రీశబాబూ నాకు చాలా సంతోషంగా ఉంది, నిజంగానే మీరు భావకులు—మీరు ఆమెను ఆశ్చర్యముల మధ్య చూచినంత మాత్రాననే ఆమెకు సంబంధించిన పను లేవీ సాధారణమైనవి కావని ఎలా గ్రహించారు! 'రసిక దాదా, లాంతరువత్తిని కొద్దిగా పెద్దది చేయండి' అని ఆమె నాతో అన్నప్పుడు ఏదో కొత్తవిషయం విన్నట్లుగా ఉంటుంది నాకు. మీరు వింటే నవ్వుతారు, ఒకరోజున ఏమి జరిగిందంటే—నేను లోనికి వెళ్ళేసరికి నృపబాల సూదిలో దారం ఎక్కిస్తూఉంది, ఆమెఒడిలో తలగడదిండు ఉంది, నిజంగా నాకు ఆ దృశ్యము ఎంతో ఆశ్చర్యజనకంగా కన్పించింది. నేను ఎన్నోసార్లు శైలరింగుపాపులముందునుంచి వెళ్ళాను, ఎన్నడూ తలెత్తిచూచి ఎరుగను, కానీ..."

"అయితే రసికబాబూ, వారు ఇంటి పనులన్నీ స్వయంగానే చూచుకుంటారా?" అని శ్రీశుడు అడుగుతూ ఉండగా లోనినుంచి శైలబాల అక్కడికి వచ్చింది.

"ఏమిటి శ్రీశబాబూ, రసికదాదాతో మాట్లాడు తున్నారు?" అని అడిగింది.

"ఏమీలేదు, ఏదో సామాన్య విషయాలే" అని అన్నాడు రసికదాదా.

అప్పుడే చంద్రబాబు అక్కడ చేరినవారితో "సభా

కార్యక్రమం ప్రారంభించవలసిన సమయమయింది, ఇక ఆలస్యం చేయటం మంచిదికాదు పూర్ణబాబూ, వ్యవసాయ విద్యాలయమునుగురించి నేను మీతో చెప్పిన తీర్మానమును ప్రవేశపెట్టండి" అని అన్నాడు.

పూర్ణబాబు లేచి నిలబడి జేబు గడియారపు గొలుసును లాగుతూ "నేడు..... నేడు....." అంటూ ప్రారంభించాడు.

రసికదాదా వచ్చి అతనిప్రక్కకుర్చీలోనే కూర్చొని మృదుస్వరంతో "నేడు మన సభాకార్యక్రమానికి..." అని అందించాడు.

పూర్ణబాబు ఆ వేమాటలు మాట్లాడి మళ్ళీమాటల కోసం తడుముకోసాగాడు.

"ఒక నూతన సౌందర్య గౌరవాలు లభించినందుకు ..." అని రసికదాదా మళ్ళీ అందించాడు.

తిరిగి అంతవరకు మాట్లాడి పూర్ణబాబు ఆగగానే రసికదాదా "అభినందించకుండా ఉండలేకపోతున్నాను" అని అందించాడు.

ఈవిధంగా రసికదాదా చెప్పినంతవరకేతప్ప పూర్ణబాబు అంతకుమించి ఏమీ మాట్లాడలేకపోతున్నాడు. ఏదైనా మాట్లాడాలని ప్రయత్నిస్తే మాటలు తడబడుతున్నాయి.

అప్పుడు రసికచక్రవర్తి లేచి నిలబడి ఇలా చెప్పసాగాడు— "సభాధ్యక్షా, నాదొక చిన్న విన్నపము. ఇవాళ పూర్ణబాబు ఇతర సభ్యులకంటె ముందుగానే ఇక్క-

డికి వచ్చారు. చాలా అనారోగ్యంగా ఉన్నప్పటికీ ఉత్సాహంకొద్దీ రాకుండా ఉండలేకపోయారు. ఇవాళ మన సమావేశంలో మొట్టమొదటిసారిగా అరుణోదయ మయింది. ఆ దృశ్యమును చూచుటకై పక్షులగుంపు ప్రత్యూషకాలమందే తమతమగూళ్ళను వదలి బయలు దేరాయి. కానీ దేహము రోగగ్రస్తమైఉంది, అందువల్ల పూర్ణబాబులో తమహృదయంలోని ఉత్సాహాన్ని వ్యక్తం చేయగల శక్తిలేదు—కనుక ఇవాళ్టికి వారిని మనము వదలి వేయటం మంచిది."

ఈవిధంగా రసికదాదా పూర్ణబాబు గౌరవాన్ని కాపాడాడు. పూర్ణబాబు ఉత్సాహాన్ని గురించి గొప్పగా వర్ణించి చెప్పాడు. పూర్ణబాబు ఇక ఏమీ మాట్లాడకుండా కూర్చున్నాడు. రసికచక్రవర్తికూడా సంతృప్తిగా నిట్టూర్చి కూర్చున్నాడు.

అప్పుడు చంద్రబాబు లేచినిలబడి ఇలా చెప్పసాగాడు— "కొంతకాలంగా పూర్ణబాబు ఆరోగ్యం బాగా లేదనే విషయం నాకు తెలుసు, ఇలాంటి పరిస్థితిలో వారికి మనము కష్టం కలిగించకూడదు. ముఖ్యంగా ఇప్పుడు నేను చెప్పదలచిందేమంటే అబలాకాంతబాబు ఇంటిలో కూర్చునే మన సంఘ కార్యక్రమాన్ని చాలా ముందుకు నడిపించారు. భారతదేశంలో వ్యవసాయాన్నిగురించి ఇంత వరకు జరిగిన కృషిని గురించి ప్రభుత్వము ప్రకటించిన రిపోర్టులన్నింటిని నేను అబలాకాంతబాబుకు ఇచ్చాను— వాటిలో క్షేత్రగణిత సంబంధమైన అంశములన్నింటినీ

సంఘీ ప్తపరచి అబలాకాంతబాబుగారు ఒకనోట్సు తయారు చేశారు — దాని ఆధారంతో ఈ విషయాలు సామాన్య ప్రజలకుకూడా అర్థమగునట్లు సులభశైలిలో వారొక గ్రంథ మును వ్రాయుటకు సిద్ధముగా ఉన్నారు. ఎంతో ఉత్సా హంతో, అంతకుమించిన సామర్థ్యముతో వీరు మనసంఘ కార్యక్రమములలో సహకరించి కృషిచేసినందుకు మనము వీరిని అభినందించాలి. యూరోపుదేశాలలోని విద్యార్థి వసతిగృహాల నియమాలను, వాటి కార్యపద్ధతులను సేక రించే బాధ్యతను విపినబాబు స్వీకరించారు, స్వేచ్ఛగా దాన ధర్మములు చేయుటవలన లండను మహానగరములో ఎన్నో విచిత్రమైన ప్రజాహితకార్యాలు జరిగాయి—వాటి వివరములు సేకరించి దానినిగురించి ఒక వ్యాసము వ్రాయు బాధ్యతను శ్రీశబాబు స్వీకరించారు. ఇంతవరకు వారు ఆ పనిని పూర్తిచేసినట్లు లేదు. నేనుకూడా ఒక పరిశోధనలో నిమగ్నమైవున్నాను — మన దేశంలో ఎడ్లబండ్లు ఎలా తయారుచేయబడుతున్నాయో అందరికీ తెలిసిన విషయమే. వాటి వెనుకవైపున బరువు వేయగానే పైకి లేస్తుంది, ఎడ్ల మెడకు తగిలించే పట్టెడలు గొంతుకు బిగుసుకుపోయే ప్రమాదం ఏర్పడుతుంది. అకస్మాత్తుగా ఎద్దు ముందుకు గనుక పడిపోతే బండి వాటిమీదకే పడుతుంది—ఇలాంటి ప్రమాదాలు జరగకుండా సురక్షితంగా ఉండేబండిని తయారుచేయటానికి నేను కృషిచేస్తున్నాను, నా కృషి ఫలి స్తుందనే ఆశకూడా ఉంది. మనము గోసంరక్షణను గురించి ఎన్నో విషయాలు మాట్లాడతాము, వాటియందు ఎంతో

దయవున్నట్లు, పూజాభావాన్నికూడా వ్యక్తంచేస్తూ ఉంటాము. కానీ ఆచరణలో అకారణంగా వాటికి అనేక బాధలు కలిగిస్తూఉంటే మనము చూస్తూ ఊరుకుంటాము. ఆ విషయంలోకూడా నేను పశువులయజమానులను కలుసుకొని చర్చలు జరుపుతున్నాను. అకస్మాత్తుగా వచ్చే జబ్బులకు ప్రాథమిక చికిత్సచేయుటనుగురించి డా॥ రామరతన్ గారివద్ద మా నిర్మల విషయాలన్నీ నేర్చుకొన్నది. నాగరిక కుటుంబాలవారికి ఆ చికిత్సావిధానమును నేర్పే కార్యక్రమాన్ని ఆమె ప్రారంభించింది. ఈ విధంగా మన సంఘములోని ప్రతి సభ్యుడు ఏదోఒక కార్యక్రమాన్ని చేపట్టి నిర్వహించాలి. సామాన్యప్రజలలో మన సంఘమునకు ప్రాముఖ్యత లేకపోయినప్పటికీ క్రమంగా మనము తప్పక సఫలత పొందగలుగుతాము."

శ్రీశుడు ఇటు తిరిగి "మిత్రమా విపిన్, నేను ఇంత వరకు నా పనిని ప్రారంభించనే లేదు" అని అన్నాడు.

"నా పరిస్థితికూడా అదే" అన్నాడు విపిన్.

"కానీ, ప్రారంభించాలి."

"నేనూ ప్రారంభించాలి."

"కొద్ది రోజుల వరకు ఇతర ఆలోచనలన్నీ మానక పోతే సాధ్యం కాదు."

"నేనూ అదే ఆలోచిస్తున్నాను."

"కానీ అబలాకాంతబాబును అభినందించి తీరాలి_ వారు ఈ పనులన్నీ ఎప్పుడు చేస్తున్నారోకూడా అర్థం కాదు."

"అదే చాలా ఆశ్చర్యంగా ఉంది. అంటే దీనివల్ల వారు పరధ్యానంగా ఉండటానికి మరేదో ప్రత్యేక కారణం ఉందని అర్థమవుతుంది."

"వెళ్ళి ఒకసారి వారితో మాట్లాడి వస్తాను" అని శ్రీశుడు అక్కడినుండి అబలాకాంతబాబు కూర్చున్న చోటుకు వెళ్ళాడు.

ఇటు అదే సమయంలో పూర్ణబాబు రసికదాదాతో మాట్లాడుతూ ఉంటాడు.

"రసికబాబూ, మిమ్మల్ని ఎలా అభినందించాలో తెలియటంలేదు" అన్నాడు పూర్ణబాబు.

"మీరు ఏ విధంగానూ అభినందించ నవసరంలేదు. నేను అర్థం చేసుకోగలను. కానీ అందరూ నా మాదిరిగానే ఉండరు పూర్ణబాబూ—మాట్లాడితేనే అర్థం చేసుకుంటారు కాని ముఖభావాన్ని చూచి గ్రహించలేరు."

"మీరు నా హృదయంలోని విషయాన్ని గ్రహించారు రసికబాబూ—మీరు ఉండటంవల్ల నేనివాళ బ్రతికి పోయాను. మనసులోని మాటలను బయటకు చెప్పలేక పోతున్నాను. అందుకు నాకేదైనా సలహా చెప్పండి."

"ముందు మీరు ఆమెవద్దకువెళ్ళి ఏదో ఒకటి ప్రారంభించి మాట్లాడుతూ ఉండండి."

"అదుగో చూచారా, అబలాకాంతబాబు ఆమె వద్దనే కూర్చుని ఉన్నారు—"

"కూర్చోనివ్వండి, నలువైపులనుంచి ఆమెను చుట్టు

ముట్టి కూర్చోలేదు గదా! అబలాకాంతబాబు ఏమీ వ్యాహాన్ని పన్నలేదు. మీరుకూడా వెళ్ళి ఒక ప్రక్కన నిలబడండి!"

"సరే, వెళతాను" అంటూ పూర్ణబాబు నిర్మల వద్దకు వెళతాడు.

పురుష వేషంలో ఉన్న శైలబాల, నిర్మల ఏదో మాట్లాడుతూ ఉంటారు.

శైలబాల నిర్మలతో ఇలా అంటూ ఉంది— "మీరు అలా అంటే నేను అంగీకరించను. మీరు నాకంటె ఎక్కువగా పనిచేశారు - పాపం, పూర్ణబాబును చూస్తూ ఉంటే నాకు చాలా విచారంగా ఉంది. మీరువస్తారని తెలిసి ఇవాళ వారు చాలా ఉత్సాహంతో వచ్చారు, కానీ తమ మనస్సులోని ఉత్సాహాన్ని వ్యక్తం చేయలేకపోవటంవల్ల వారికి. చాలా నిరుత్సాహం కలిగింది. మీరు ఒకసారి వారిని......"

కానీ నిర్మల ఈ విషయాన్ని విన్పించుకోకుండా సంఘకార్యక్రమాన్ని గురించి, ఇకముందు చేయవలసిన కృషిని గురించి శైలబాలతో చర్చించింది. చివరికి ఆమె శైలబాలతో "మిగిలిన సభ్యులందరిలో మీరు నాకేదో ప్రత్యేకంగా కన్పిస్తున్నారు. మిమ్మల్ని ఒక్కరోజు చూచే సరికే మీరు ఈ కృషిలో నాకు ఎంతో సహాయపడగల వ్యక్తులని అర్థం చేసుకున్నాను" అని అంది.

"అది నా అదృష్టం" అని అంది శైలబాల. తరువాత

పూర్ణబాబు అటే రావడం గమనించి "రండి, రండి పూర్ణ బాబూ, మీ మాటే అనుకుంటున్నాము, కూర్చోండి" అంటూ అతనిని ఆహ్వానించింది.

అదే సమయంలో శ్రీశుడుకూడా అక్కడికివచ్చి "అబలాకాంతబాబూ, మీతో ఒక విషయం మాట్లాడాలి, ఒకసారి ఇటు వస్తారా" అని శైలబాలను పిలిచాడు.

శైలబాలలేచి శ్రీశునివెంట వెళ్ళింది. పూర్ణబాబు నిర్మల ప్రక్కనే ఒక కుర్చీలో కూర్చున్నాడు.

శైలబాలతో కలిసి శ్రీశుడు నాలుగడుగులు వేసి "ఇవాళ మీరిద్దరూ ఎంతో కాలంగా సంఘంలో సభ్యులుగా ఉన్న మా ముగ్గురికీ చక్కని గుణపాఠం నేర్పారు; నిజంగా మిమ్ములను చూచి మేము చాలా సిగ్గుపడాలి. ఉరకలు వేస్తూ కొత్తనీరు వచ్చినప్పుడే పాతనీరులోకూడా చలనం కలుగు తుంది" అని అన్నాడు.

"అలాగే కొత్త అమ్మాయిలతో అగ్ని ప్రజ్వరింప చేయటానికి పాత అమ్మాయిలుకూడా అవసరమవుతారు."

"సరే, ఆ విషయం తరువాత మాట్లాడదాము. ఇంతకూ ఆరుమాలు ఏం చేశారు? అది పోవటంవల్ల నాకు ఇహలోకమేగాక పరలోకప్రాప్తికూడా ఉండదు. ఆ రుమా లును ఇంకెప్పుడు పోగొట్టుకోను, దానికి బదులుగా డజను పట్టు రుమాళ్లు తెచ్చాను, వాటిని తీసుకొని ఆ రుమాలును నాకిప్పించండి. అంతమాత్రాన ఆ రుమాలు విలువను వీటితో పోల్చుతున్నానని మాత్రం అనుకోవద్దు."

"మహాశయా, ఈ మోసమును గ్రహించగల తెలివిని ఆ సృష్టికర్త నాకివ్వలేదు. ఈ కానుకలు మీరు నాకోసం తీసుకు రాలేదు, మీరు ఎవరి రుమాలును దొంగిలించారో వారికి వీటిని నాద్వారా..."

"అబలాకాంతబాబూ, భగవంతుడు చాలా తెలివితేటల నిచ్చాడనేది కన్పిస్తూనేఉంది, కానీ మీలో దయాగుణము కొంచము తక్కువగా ఉన్నట్లుంది—ఈ అభాగ్యునికి ఆ రుమాలును తిరిగి ఇచ్చివేస్తే మీకు నిర్దయులనే పేరు కూడా రాకుండా ఉంటుంది."

"సరే, నేను దయ చూపిస్తాను — కానీ మీరు సంఘ కార్యక్రమములో ఒక వ్యాసము వ్రాయవలసివుంది, ఆ బాధ్యతను మాత్రము మీరు తప్పక నెరవేర్చాలి."

"తప్పకుండా వ్రాస్తాను — ఆ రుమాలు లభించిందంటే ఇక మరుక్షణంనుంచి నిశ్చింతగా నాపని చూచుకుంటాను—అప్పుడు ఇతర వ్యాపకాలుమాని సత్యాన్వేషణలోనే పూర్తికాలాన్ని వినియోగిస్తాను."

ఇటు శైలబాలకు, శ్రీశునికి సంభాషణజరుగుతున్న సమయంలోనే అటు మరొకవైపున విపినుడురసికదాదాతో మాట్లాడుతున్నాడు.

"తెలిసిందా రసికబాబూ, పాటలను ఎన్నిక చేయటంలో ఆమెకున్న చాతుర్యమునుచూచి నాకు చాలా ఆశ్చర్యము కలిగింది. పాటలు ఎవరో వ్రాశారు, వాటిలో కవిత్వంకూడా ఉంటుంది. కానీ వాటిని ఎన్నికచేయటంలో

వ్యక్తమైన కవిత్వములో ప్రత్యేక అందం ఉంది" అని అన్నాడు విపినుడు.

"మీకు చెప్పినది యదార్థనే, ఎన్నికచేయు సామర్థ్యనే సామర్థ్యము. లతలకు పుష్పాలు ఉండటం సహజనే. కానీ వాటిని మాలగాకట్టడంలోనే ఆ నైపుణ్యము, అందము ఉన్నాయి."

"రసికదాదా మీకు ఆ పాట గుర్తున్నదా? దాని భావం చెపుతాను వింటారా— 'నా నావ మునిగిపోతూ ఉంది. ఏ రాతికి తగిలిందో, ఎంతమాత్రము సంబాళించుకో లేకుండా ఉన్నాను. ఇప్పుడిప్పుడే కొత్తగా నీటిలోకి వదిలాను, ప్రవాహం మధ్యకుకూడా వెళ్ళలేదు, ఒడ్డువెంటే ఎంతో వయ్యారంగా నడుస్తూవున్న నా నావ మునిగి పోతూ ఉంది; అలలమీద తేలియాడుతూ ముందుకు సాగి పోతూవుంది; గాలివాలుకు రెపరెపలాడు తెరచాప నా మనస్సుకెంతో ఆనందాన్ని కల్గిస్తూ ఉంది. కానీ, ఆ ఆనందం ఎంతోసేపు లేదు, నా నావ మునిగిపోతూవుంది. ఆకాశం ఎంతో నిర్మలంగా ఉంది, ఎక్కడా మబ్బులు కూడా లేవు. నవవసంతము వచ్చినట్లే కన్పించింది. అంతలోనే నా ఆశలన్నీ నిరాశలుచేస్తూ ప్రళయం ముంచుకొచ్చింది, నా నావ మునిగిపోతూ ఉంది' ఇదే ఆ పాట యొక్క భావము."

"మునిగిపోవటమా, అదేమిటి విపినబాబూ?"

"మునిగిపోనివ్వండి, కానీ అది మునిగేప్రదేశం ఏదో

మాత్రం తెలుసుకోవాలి. రసికబాబూ, ఆమె ఈ పాటను ఎందుకు వ్రాసుకున్నదంటారు?"

"స్త్రీహృదయంలోని రహస్యాన్ని ఆ సృష్టికర్త కూడా తెలుసుకోలేడు—ఇక అల్పుడగు ఈ రసికచక్రవర్తికి ఎలా సాధ్యమవుతుంది?"

ఇంతలో శ్రీశుడు వారిదగ్గరకువచ్చి "మిత్రమా విపిన్. నువ్వొకసారి చంద్రబాబువద్దకు వెళ్ళు. నిజంగా మనము మనకర్తవ్యమును నెరవేర్చటంలో చాలా నిర్లక్ష్యం చేశాము—ఒకసారి వారితో మాట్లాడితే వారికికూడా సంతోషంగా ఉంటుంది" అని చెప్పి విపినబాబును అక్కడి నుంచి చంద్రబాబువద్దకు పంపుతాడు.

విపినుడు తిరిగివచ్చేలోపల రసికదాదాకు, శ్రీశునికి సంభాషణ జరుగుతుంది.

"ఇంతకుముందు ఆమె ఏదో కుట్టుపని చేస్తున్నట్లు చెప్పారుగదూ! అంటే ఇంటిపనులన్నీ ఆమె స్వయంగా చూచుకొంటుందా?" అని అడిగాడు శ్రీశుడు.

అవునన్నట్లు రసికదాదా తలవూపాడు.

"ఆమె ఒడిలో తలగడదిండు ఉంది, ఆరోజున ఇంకా మీరు చూచిందేమిటి......"

"ఆమె తలవంచుకొని సూదిలో దారం ఎక్కిస్తూ ఉంది."

"సూదిలో దారంఎక్కిస్తూఉంది. బహుశా అప్పుడే స్నానంచేసి వచ్చివుంటుందేమో!"

"అప్పుడు సాయంత్రం మూడుగంట లయింది."

"అయితే ఆమె మంచంమీదకాకుండా చాపమీద కూర్చొని సూదిలో దారంఎక్కిస్తూ ఉంటుంది."

"అవునవును ఆమె సూదిలో దారంఎక్కిస్తూఉంది" అని పైకి "ఇక మీతో వాగలేనుబాబూ" అని మనసులో అనుకున్నాడు రసికదాదా.

శ్రీశుడు ఆనాడు ఆమెకూర్చున్న ఫ్రూహాచిత్రాన్ని గురించి వర్ణించి చెప్పసాగాడు. ఇంతలోనే విపినుడు తిరిగి వచ్చి శ్రీశునితో "చంద్రబాబుగారు నీతో ఏదో మాట్లాడా లంటున్నారు" అని చెప్పాడు. శ్రీశుడు అయిష్టంగానే వెళతాడు. అప్పటికే పూర్తిగా విసిగిపోయిన రసికచక్ర వర్తి మళ్ళీ విపినుడు రావటంచూచి "ఇక నేను మీతో వాగలేను" అని మనసులోనే అనుకున్నాడు.

అటు పూర్ణ నిర్మలవద్దకు వెళ్ళి కూర్చోగానే ఆమె "ఇవాళ మీ ఆరోగ్యం సరిగా లేనట్లుంది" అని అంది.

"లేదు, బాగానే ఉంది—అన్ను అంతబాగా లేదు—అయినా—మీ ఆరోగ్యం బాగున్నదికదా?" అని పూర్ణ దగ్గసాగాడు.

"మీరు...మీరు ఒకనాడు...అడిగారు...మీరు... మీరు...మీకు మిల్టన్ ఆరియోపాజిటికా...అది మనకు ఎం. ఏలో ఉందనుకుంటాను... అది మీకు అంతగా నచ్చలే దనుకుంటాను..." అని అన్నాడు పూర్ణమాటలకు తడుముకొంటూ.

"నే నసలు అది చదవనేలేదు" అని అంది నిర్మల.

"చదవలేదా? అదే...మీరు...ఇవాళ ... చాలా వేడిగా ఉంది ... నే నొకసారి ... రసికబాబు ... రసిక బాబుతో...మాట్లాడాలి..." అంటూ పూర్ణ అక్కడి నుంచి లేచి వెళ్ళిపోతాడు.

ఇక్కడ విపినుడుమాత్రము రసికబాబును వదలి పెట్టలేదు.

"రసికబాబూ, ఇంతకుముందు నేను భావార్థము చెప్పిన పాటను ఆమె ఆలోచించే వ్రాసిందంటారా? ఆ పాటలో 'నావ' అనేదానిని గురించి మీ రేమని ఆలోచిస్తున్నారు?"

"అక్కడ 'నావ'అనేది హృదయమేనని నాఉద్దేశ్యం, అయితే నావకుతగిలిన ఆ రాయిఎవరో, పాషాణం ఎవరో అనేవిషయాలు ఆలోచించాలి" అన్నాడు రసికదాదా.

నిర్మలవద్దనుంచి పూర్ణ అక్కడికివచ్చి "విపినబాబూ, క్షమించాలి—రసికబాబుతో అర్జంటుగా నే నొకవిషయం మాట్లాడాలి...మీ కేమీ అభ్యంతరం లేకపోతే..." అన్నాడు.

"అలాగే, దానిదేముంది, మాట్లాడండి" అంటూ విపినుడు అవతలికి వెళ్ళాడు.

అప్పుడు పూర్ణబాబు రసికదాదాతో "నావంటి బుద్ధిహీనుడు ప్రపంచంలో మరెవరూ లేరు" అని అన్నాడు.

"తాము తెలివికలవాళ్ళమని అనుకునేవారు మీకంటే ఎక్కువ బుద్ధిహీనులు—అంటే నాలాంటివాళ్లు."

"ఏకాంతంలో మీతో చాలావిషయాలు మాట్లాడా లనుకుంటున్నాను. సమావేశం ముగిసిన తరువాత రాత్రికి మీరు నాకా అవకాశాన్ని కలిగించగలరా? వెన్నెలరాత్రి, చెరువుగట్టున కూర్చొని మాట్లాడుకోవచ్చును."

పూర్ణమాటలు విని రసికబాబుకు వణుకు పుట్టు కొచ్చింది. 'చావు దగ్గరకొచ్చిందే, అని అనుకొన్నాడు మనసులో. ఇంతలో శ్రీశుడుకూడా అక్కడికివచ్చి "రసిక దాదా, రాత్రికి మీతో కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి, రాత్రి చూచారుగదా, ఇంటిదగ్గరకంటె ఏ రోడ్డుమీదనో కూర్చొని మాట్లాడుకోవటం హాయిగా ఉంటుంది" అని చెప్పి వెళ్ళిపోయాడు.

"అవును నాయనా, హాయిగానే ఉంటుంది. చలి కూడా హాయిగానే ఉంటుంది, తరువాత వచ్చే దగ్గు హాయి గానే ఉంటుంది. తరువాత ప్రాణంపోయినా హాయిగానే ఉంటుంది" అని అనుకున్నాడు రసికదాదా.

మధ్యమధ్య ఎవరూలేనప్పుడు పూర్ణ నిర్మలతో మాట్లాడవలసిన విధానాన్నిగురించి, సంభాషణ ఎలా ప్రారంభించాలి అనే విషయాన్నిగురించి రసికదాదాతో చర్చిస్తూనే ఉన్నాడు.

వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ విపినుడు వారివద్దకు వచ్చి "ఇప్పుడు మీరు పూర్ణబాబుతో మాట్లాడుతున్నారుగదా! రాత్రికి వెన్నెలలో అలా రోడ్డువెంట షికారుకు బయలు దేరి మాట్లాడుకుందాం, ఏమంటారు రసికదాదా! సరేనా?" అని చెప్పి వెళ్ళిపోయాడు.

"ఇప్పుడు హాయిగానే ఉంటుంది, ఆ తరువాత ఉంటుంది నా తిప్పలు" అని అనుకున్నాడు రసికదాదా తనలోతాను.

ఇటు శైలబాల, నిర్మల ఇంకా ఏదోవిషయం చర్చిస్తూనే ఉన్నారు. మధ్యలో పూర్ణబాబు నిర్మలతో మాట్లాడాలని మరొకసారి ప్రయత్నించి మాట్లాడలేక నిరాశతో తిరిగివచ్చేశాడు.

# 9

అక్షయబాబు గృహము. తల్లివెంట యాత్రలకు వెళ్ళిన పురబాల తిరిగివచ్చింది. అక్షయకుమార్ తన గదిలో కూర్చొనివుంటాడు. పురబాలకూడా అక్కడేఉంది.

"దేవీ, ఒకప్రశ్న అడుగుతాను, కోపంరాదుగదా!" అని అన్నాడు అక్షయబాబు.

"ఏమిటో చెప్పండి, విందాం."

"విరహవేదన అనే పదార్థము మహాకవి కాళిదాసుతోపాటే సహగమనం చేసిందా? నీశరీరంలో దుర్బల చిహ్నలేమీ కన్పించటం లేదు."

"అందుకు మీరే నిదర్శనము. మీలోకూడా అంత మార్పేమీ వచ్చినట్లు లేదుగదా!"

"ఎలా వస్తుంది. ముగ్గురు మరదళ్ళు మూడువైపుల చేరి ఎక్కడ కందిపోతానో అని అతిజాగ్రత్తగా శ్రద్ధతీసుకున్నారు. ఎంత విరహవేదన అనుభవించినా అందుకనే ఏమీ తగ్గలేదు" అనిచెప్పి అక్షయబాబు అంతకుముందు

తాను అనుభవించిన విరహవేదనను గురించి ఒక పాట పాడాడు.

భార్యాభర్తలిద్దరూ ఇలాంటివిషయాలే మాట్లాడుకొంటూ ఉన్నారు. ఇంతలో "అక్కా" అంటూ నృపబాల, నీరబాల అక్కడికి వస్తారు.

"ఈ ప్రపంచంలో కృతజ్ఞత అనేదే లేకుండా పోయింది. ఇప్పుడు అక్కగారుతప్ప మరెవరూ కన్పించనే కన్పించరు. మీ అక్క విరహాగ్నిలో దహించుకుపోతున్నప్పుడు ఆమెకు ఏదైనా ఉపశాంతి చేశారా?" అని అన్నాడు అతియబాబు.

అందుకు నీరబాల ఇలా అంది — "వింటున్నావా అక్కా! అన్నీ అబద్ధాలే! నువ్వు లేనప్పుడు ఒక్కసారి కూడా మమ్మల్ని పిలిచి ఏమీ అడగలేదు—ఎప్పుడు చూచినా ఉత్తరాలు వ్రాసుకొంటూ వుండేవాడు లేదా రెండుకాళ్ళు బల్లమీదచాచి పుస్తకం చదువుతూ ఉండేవాడు. ఇప్పుడు నువ్వు వచ్చినతరువాత మామీద పాటలు పాడుతున్నాడు, ఎగతాళి చేస్తున్నాడు—"

"అక్కా, నువ్వుకూడా మాకు ఒక ఉత్తరమైనా వ్రాయలేదు" అని అంది నృపబాల.

"నాకు తీరికెక్కడ! అమ్మకు కావలసినవి చూడటంతోనే సమయమంతా గడచిపోయేది" అని చెప్పింది పురబాల.

"ఎంత అన్యాయం! మాటమాత్రానికైనా 'మీ

బావగారినిగురించిన ఆలోచనతోనే తీరిక ఉండేది కాదు' అని చెప్పకూడదా!" అని అన్నాడు అక్షయబాబు.

"ఆమాట అంటే బావగారిని పట్టపగ్గాలే ఉండవు. ముఖర్జీమహాశయా, మీరు బయటగదిలోకి వెళ్ళరాదూ! అక్క చాలాకాలానికివచ్చింది, మేము మాట్లాడుకోవాలి" అని అంది నీరబాల.

"దుర్మార్గురాలా, ఇప్పటికే విరహాగ్నిలో దహిం చుకుపోతున్న మీ అక్కను ఇంకా దహించివేయాలను కుంటున్నావా? మీ బావరూపంలోవున్న శ్రీకృష్ణుని దర్శనభాగ్యమనే కుంభవృష్టితో ప్రియురాలి హృదయమనే లతలు చిగురించాలి..."

"కప్పల బెకబెకలు విన్పించాలి..." అంటూ నీర బాల వెక్కిరించింది.

అక్షయబాబు వర్ణన పూర్తికాకముందే శైలబాల కూడా వచ్చింది.

"ఉత్తమాధమ మధ్యమా దయచేయుము, మీ ముగ్గురూ లేకపోతే..." ఇని ఇంకా ఏదో అనబోయాడు. నీరబాల మళ్ళీ అతని మాటలకు అడ్డొస్తూ వెక్కిరించింది.

నృపబాల, నీరబాలలతో శైలబాల "చెల్లీ మీరు వెళ్ళండి, మేము మాట్లాడుకోవాలి" అని చెప్పింది.

అక్షయబాబు వారివైపుచూచి నవ్వుతాడు. నీర బాల, నృపబాల అతనిని వెక్కిరిస్తూ వెళ్ళిపోతారు.

నృపబాల, నీరబాలల వివాహవిషయంలోనే శైల బాల బావగారితోనూ, అక్కగారితోనూ మాట్లాడటానికి

వచ్చింది. ఇద్దరు యువకుల్ని చూడటం జరిగిందనీ, ఒక విధంగా సంబంధం ఖాయమైనట్లేననీ, అయితే వరులిద్దరూ అమ్మాయిల్ని చూచినతరువాతనే స్థిరపర్చుకుంటారని శైలబాలకు తెలిసింది. ఆ విషయం నిజమేనని చెప్పింది పురబాల. ఏదోవిధంగా వాళ్ళిద్దరి వివాహమూ జరిగిందనిపిస్తే తన తల్లికి నిశ్చింతగా ఉంటుందని పురబాల ఉద్దేశ్యము. తొందరపడేదానికంటె మంచిచెడ్డలు ఆలోచించి అమ్మాయిలకు నచ్చిన సంబంధాలు చేయాలని శైలబాల వాదన. అతుయబాబుకూడా శైలబాలవాదననే బలపర్చుతున్నాడు. వాళ్ళముగ్గురికీ ఈ విషయాన్నిగురించే తర్జనభర్జన జరుగుతూ ఉంది. ఇంతలో జగత్తారిణీదేవికూడా అక్కడికి వచ్చి అతుయబాబుతో "బాబూ అతుయ్, అబ్బాయి లిద్దరినీ వచ్చి చూచుకోమని కబురుపంపాలి. వారికి మన ఇంటి అడ్రసు వగైరాకూడా తెలియజేయండి" అని చెప్పింది.

"దీనికంటె రసికదాదాను పంపితే వెంటబెట్టుకునే తీసుకువస్తాడుగదా" అని అన్నాడు అతుయబాబు.

"ఆ పని నెరవేరినట్లే! మీ రసికదాదా తెలివితేటలే చెప్పుకోవాలి! ఒకరిని తీసుకురావటానికి బదులు మరొకర్నికూడా తీసుకువస్తారు" అని అన్నది జగత్తారిణీదేవి.

"అమ్మా, ఆ విషయాన్నిగురించి నువ్వు నిశ్చింతగా వుండు. వాళ్ళను పిలిపించే ఏర్పాట్లన్నీ చూచే బాధ్యత నాది" అని పురబాల తల్లికి ధైర్యంచెప్పింది.

"అమ్మాయీ, అన్నీ నువ్వే చూచుకోవాలి. ఈ కాలపు కుర్రాళ్ళకు ఏమికావాలో, వాళ్ళ అభిరుచులేమిటో

అలాంటివేమీ నాకు తెలియవు" అని జగత్తారిణీదేవి పెద్ద కుమార్తె పురబాలతో చెప్పింది.

అన్నీ సానుకూలమయ్యేట్లు చూడమని అతుయబాబుతో కూడా మరొకసారి చెప్పి జగత్తారిణి బయటకు వెళ్ళిపోయింది.

తల్లి వాళ్ళిద్దరికీ వెంటనే వివాహాలుచేయాలనే పట్టుదలతో ఉంది, అదీగాక అదృష్టంలో ఎలావుంటే అలా జరగకమానదనే పురబాల అభిప్రాయము.

అతుయబాబు కల్పించుకొని ఏదో మాట్లాడబోయాడు కానీ 'మీ మాటలు నాకేమీ బోధపడటంలేదు' అంటూ పురబాల అతని మాటలను త్రోసేసింది. శైలబాల అక్కకు వ్యతిరేకంగా ఏమీ మాట్లాడలేదు. పురబాల లోనికి వెళ్ళిపోయింది. అదేసమయంలో బయటి నుండి రసికచక్రవర్తి ప్రవేశించాడు.

"రసికదాదా, జరిగినదంతా విన్నారుకదా! చాలా చిక్కులోపడ్డాను" అని అంది శైలబాల.

"ఏం, ఏమిటా చిక్కు? బ్రహ్మచారిసంఘములోని బ్రహ్మచర్యానికి ఏలోపమూ రాలేదు, ఇటు నీరూ నృపల సమస్య తీరింది, అన్నీ సవ్యంగానే జరిగాయిగదా!" అని అన్నాడు రసికదాదా.

"ఏమీ జరగలేదు" అని అంది శైలబాల.

"ఇదేమిటి, నా విషయంలో మేలేజరిగింది—ఇద్దరు ఆధునికులతో కలసి రాత్రులందు రోడ్లమీద నిలబడి శ్లోకాలుచదివే బాధ తప్పింది" అన్నాడు రసికచక్రవర్తి.

"ముఖర్జీమహాశయా, రసికదాదా మీ మాట విని పించుకునేస్థితిలో లేడు—మీరే ఏదోవిధంగా వారికి నచ్చ చెప్పాలి" అంది శైలబాల అత్రేయబాబుతో.

"రసికదాదాకు యువతులమాటే వేదవాక్యమని భావించి నడచుకునే వయస్సు మించిపోయింది. అందుకనే ఆ వయస్సునుబట్టి వారు ఎదిరించి మాట్లాడటానికి సాహసిస్తున్నారు" అని శైలబాలతో చెప్పి, అత్రేయబాబు రసిక చక్రవర్తివైపు తిరిగి "రసికదాదా, మనం బయటగదిలోకి వెళ్ళి హుక్కాత్రాగి పడుకుందాంరండి" అంటూ లేచాడు.

# 10

విపినుడు తనగదిలోకూర్చొని తంబురమీద సంగీత సాధనచేస్తున్నాడు. అతని ప్రక్కనే సంగీతగురువు గురుదాసుకూడా కూర్చొని వున్నాడు. విపినుడు కంఠస్వరము కర్ణకఠోరముగా ఉంది.

విపినుడు ఏదో గుర్తొచ్చినట్లు మధ్యలోనే పాటను ఆపి బ్రతిమాలుతూ గురుదాసుతో ఇలా అన్నాడు—"మిత్రమా గురుదాసూ, నీకు సంగీతములో మంచి ప్రావీణ్యముంది. నువ్వు నాకు తప్పకుండా ఈమాత్రం సహాయం చేయాలి. ఈ పుస్తకములోని పాటలన్నిటికీ స్వరములు తయారుచేయాలి. ఇంతకుముందు నువ్వు పాడిన ప్రేమ గీతముయొక్క స్వరము చక్కగా కుదిరింది. ఏదీ, మళ్ళీ ఒకసారి ఆ పాట విన్పించు—ఆ పాట నా హృదయంలో

హొత్తుకుపోయింది, నా మానససరోవరంలోని పద్మమై తానే వీణాపాణియై ధ్వనిస్తుందా పాట—ఆహా!"

గురుదాసు మరొకసారి ఇంతకుముందు పాడిన ప్రేమ గీతాన్ని పాడి విన్పిస్తాడు. విపినుడు పాటవింటూ మైమరచి పోయాడు. పాట ఆగిపోయింది. అతడు పరవశత్వమునుంచి పూర్తిగా తేరుకోలేదు. ఇంతలో నౌకరువచ్చి "ఎవరో బాబుగారు వచ్చారు" అని చెప్పాడు.

"ఎవరా బాబుగారు?"

"ఎవరో వృద్ధులు!"

"బట్టతలా?"

"అవునండి."

విపినుడు తంబుర ప్రక్కనపెట్టి నౌకరుతో ఇలా అన్నాడు—"వారిని త్వరగా తీసుకురా; ముందు హుక్కా ఇచ్చి వెళ్ళు. ఇదుగో, త్వరగా వెళ్ళి తీపి తాంబూలాలు బాగా కట్టించుకురా. త్వరగా రావాలి, వచ్చేప్పుడు అలాగే అర్ధ శేరు ఐస్ కూడా తీసుకురా, తెలిసిందా?"

నౌకరు తెలిసినట్లు తలాడిస్తూ వెళ్ళిపోయాడు.

బయటినుంచి ఎవరో వస్తున్న అడుగుల చప్పుడు విని విపినుడు "దయచేయండి, దయచేయండి రసికబాబూ!" అన్నాడు.

కానీ వచ్చిన మనిషి రసికచక్రవర్తికాదు. అతడు శ్రీ వనమాలి భట్టాచార్య.

విపినుడు అటు చూడకుండానే "రసికబాబూ" అని తలెత్తిచూచి "అరే, మీరు వనమాలి"అని అన్నాడు.

"అవునండీ, నేనే శ్రీవనమాలి భట్టాచార్య."

"ఇప్పుడా పరిచయాలేమీ అవసరంలేదు. నేను ఒక ముఖ్యమైన పనిలో మునిగివున్నాను."

"అమ్మాయి లిద్దరినీ ఎంతకాలమని ఇంట్లో ఉంచుకుంటారు—వేరే ఇంకా చాలా సంబంధాలు ఉన్నాయి..."

"చాలా సంతోషం ... అదే చేయండి, వేరే చూడండి..."

"కానీ మీ సంబంధమైతేనే బాగుంటుందని..."

"వనమాలి మహాశయా, మమ్మల్ని గురించి మీకు ఇప్పటివరకు పూర్తిగా తెలియదనే చెప్పాలి...మమ్మల్ని గురించి మీకు తెలుసుకుంటే మా సంబంధాన్ని గురించి మీకు అనేక భయంకర సందేహాలు కలుగుతాయి."

"అయితే నేను వెళ్ళొస్తాను, మీ రేదో పనితొందరలో ఉన్నట్లున్నారు, మళ్ళీ కలుస్తాను" అంటూ వనమాలి భట్టాచార్య వెళ్ళిపోతాడు.

విపినుడు తంబురతీసుకొని మళ్ళీ సంగీతసాధన ప్రారంభిస్తాడు. అప్పుడే శ్రీశుడు అక్కడికివచ్చి ఆశ్చర్యంగా చూస్తూ "ఇదేమిటిరా విపిన్, ఇదేమిటి! కుస్తీలుపట్టడం మానేసి తంబుర పట్టుకున్నావేమిటి? గురుదాసుగారూ!" అని అన్నాడు.

"గురుదాసుగారు మా సంగీతగురువు. ఇవాళ శలవు రోజుగదా! ఏంచేయమంటావు? సంగీతం నేర్చుకోనట్లయితే నీ సన్యాసులమతంలో చేరటానికి వీల్లేదు. అందుకని

గురుదాసుగారిని గురువుగా భావించి వీరివద్ద నవీన సన్యాస వ్రతదీక్ష పొందుతున్నాను" అన్నాడు విపినుడు.

"ఇంతకూ, ఇదేమిటి?" అని అడిగాడు శ్రీశుడు.

"పూర్తిగా రసభరితమైనప్పుడే త్యాగబుద్ధికూడా సులభంగా అలవడుతుంది. మేఘములు జలభరిత మైనప్పుడే వర్షము కురుస్తుంది" అన్నాడు విపినుడు.

"అబ్బాయీ, నీ నవీన ఫిలాసఫీని అలా వుంచు, ఇంతకూ నువ్వు ఆ వ్యాసమునుగురించి ఏదైనా ప్రారంభించావా లేదా?"

"లేదు మిత్రమా, ఇంతవరకు ప్రారంభించనేలేదు. నీ వ్యాసం పూర్తయిందా?"

"మన పరిస్థితికూడా అదే మిత్రమా, కానీ చాలా అన్యాయం జరుగుతుంది. క్రమంగా మనము మన సంకల్పాన్నుంచి దూరమైపోతున్నట్లుగా ఉంది."

"అనేక సంకల్పాలు పిల్లకప్పతోకవలె వృద్ధిచెందిన కొద్దీ వాటంతటవే అంతర్ధానమై పోతాయి. కానీ తోక అలాగే ఉండి కప్ప ఎండిపోతే అదెలా ఉంటుంది! ఒకసారి ఒకటి సంకల్పించుకున్నాము, అంతమాత్రాన ఆసంకల్పము కోసమని మనము కృశించి ప్రాణత్యాగము చేయటంలో అర్ధమేమీ లేదనే నా అభిప్రాయం."

"నేనలా అనుకోవటం లేదు. ఒకటి సంకల్పించుకున్నతరువాత దానికోసము కృశించి ప్రాణత్యాగము చేయటమే శ్రేయస్కరము, అలాంటి సంకల్పాలు అనేకం ఉన్నాయి. ఫలములులేని చెట్టుమాదిరి మన శాఖలమీద

ప్రతిరోజూ మోతాదునుమించి మంచు పేరుకున్నట్లుగా శృంగారాదుల సంచారము ఎక్కువై పోతూ ఉంది, మనము కృతకృత్యుల మవుతామనేఆశ రోజురోజు మనకు దూరమై పోతుంది. నావల్ల పెద్ద పొరపాటు జరిగింది మిత్రమా— గొప్పకార్యాలను సాధించటానికి తపస్సు చేయాలి, భోగ విలాసాలకు దూరంగా ఉండాలి, ఎలాంటి ఆకర్షణలకు లోనుకాకూడదు. అలాంటి నిగ్రహశక్తిని అలవర్చుకోకుండా ఉత్తమ కార్యసాధనకు ఏమీ చేయలేము — ఇకనుంచి పూర్తిగా శృంగారచర్చనుమాని కార్యసాధనకు కృషి చేయాలని ప్రతిజ్ఞచేస్తున్నాను."

"నేనూ నువ్వు చెప్పినదానిని అంగీకరిస్తాను. కానీ నీవు వృక్షజాతులన్నీ ఫలములను ఇవ్వవు—అలాంటప్పుడు వ్యర్థంగా కృశించి ప్రాణాలర్పించటమేకాని ఫలములురావు కదా! మనము స్వీకరించిన సంకల్పము మనవల్ల నెరవేర దని ఎందుకో కొంతకాలంగా నేననుకొంటున్నాను—కనుక మన స్వభావానికి అనుకూలమైన మరొకమార్గాన్ని దేనినైనా అవలంబించటం మంచిది."

"ఇవి అంత ఉపయోగమైన విషయాలు కావు, ముందు నీ తంబుర అవతల పారెయ్యి..."

"అలాగే పారేస్తాను, దీనివల్ల ఈ ప్రపంచానికేమీ హానికలుగదు."

"చంద్రబాబుగారి ఇంటినుంచి మన సంఘాన్ని లేపేద్దాం—"

"అదీ మంచిదే..."

"మనిద్దరమూ కలసి రసికబాబును నిగ్రహంతో ఉంచుదాము."

"వారొక్కరే మనిద్దరి నిగ్రహాన్ని చెడగొట్ట లేదుకదా!"

"మీరేదో నిగ్రహశక్తినిగురించిమాట్లాడుతున్నారు, కనుక ప్రస్తుతం నాతో ఏమీ అవసరంలేదుగదా?" అని అన్నాడు గురుదాసు మధ్యలో వారిమాటలకు అడ్డొస్తూ.

"అదేంమాట, అప్పుడే మీ అవసరం మరింత ఎక్కువ. ఎండఎంత తీవ్రంగాఉంటే మంచినీళ్ళుకూడాఅంత ఎక్కువ అవసరమవుతాయి. ఇలాంటి కష్టకాలంలో నువ్వు మమ్మల్ని-వదలి వేయవద్దు...ఉదయము,సాయంత్రము తప్ప కుండా నీ దర్శనభాగ్యము కలిగించాలి. ఈలోపల రెండో పాట స్వరము కుదిరితే సాయంత్రంచూద్దాం" అనిఅన్నాడు విపినుడు.

"అలాగే చేద్దాం" అంటూ గురుదాసు లేచి వెళ్ళి పోతాడు.

అదేసమయంలో నౌకరువచ్చి ఒక వృద్ధుడు వచ్చా డని చెప్పాడు. మళ్ళీ వనమాలే వచ్చివుంటాడని విపినుడు భయపడ్డాడు. అదే సందేహాన్ని అతడు శ్రీశునితో చెప్పాడు. అంతకుముందే వనమాలి శ్రీశునివద్దకుకూడా వెళ్ళాడట. అతనిని లోనికిరానివ్వటంకంటె బయటినుంచే పంపివేయటం మంచిదని విపినుడు నౌకరుతో అదేసంగతి చెప్పాడు. కానీ శ్రీశునికి ఆవిధంగా చేయటం ఇష్టంలేదు. ఇప్పుడు పంపితే మళ్ళీ వస్తాడు. కనుక దానికంటె లోనికి పిలిపించి తమ

వద్దకు మరెప్పుడూ రావద్దని చెప్పాలనుకున్నారు. అతనిని లోనికి తీసుకురమ్మని నౌకరుతో చెప్పారు.

నౌకరు బయటకు వెళ్ళిన మరుక్షణంలో రసికచక్రవర్తి లోనికి వచ్చాడు.

అతనిని చూచి విపినుడు ఆశ్చర్యపడుతూ "ఇదేమిటి, వనమాలి కాదన్నమాట! రసికబాబు వచ్చారు" అని అన్నాడు.

"అవును మహాశయా—మీ గ్రహణశక్తి చాలా ఆశ్చర్యకరమైనదిసుమా—నేను వనమాలిని కాదు. 'ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలీ'..."అనిఅన్నాడు రసికచక్రవర్తి.

"వద్దు, వద్దు రసికబాబూ! ఇవన్నీ ఇకనుంచి వద్దు. మేము శృంగారాదులనుగురించి మాట్లాడటం మానేశాము" అని చెప్పాడు శ్రీశుడు.

"అయితే నేను బ్రతికిపోయాను" అన్నాడు రసికచక్రవర్తి.

"ఇతర ఆలోచనలన్నీ త్యజించి ఇకనుంచి మేము ఏకాగ్రచిత్తముతో బ్రహ్మచారిసంఘ కార్యక్రమములో నిమగ్నమైపోవాలని నిశ్చయించుకున్నాము" అన్నాడు శ్రీశుడు.

"నా కోర్కెకూడా అదే" అన్నాడు రసికదాదా.

"పిల్లలతండ్రియగు నీలమాధవబాబుగారి అమ్మాయిలిద్దరినీ మేము వివాహమాడాలని అడగటానికి శ్రీ వనమాలి భట్టాచార్య వచ్చారు. మేము వారిని వెంటనే సాగ

నంపాము—ఇప్పు డావిషయాలుకూడా అసంగతంగానే కన్పిస్తున్నాయి" అని అన్నాడు శ్రీశుడు.

"నాకూ అలాగే అనిపిస్తుంది. ఆ వనమాలిగారు ఇద్దరినేగాక ఇంకా అంతకంటె ఎక్కువమందినే వివాహ మాడారని నావద్దకువచ్చి అడిగినా వారు నిరాశతోనే వెళ్ళి పోతారు" అన్నాడు రసికదాదా.

"రసికబాబూ, ఇవాళ మీరు ఇక్కడ ఫలహారం చేసివెళ్ళాలి" అని అన్నాడు విపినుడు.

"వద్దు మహాశయా, ఇవాళ ఏమీ వద్దు, మీతో నేను ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలని వచ్చాను; కానీ మీ ప్రతిజ్ఞ విన్నతరువాత అది చెప్పటానికే సాహ సించలేకపోతున్నాను."

"అయ్యయ్యో, ఎంతమాట! దానినిగురించి మీరు చెప్పకుండా మానివేయటం ఎందుకు?" అని విపినుడు ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

"మేము మీరు అనుకున్నంత భయంకరమైన మను ష్యులం కాదు. మీరు నాతో చెప్పదలచిన విషయం ఏమిటి?" అన్నాడు శ్రీశుడు.

"నీతో కాదేమో, రసికబాబు ఆరోజున నాతో ఏదో ముఖ్యమైన విషయం మాట్లాడాలని అన్నారు" అన్నాడు విపినుడు.

"వద్దువద్దు, ఇక ఆ విషయాన్ని వదిలేయండి" అన్నాడు రసికదాదా.

"ఇవాళ రాత్రికి చెరువువద్దకు వెళదామంటారా?" అని అడిగాడు శ్రీశుడు.

"క్షమించండి శ్రీశబాబూ, ఏమీవద్దు."

"విపిన్, రసికబాబు నీ ఎదుట చెప్పటానికి సందేహిస్తున్నట్లున్నారు, నువ్వొకసారి ఆ గదిలోకి వెళ్ళు."

"వద్దు, అలాంటిదేమీ వద్దు."

"అయితే, మనం పైకి వెళదాం రండి, శ్రీశుడు ఇక్కడే కూర్చొని వుంటాడు."

"వద్దు, మీరిద్దరూ ఇక్కడే ఉండండి, నేను వెళ్ళిపోతాను."

"అదెలా? మీరు ఫలహారం చేయకుండా వెళ్ళటానికి వీల్లేదు."

"మీరు వెళ్ళడానికి వీల్లేదు."

"అయితే, నేను చెప్పదలచిన విషయాన్ని చెపుతాను. నీరబాల, నృపబాల విషయం ఇంతకుముందేమీరు విన్నారుగదా!..."

"విన్నాము ... అయితే నృపబాల విషయంలో ఏదైనా..."

"నీరబాలనుగురించి ముఖ్యమైన ..." అన్నాడు విపినుడు.

"వాళ్ళిద్దరినిగురించే ఇప్పుడు పెద్దచిక్కొచ్చిపడింది."

నృపబాల, నీరబాలల తల్లి జగత్తారిణీదేవి కాశీయాత్రనుంచి తిరిగిరాగానే అకస్మాత్తుగా ఇద్దరు పనికిమాలిన యువకుల్నిచూచి అమ్మాయిలిద్దరి వివాహము

చేయ నిశ్చయించింది. కానీ ఇది అమ్మాయిలిద్దరికీ ఎంత మాత్రం ఇష్టంలేదని రసికదాదా వారితో చెప్పాడు.

అది చాలా అన్యాయమన్నాడు శ్రీశుడు. ఘోరం, ఘోరాతిఘోరం అన్నాడు విపినుడు. అమ్మాయిల జీవితాలను దుఃఖభాజనం చేయనివ్వకూడదని శ్రీశుడన్నాడు. వాళ్ళ జీవితాలను సంతోషంగా కళకళలాడే నందనవనాలుగా మార్చాలన్నాడు విపినుడు. యువకులిద్దరూ ఎంతో బాధనూ, సానుభూతినీ, వ్యక్తంచేశారు. ఇందుకు తరుణోపాయం ఏమిటా అని ముగ్గురూ ఆలోచించసాగారు. ఎల్లుండి శుక్రవారంరోజున వాళ్ళిద్దరూ అమ్మాయిల్ని చూడటానికి వస్తున్నారనీ, అందుకే ఏమీ తోచకుండా ఉందని రసిక చక్రవర్తి చెప్పాడు.

"వాళ్ళిద్దరినీ ఇంటివరకు రానివ్వకుండా దారిలోనే పట్టుకొని తన్నితరిమేస్తే ఎలావుంటుం దంటారు?" అని అన్నాడు విపినుడు.

"మంచిదే, కానీ భగవంతుని సృష్టిలో పనికిరాని వస్తువులే శాశ్వతంగా ఉంటాయి—ఇద్దర్ని తరిమేస్తే రేపు పదిమంది వస్తారు" అన్నాడు రసికదాదా.

కనుక అది మంచిదికాదు. మరేమి చేయాలనేదే ఇప్పుడు ప్రశ్న. ఏదోఒకటి ఆలోచించి నిర్ణయించటానికి కూడా ఎక్కువ వ్యవధిలేదు.

"నాకొక ఉపాయం తోస్తుంది. రసికదాదా మీ ఇంట్లోవా రెవరైనా ఆ యువకుల్ని ఇంతకుముందు చూచారా?" అని అడిగాడు శ్రీశుడు.

"ఇంతవరకు వాళ్ళనెవరూ చూడలేదు, వాళ్ళకు ఇంటి చిరునామా కూడా తెలియదు" అని చెప్పాడు రసికదాదా.

"మరీ మంచిది. విపినుడు ఏదోవిధంగా వాళ్ళను అక్కడికి చేరుకోకుండా దారిలోనే కలుసుకొని ఆపివేస్తే నేను వారి పేరుతో వెళ్ళి నృపబాలను..." అని శ్రీశుడు పూర్తిగా చెప్పకముందే విపినుడు మధ్యలో అడ్డొస్తూ—"నేను అంత చురుకైనవాడిని కాదని నీకు తెలుసు, నేను వాళ్ళను ఆపలేను, ఆ పనేదో నువ్వేచేస్తే నేనే వారి పేరుతో వెళ్ళి నీరబాలను..." అంటూ ఏదో చెప్ప బోయాడు.

"మహాశయా, ఒక్కరు వెళ్ళినందువల్ల అక్కడ పని జరుగదు. వచ్చేది ఇద్దరు. ఒక్కరినే తీసుకువెళ్ళి ఇద్దరిని నమ్మించగల సామర్థ్యము నాకు లేదు" అన్నాడు రసిక దాదా.

అయితే మరేమిచేయాలి? శ్రీశుడు, విపినుడు ఇద్దరూ వాళ్ళ పేర్లతో అక్కడికి చేరుకోవాలి. వచ్చే వాళ్ళిద్దరినీ తప్పుమార్గంపట్టించి వాళ్ళను రాకుండాచేసే పనిని ఎవరు చూస్తారు? ఆ పనిని రసికచక్రవర్తి తాను చూస్తానని చెప్పాడు. విపినుడు, శ్రీశుడు పెళ్ళికుమారులుగా అక్క డికి వెళ్ళటానికి సంతోషంగా అంగీకరించారు.

నృపబాల, నీరబాలల దైన్యరూపము, వారీవివాహ వార్తవిని కన్నీరు మున్నీరుగా విలపిస్తున్న దృశ్యమును వూహించుకొని శ్రీశుడు, విపినుడు ఆ విషయాలను గురించి ఎన్నోప్రశ్నలు అడగసాగారు.

రసికదాదా మరొకరివద్దకు వెళ్ళకుండా ఈ విష యంలో తమవద్దకే వచ్చినందుకు శ్రీశుడు అతనిని అభినం దించాడు.

ఇలాంటి సమయాలలోనే నిస్వార్థంగా వ్యవహరించా లని అన్నాడు విపినుడు.

పైకి స్పష్టంగా చెప్పలేకపోయినప్పటికీ, శ్రీశుడు, విపినుడు ఈ విధంగా జరిగినందుకు చాలా సంతోషపడ సాగారు. వాళ్ళ హృదయాలు ఆనందంతో తేలిపోతు న్నాయి. రసికదాదా వారిపాలిట దేవునివలె కన్పించ సాగాడు. అతనివల్లనే తమ మనస్సులలోని కోర్కె తీరే అవకాశం కలిగింది. ఒకరు అతనికి తాంబూలం అందిస్తే మరొకరు తలగడా అందించారు. మరొకరు ఫలహారాన్ని గురించి ఏర్పాటుచేస్తుంటే మరొకరు శీతలపానీయాన్ని తెచ్చి అతనిముందుంచారు. వీటితో రసికచక్రవర్తి ఉక్కిరి బిక్కిరై త్వరగా ఇక్కడినుండి బయటపడాలని ఆలోచిం చాడు. అతడు వచ్చినపని నెరవేరింది. ఇక ఇక్కడ తాను ఉండవలసిన అవసరంకూడా లేదు.

"మహాశయా, ఇప్పుడు నాకేమీ వద్దు, క్షమిం చండి. నేను వెంటనే వెళ్ళాలి" అన్నాడు రసికదాదా.

"ఎందుకు?"

"ఏంపని?"

"ఆ యువకుల్ని తప్పుమార్గంపట్టించే విషయాన్ని గురించి ఆలోచించాలి."

"నిజమే, అయితే వెళ్ళిరండి."

"అవునవును, ఆలస్యంచేయటం మంచిదికాదు."

# 11

చంద్రబాబుగారి గదిలో నిర్మల కిటికీవద్ద కూర్చొని ఏదో చూస్తూవుంటుంది. ఇంతలో వెనుకనుంచి చంద్రబాబు ప్రవేశించి నిర్మలనుచూచి అక్కడే ఆగిపోతాడు. నిర్మల అనవసరంగా సంఘములోచేరి కఠోరవ్రతపాలనకు పూనుకున్నదనీ, కొద్దిరోజులనుండి ఆమె ఎందుకో విచారంగా ఉంటుందనీ, అయినా స్త్రీలు ఇలాంటివి భరించలేరనీ అతడు ఆలోచించసాగాడు. నిర్మలమీద అతనికి జాలి కలిగింది.

"నిర్మలా!" అని పిలిచాడు.

నిర్మల త్రుళ్ళిపడి ఇటుచూచి "ఏమిటిమామయ్యా!" అని అడిగింది.

"ఆ వ్యాసాన్నిగురించే ఆలోచిస్తున్నావా? మరీ అంత అధికంగా ఆలోచించకు, ఒకటి రెండురోజులు మనసుకు కాస్త విశ్రాంతినిస్తే తరువాత ఎక్కువ శ్రమలేకుండా వ్రాయగలుగుతావు."

నిర్మల సిగ్గుపడుతూ ఇలా అంది—"నేనింకాపూర్తిగా ఆలోచించనేలేదు మామయ్యా! నే నిప్పటికే వ్యాసాన్ని ప్రారంభించి ఉండవలసింది, కానీ కొద్దిరోజులనుంచీవీస్తున్న ఈ దక్షిణపుగాలి చాలా వేడిగా ఉంటుంది. మనస్సును

పనిమీద కేంద్రీకరించలేకపోతున్నాను. ఇక ఎంతమాత్రం ఆలస్యం చేయను, ఇప్పటికే..."

"లేదు, లేదు. బలవంతంగా ప్రయత్నించవద్దు. నిర్మలా, ఇంట్లో నీకెవరూ తోడులేరు, ఒక్కదానివే వుంటున్నందువల్ల విసిగిపోతున్నావేమో ననిపిస్తుంది నాకు. ఒక పని చేయాలంటే ఒకరిద్దరి సహకారము, సహవాసము చాలా అవసరము..."

"అబలాకాంతబాబు నాకు చాలా సహాయం చేస్తానని వాగ్దానంచేశారు. నేను వారికి ఇంగ్లీషులోవున్న ఒక వైద్యగ్రంథాన్నిచ్చి చికిత్సావిధానాన్నిగురించి చిన్న వ్యాసం వ్రాసివ్వమని అడిగాను—ఒకఅధ్యాయాన్ని సంక్షిప్తంగా ఇవాళే వ్రాసిపంపుతామని చెప్పారు. ఇప్పుడు పంపుతారు, అందుకోసమే నేను ఎదురుచూస్తూ కూర్చున్నాను."

"ఆ అబ్బాయి చాలా మంచివాడు, ఉత్సాహవంతుడు, నిరంతర పరిశ్రమచేయు వ్యక్తి."

"నిజమే మామయ్యా, చాలా అందంగా ఉంటాడు, వినయవిధేయతలు గలవాడు."

"మన సమావేశాలలో మంచి తీర్మానమేదైనా వచ్చినప్పుడు అతడు చూపించే ఉత్సాహానికి నాకే ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది."

"అంతేకాదు. వారిని చూస్తేనే మనసులోని మాధుర్యమంతా ముఖంలోనేస్పష్టంగాకన్పిస్తూఉంటుంది."

ఇంత స్వల్పపరిచయంలోనే అతనియందు తనకు కలిగిన సదభిప్రాయాన్ని, స్నేహభావాన్నిగురించి చంద్ర

బాబు చెప్పాడు. అతనిని తను యింటివద్దనే ఉంచుకొని అతని చదువు వగైరాలకయ్యేఖర్చులన్నిటినీ తానే భరించాలనే అభిప్రాయం కలిగినట్లుకూడా ఆమెతో చెప్పాడు.

అందుకు నిర్మలకూడా తన అంగీకారాన్ని తెలియచేసింది. ఆవిధంగా జరిగితే అతని సహాయంతో తాను ఇంకా ఎక్కువ పనిచేయగలననికూడా ఆమె అన్నది.

ఇంతలో నౌకరు ఒక కవరు తెచ్చి చంద్రబాబుచేతి కందించాడు. అది అబలాకాంతబాబు తనకు పంపిన వ్యాసమేనేమోనని నిర్మల అది తనదేనని మామగారితో చెప్పింది.

"కాదమ్మా, ఇది నా ఉత్తరమే. అబలాకాంతబాబు వ్రాసినదికాదు. పూర్ణబాబు వ్రాసిన ఉత్తరము" అని చెప్పాడు చంద్రబాబు.

ఆ మాటవిని నిర్మలకు చాలా నిరాశకలిగింది. చంద్రబాబు అదేమీ గమనించలేదు, కవరుచించి వారు ఉత్తరమును పైకి చదవసాగారు—

"గురుదేవా, మీ చరిత్రము అత్యున్నతము, మీ మనోబలము అసామాన్యమైనది; అలాంటి మీరు మానవ దుర్బలత్వమును క్షమాదృష్టితో చూడగలరు; ఇది ఆలోచించే నేను మీకు ఈ ఉత్తరమును వ్రాయటానికి సాహసిస్తున్నాను."

"ఏమిటిదంతా! పూర్ణబాబు బ్రహ్మచారిసంఘాన్ని వదలివేస్తారేమో! ఇదంతా చూస్తే అలాగే వుంది, దానికే ఈ భూమిక వ్రాసినట్లుంది. మనం కొంచెం శ్రద్ధగా పరిశీ

లించిచూస్తే ఈమధ్య వారు సంఘకార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొనలేకపోతున్నారు" అని అంది నిర్మల.

"ఆ తరువాత వ్రాసినదికూడా విను" అని చంద్రబాబు తిరిగి ఉత్తరమును చదవసాగారు—

"గురుదేవా, మీరు మాముందిడిన ఆదర్శము సర్వోత్కృష్టమైనది, మేము చేపట్టిన బాధ్యత చాలా కష్టమైనది. మా ఆదర్శము, బాధ్యతలపట్ల మాకు అమిత భక్తిశ్రద్ధలున్నాయి, కానీ మధ్యమధ్య నేను వాటిని సక్రమంగా నిర్వహించలేకపోతున్నాననే విషయము సవినయంగా తమ ముందు అంగీకరిస్తున్నాను."

నిర్మల అంతవరకు ఉత్తరం విన్న తరువాత "మామయ్యా, గొప్పగొప్ప కార్యాలలో మానవుడు మధ్యమధ్య తాను శక్తిహీనుడనని భావించి నిరాశ చెందుతూంటాడు–అలసిపోయిన మనస్సు అప్పుడప్పుడు చెదిరిపోతుంది, కానీ ఎప్పుడూ అదేవిధంగా వుంటుందా?" అని అడిగింది.

కానీ చంద్రబాబుగారు అందుకేమీ జవాబు చెప్పకుండా తిరిగి ఉత్తరమును చదవసాగారు—"సమావేశము నుండి ఇంటికి చేరుకున్నతరువాత మన కార్యక్రమములోని పనిని దేనినో ప్రారంభిస్తాను, అప్పుడు అకస్మాత్తుగా నేను ఒంటరిగాడననే భావం కలుగుతుంది. అంతవరకు వున్న ఉత్సాహంకాస్తా మొదలు తెగిన లతవలె ఆశ్రయహీనమై దిగజారిపోతుంది." అంతవరకు చదివిన తరువాత "నిర్మలా,

నేనుకూడా ఇదే అన్నానుగదూ!" అని అన్నాడు చంద్ర బాబు.

"పూర్ణబాబు వ్రాసిన మాట యదార్థమే— మనిషికి ఎవరూ తోడులేనప్పుడు కేవలం సంకల్పమువల్లనే ఉత్సాహంగా ఉండటం కష్టమే" అని అంది నిర్మల.

చంద్రబాబు మళ్ళీ ఉత్తరాన్ని చదవసాగాడు—

'నా అనుచిత సాహసమునకు మీరు నన్ను క్షమించండి. నేను అన్నివిధాల ఆలోచించిన తరువాతనే ఈనిశ్చయానికి వచ్చాను—బ్రహ్మచర్యవ్రతమనేది ప్రజాసామాన్యమునకు తగినది కాదు—అది శక్తిని ప్రసాదించదు, శక్తిని హరించి వేస్తుంది. స్త్రీ పురుషులు ఒకరికొకరు తోడునీడలాంటివారు, ఇద్దరు సమిష్టిగా కృషిచేసినప్పుడే ప్రపంచములో ఉపయోగమైన పనులు సాధించబడతాయి."

చంద్రబాబు చదవటం ఆపి దీనినిగురించి నీ ఉద్దేశ్యం ఏమిటి నిర్మలా? అక్షయబాబుకూడా ఈ విషయాన్ని గురించి నాతో చాలా వాదించారు, కానీ వారు అడిగే వాటికి నేను జవాబే చెప్పలేకపోయాను" అని అన్నాడు.

"కావచ్చు, దీనిలో కొంత యదార్థం వుంటే ఉండొచ్చు" అని అంది నిర్మల.

"సంసారబిడ్డలను సన్యాసమతములో చేర్చుటకుబదులుగా గృహస్థాశ్రమములోని ఉన్నత ఆదర్శాలను సాధించుటకు కృషిచేయటనే శ్రేష్ఠమని నా నమ్మకము" అని పూర్ణబాబు తరువాత వ్రాశారు.

"పూర్ణబాబు ఈ విషయంలో నిజమే చెప్పారు" అని అంది నిర్మల ఆ మాటలు విని.

"బ్రహ్మచర్యవ్రతాన్ని అవలంబించే నియమాన్ని తొలగించివేద్దామని కొద్దిరోజులనుంచి నేనూ ఆలోచిస్తున్నాను" అని అన్నాడు చంద్రబాబు.

"ఆ నియమాన్ని తొలగించివేయటంవల్ల వచ్చే నష్టమేమీ ఉండదనే నేనూ అనుకొంటున్నాను; మిగిలినవాళ్లెవరైనా వ్యతిరేకిస్తారంటారా? అబలాకాంతబాబు, శ్రీశబాబు........" అని అంది నిర్మల.

"ఇందులో వ్యతిరేకించవలసినదేముంది?"

"అయినా ఒకసారి అబలాకాంతబాబుగారి అభిప్రాయాన్నికూడా అడిగి తెలుసుకోవటం మంచిది."

"అవును, మంచిదే" అని చంద్రబాబు మళ్ళీ ఉత్తరము చదవసాగాడు—"ఎంత ఆశ్చర్యము! నేను అన్ని విషయాలలోనూ అంధుడనే. ఇప్పటివరకు నేనేమీ అర్థం చేసుకోలేకపోయాను. ఇంతవరకు నేను చెప్పదలచినదేదో నిర్భయంగానే వ్రాశాను, కానీ ఇకముందు నేను చెప్పదలచిన విషయాన్ని వ్రాయటానికి కలం ముందుకు సాగటం లేదు..."

"నిర్మలా, పూర్ణబాబు ప్రవర్తన నీకెప్పుడైనా..." అని చంద్రబాబు మధ్యలోనే ఆపేశాడు.

"అప్పుడప్పుడు వారి ప్రవర్తన నాకేమీఅర్థమయ్యేది కాదు. మామయ్యా, పూర్ణబాబు మీతో ఏదోరహస్యం చెప్పాలనుకొంటున్నారు, పైకి చదువుతారేం?"

"నిజమేనమ్మా" అంటూ చంద్రబాబు మనసు లోనే చదువుకొని "అయినా పూర్ణబాబు చాలా తెలివి గలవాడు, అసలు విషయమేమంటే పూర్ణబాబు వివాహ విషయం ప్రస్తావించారు" అని అన్నాడు.

"మీరు పూర్ణబాబుగారి సంరక్షకులు కాదుగదా! ఆ విషయం మీతో ప్రస్తావించటం ఎందుకు?" అని అడిగింది నిర్మల.

"నేను నీ సంరక్షకుడనేగదా, ఈ ఉత్తరం చదివి చూడు" అని చంద్రబాబు ఉత్తరాన్ని నిర్మలచేతికిచ్చాడు.

నిర్మల ఉత్తరాన్ని చదివి కోపంగా "ఇది జరగదు" అని అంది.

"వారితో ఏమని చెప్పమంటావమ్మా" అని అడిగాడు చంద్రబాబు.

"అదేమీ కుదరదని చెప్పండి."

"నిర్మలా, ఎందుకని? బ్రహ్మచర్యవ్రతాన్ని సంఘ నియమాలనుంచి తొలగించటంవల్ల నష్టమేమీ లేదని నువ్వే అన్నావుగదా!"

"నేను అన్నానుగనుక నేనే పాటించాలంటారా?"

"పూర్ణబాబు అందరిలాంటివాడుకాదు, అంతమంచి వాడు......"

"మామయ్యా, మీరు ఇవేమీ అర్థం చేసుకోలేరు, చెప్పినా అర్థంకాదు...నాకు అవతల పని ఉంది" అని నిర్మల వెళ్ళిపోబోతూ "మామయ్యా, మీ జేబులో అదేమిటి?" అని అడిగింది.

చంద్రబాబు త్రుళ్ళిపడి జేబులోని కాగితమును తీసి ఇస్తూ "అరెరే, మర్చిపోయాను, నౌకరు ఉదయమే దీనిని ఇచ్చి వెళ్ళాడు......" అని అన్నాడు.

నిర్మల గబగబ చంద్రబాబు చేతిలోనుంచి ఆ కాగితములు అందుకొని "మామయ్యా, ఎంత అన్యాయం. అబలా కాంతబాబుగారు వ్యాసం వ్రాసి ఉదయమే పంపారు, వారు మర్చిపోయారని నేననుకున్నాను. ఎంత అన్యాయం జరిగింది!" అని అంది.

"అన్యాయమే జరిగింది. కాని, దీనికంటెకూడా అన్యాయమైన పొరపాట్లు ప్రతిరోజు చేస్తూనేఉంటాను- ప్రతిసారి నువ్వు నాపొరపాట్లను మన్నిస్తూనే ఉన్నావమ్మా" అని అన్నాడు చంద్రబాబు.

ఇంతలో బయటినుంచి రసిక చక్రవర్తి అక్కడికి వచ్చాడు. చంద్రబాబు అతనిని చూచి "ఇదిగో, రసిక బాబు వచ్చారు, మంచిపనే జరిగింది" అని అన్నాడు.

"నేను రాగానే మీకు మేలు జరిగినట్లయితే మీకు జరగటం అత్యంత సులభమన్నమాట. మీరు ఎప్పుడు కోరితే అప్పుడే వస్తాను, మీరు కోరకపోయినా నేను రావటానికి సిద్ధమే" అని అన్నాడు రసికదాదా.

"మన సంఘములోని బ్రహ్మచర్యవ్రత నియమాన్ని ఉపసంహరించాలని ఆలోచించాము- మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు చంద్రబాబు.

"నేను అత్యంత నిస్వార్థభావంతో నా అభిప్రాయాన్ని చెప్పగలను, మీరు ఆ నియమాన్ని ఉంచినా

ఉపసంహరించినా నాకు రెండూ సమానమే, ఉపసంహరించ మనే నా సలహా. లేకపోతే కొంతకాలానికి దానంతటదే రద్దయిపోతుంది. ఒకరోజున మన పేటలోని త్రాగుబోతు రామహరి అందరినీ పిలిచి 'సోదరులారా, నే నిక్కడే పడా లని నిశ్చయించుకొన్నాను' అని చెప్పాడు. నిశ్చయించు కోకపోయినా అతడు అక్కడే పడతాడు! కనుక అతడు దానిని స్థిరపర్చుకొని పడటమే మంచిది."

"మీరు చెప్పినది నిజం రసికబాబూ, ఒక వస్తు వేదైనా జబర్దస్తీగా ప్రవేశించగోరినప్పుడు, దానిని జబర్దస్తీ చేయనివ్వటంకంటె రానివ్వటమే మంచిది. వచ్చే ఆదివారం లోపలే ఈతీర్మానమును అందరిముందుంచాలి."

"మీరు శుక్రవారం సాయంత్రము మా ఇంటికి దయచేయండి. కబురు పంపి నేను అందరినీ అక్కడకే పిలిపిస్తాను" అని అన్నాడు రసికదాదా.

చంద్రబాబు మనదేశములోని గోసంరక్షణను గురించి రసికదాదాతో ముఖ్యమైన విషయాలు అనేకము చర్చించాలనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.

అప్పుడు నిర్మల జోక్యం కల్గించుకొని "రసిక బాబూ, మీతో నేను చాలా విషయాలు మాట్లాడాలి, ఆ గదిలోకి వెళదాం రండి, మామయ్యా, మీరు మీ వ్యాసం వ్రాసుకోండి" అని అంది.

నిర్మల, రసికబాబు ప్రక్కగదిలోకి వెళ్ళారు. వ్యాసము పంపినందుకు నిర్మల అబలాకాంతబాబుకు తన అభినందనాలు అందజేయమని రసికబాబుతో చెప్పింది.

"మీరు అభినందనాలు తెలియజేయకపోయినా వారిని మీరేదైనా కోరితే దానిని పూర్తిచేసి తాను కృతార్థుడనైనట్లు భావిస్తారు" అని అన్నాడు రసికదాదా.

# 12

అక్షయకుమార్ తన గదిలో కూర్చొని పురబాలతో ఏదో మాట్లాడుతూ ఉంటాడు. అదేసమయంలో జగత్తారిణీదేవి గదిలోకివచ్చి ఇలా అంది— "నాయనా అక్షయ్, చూచావా, ఈ పిల్లలతో నేను వేగలేను. నృప ఏడుస్తూ కూర్చుంది, నీరూ కోపంగా ఇల్లంతా తిరుగుతూ ఉంది, తాను ఎంత మాత్రం బయటికి రాననే అంటుంది. పెద్దమనుషులతోపని, ఈపాటికి వస్తూ ఉంటారు. అమ్మాయిల్ని చూపించకుండా ఎలా కుదురుతుంది. ఈచదువులన్నీ చెప్పించి నువ్వే వాళ్ళను దొరసానులుగా తయారుచేశావు, కనుక నువ్వే వాళ్ళను ఏదోవిధంగా ఒప్పించాలి."

ఈ మాట చెప్పి జగత్తారిణీదేవి ఇక అక్కడ నిలబడకుండా వెళ్ళిపోయింది.

"నిజంగా వాళ్ళిద్దరినీ చూచి నాకే ఆశ్చర్యం కలిగింది...ఇంతకూ వాళ్ళేమి ఆలోచిస్తున్నారో..." అంటూ పురబాల ఇంకా ఏదో చెప్పబోయింది.

"నేను తప్ప వాళ్ళకు మరెవ్వరూ ఇష్టం లేనట్లుంది; నీ చెల్లెండ్రుకదూ, వాళ్ళ అభిరుచికూడా నీ అభిరుచి లాంటిదే" అనాడు అక్షయకుమార్.

"మీ ఎగతాళికట్టిపెట్టండి. పరిహాసాలకిది సమయం కాదు. మీరు వాళ్ళను ఒప్పిస్తారా లేదా ముందు అది

తేల్చి చెప్పండి, వాళ్లు మరెవరిమాట వినేట్లులేరు" అని గట్టిపట్టుపట్టింది పురబాల.

"అయితే వాళ్ళిద్దరిని ఒకసారి ఇక్కడికి పంపించు చూద్దాం" అని అన్నాడు అక్షయబాబు.

పురబాల వెళ్ళిన కొద్దిసేపట్లోనే రుసరుసలాడుతూ నృపబాల, నీరబాల గదిలోకి వచ్చారు, లోనికి అడుగు పెడుతూనే "ముఖర్జీమహాశయా, ఇదెంతమాత్రం కుదరదు" అని అంది నీరబాల.

"ముఖర్జీ మహాశయా, మీ కాళ్లు పట్టుకుంటాను. దయచేసి మమ్మల్ని ఈ విధంగా వచ్చినవాళ్ళందరిఎదుట ప్రదర్శింపవద్దు" అని అంది నృపబాల.

అక్షయబాబు నవ్వుతూ ఇలాఅన్నాడు– "వెనుకటికి ఒకడికి ఉరిశిక్ష వేశారట–అయ్యా, నన్ను మరీ ఎత్తుగా వ్రేలాడదీయవద్దు, నాది పైత్యశరీరం, కళ్లుతిరిగి పడిపోతానేమో అన్నాడట వాడు, చూడగా మీరూ అలాగే ఉన్నారు. వివాహం చేసుకోబోతూ వాళ్ళకు కన్పించటానికి సిగ్గెందుకు?"

"మేము వివాహం చేసుకోబోతున్నామని మీతో ఎవరు చెప్పారు" అని కసిరింది నీరబాల.

"ఆహా, మీ ప్రతిజ్ఞచూచి నా ఒడలు పులకించింది. కానీ హృదయం అనేది చాలా దుర్బలపదార్థము, దైవము చాలా శక్తివంతుడు, ఒకవేళ దైవవశాత్తు ప్రతిజ్ఞాభంగము జరిగితే..."అని అక్షయబాబు తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

"ఆ విధంగా ఎన్నటికీ జరుగదు" అని అన్నారు నీరబాల, నృపబాల గట్టిగా నొక్కి పలుకుతూ.

"ప్రతిజ్ఞాభంగం జరుగదుగదూ? అలా అయితే నిర్భయంగా ఉండండి; ఆ యువకులకు మీ దర్శనభాగ్యము కలిగించి వాళ్ళ హృదయాలలో చిచ్చుపెట్టండి-నిర్భాగ్యులు ఇంటికి తిరిగివెళ్ళి ప్రాణాలు వదలుతారు" అని చెప్పాడు అభయబాబు.

"అకారణంగా జీవహింస చేయాలనే ఉత్సాహము మాకులేదు" అని అన్నది నీరబాల.

"ఆహా, జీవులయందు ఎంత దయ! కానీ సామాన్య విషయాన్నిగురించి ఇల్లువదలి వెళ్ళటం దేనికి? మీ అమ్మ అక్కాయి ఎలాగో మిమ్మల్ని వదిలేట్లులేరు, అదీగాక ఇద్దరు పెద్దమనుష్యులు ఎంతో వ్యవప్రయాస కోర్చి వస్తున్నారు, అయిదు నిముషాలు వాళ్ళకు కన్పించినంత మాత్రాన వచ్చే నష్టమేమీ లేదు, తరువాత నేనున్నాను గదా—మీ ఇష్టానికి వ్యతిరేకంగా వివాహం జరగకుండా చూచే బాధ్యత నాది."

"నిజంగా నేనా?"

"నిజంగా నే."

ఇంతలో పురబాల అక్కడికివచ్చి తన చెల్లెళ్ళను చూచి "రండి, రండి ఇక్కడే కూర్చున్నారేమిటి? ముస్తాబవరా?" అని అంది.

"వద్దు" అని అంది నృపబాల.

"పెద్దమనుషుల ఎదుటకు ఇలాగే వెళతారా? నగుబాటుపని" అంది పురబాల.

"మాకు సిగ్గుగానే ఉంటుంది, అలంకరించుకొని వెళ్ళటానికి అంతకంటె ఎక్కువ సిగ్గుగానే ఉంటుంది" అంది నీరబాల.

అందుకు అక్షయబాబు ఇలా అన్నాడు—"పూర్వము పార్వతీదేవి యోగిని వేషంలో పరమేశ్వరుని మనస్సును ఆకర్షించింది; శకుంతల దుష్యంతుని హృదయాన్ని జయించినప్పుడు ఆమె నారచీరలు మాత్రమే ధరించింది, అవి కూడా అక్కడక్కడ చినిగిపోయినవని కాళిదాసు వ్రాశాడు. మీ చెల్లెళ్లుకూడా అవన్నీ చదివి పెద్దవాళ్ళయ్యారు, అందుకనే అలంకరణమీద వీరికి ఆసక్తిలేదు."

"అదంతా సత్యయుగంనాటి విషయాలు. కలియుగంలోని దుష్యంత మహారాజులు అలంకరణను చూచే ఆకర్షింపబడతారు" అని అంది పురబాల.

అక్షయబాబు అలంకరణను గురించి పాటప్రారంభించేసరికి పురబాలకు చిర్రెత్తుకొచ్చింది. నీరబాలను నృపబాలనుతీసుకొని లోనికి వెళ్ళిపోతుంది.

అప్పుడే బయటనుంచి లోనికివస్తాడు. అతనిని చూచి అక్షయబాబు "భీష్మ పితామహా, యుద్ధఏర్పాట్లు పూర్తయ్యాయా?" అని అడిగాడు.

"అన్నీ పూర్తయినట్లే. ఇద్దరువీరులుకూడా వచ్చేశారు."

"దివ్యాస్త్రాలు రెండూ అలంకరించుకొనుటకు

వెళ్ళాయి. అప్పటివరకు మీరు సైన్యాధిపతి బాధ్యతలు వహించండి, నేను చాటున ఉండి చూస్తాను."

"నేను కూడా చాటునే ఉండి చూస్తాను."

రసికచక్రవర్తి, అక్షయబాబుకూడ రాబోవు వీరులకోసం గదిని ఖాళీచేసి చాటుకు వెళ్ళిపోయారు.

బయటినుంచి శ్రీశుడు, విపునుడు ప్రవేశించి చుట్టూ పరిశీలనగా చూస్తూవుంటారు.

"విపిన్, ఈమధ్య నువ్వు సంగీతవిద్యమీద చీత్కార స్వరంతో దండెత్తావు గదా, కొంచెమైనా చేజిక్కించుకున్నావా?" అని అడిగాడు శ్రీశుడు.

"ఏమీలేదు, సంగీతవిద్యాద్వారంముందు నిరంతరము సప్తస్వరాలు పహారా ఇస్తున్నాయి, లోనికి ప్రవేశించగల సామర్థ్యము లేదు నాలో, అయినా ఇప్పుడు నీకు ఈ ప్రశ్న ఎందుకొచ్చింది?"

"ఈ మధ్య నాకుకూడా అప్పుడప్పుడు పాటలకు స్వరకల్పన చేయాలనే కోర్కె కలుగుతూఉంది. కొన్ని పాటలు చదివినప్పుడు దాని సంగీతము నాకు తెలిసినట్లే ఉంటుంది. కానీ పాడలేకపోతున్నాను" అంటూ శ్రీశుడు రెండు మూడు పాటలు పాడి విన్పించాడు.

శ్రీశుడు షెల్ఫులో ఏదో పుస్తకం కోసము వెతుకుతూ ఉంటాడు. విపినునికి ఇవాళ అదేమీ ఇష్టం లేదు. అదే విషయాన్ని అతడు శ్రీశునితో అన్నాడుకూడా. ఇంతకుముందు ఈ గదిలో నృపబాల, నీరబాలలను గురించి రసికబాబుతో జరిగిన సంభాషణను గుర్తుచేసుకొంటూ

ఉంటారు. శ్రీశుడు ఆ విషయాలను చర్చించాలని కుతూహలపడుతూ ఉంటాడు. కానీ విపినునికి అవేమీ ఇష్టంలేదు.

"మిత్రమా, ఇవాళ నాతో ఏమీ వాదించకు, నేను ఓడిపోయాననుకో—ముందు ఆ పుస్తకమును అక్కడఉంచు" అని అన్నాడు విపినుడు.

"అరెరే, మీరు వచ్చి ఒంటరిగానే కూర్చున్నారా—మరేమీ అనుకోవద్దు" అంటూ రసికచక్రవర్తి లోనికి వచ్చాడు.

"అనుకోటానికి ఇందులో ఏముంది గనుక—ఈగృహానే మాతో ఎంతో మర్యాదగా మాట్లాడింది" అన్నాడు శ్రీశుడు.

"మిమ్మల్ని చాలా కష్టపెట్టాను" అన్నాడు రసికదాదా.

"మీరుగాకపోతే మరెవరు కష్టపెడతారు. అలాంటి కష్టమును అనుభవించే సదవకాశము లభించటంవల్లనే కృతార్థుడనయ్యాను" అన్నాడు శ్రీశుడు.

అందుకు రసికదాదా ఇలా అన్నాడు—" ఏదైతేనేం కొద్దిసేపట్లో అన్నీ పూర్తవుతాయి, తరువాత మీరు స్వేచ్ఛగా ఉండొచ్చు. మీరుకూడా ఆలోచించిచూడండి. ఇదే నిజమైనదైతే 'పరిణామే బంధన భయమ్' వివాహమనేది మిఠాయితోనే ప్రారంభమవుతుంది, కానిఅన్ని వేళల అది మధురంగానే ముగియదు, అవన్నీసరే, ఇవాళ మీరు చాలా దిగులుగా ఉన్నారెందుకని? ఏమీ మాట్లాడకుండా కూర్చున్నారేం? నేను హామీ ఇస్తున్నాను, దీనినిగురించి

మీారేమీా భయపడవద్దు. వనములోని స్వేచ్ఛా విహంగాలు మీారు, రెండు లడ్డులు తిన్న తరువాత మీారు హాయిగా ఎగిరి పోవచ్చు, మిమ్మల్నెవరూ బంధించరు, 'నామ వ్యాధశరాః పతంతి పరితో నైవాత్ర దావానలః'— దావానలానికి బదులు మీాకు లేత కొంకాయ నీళ్లు లభిస్తాయి."

"రసికబాబూ, ఆ విషయంలో మాకెలాంటి బాధ లేదు. మావల్లజరిగే ఉపకారం ఏపాటిది అనే మేము ఆలోచిస్తున్నాము. వారి భయాన్ని శాశ్వతంగా తొలగించలేక పోతున్నామనే విచారిస్తున్నాము" అని అన్నాడు శ్రీశుడు.

ఇంతలో ప్రక్కగదిలోనుంచిజగత్తారిణీదేవిమాటలు విన్పించాయి. కూతుళ్ళను బ్రతిమాలుతూఉంది, ఏడ్వకుండా పెద్దమనుష్యుల ఎదుట తన మర్యాద కాపాడమనీ చెపుతున్నమాటలు ఇవతలికి స్పష్టంగా విన్పిస్తున్నాయి.

ఆ మాటలు విన్న తరువాత విపినుడు ఇలా అన్నాడు– "రసికబాబూ, ఈ సంకటస్థితినుంచి వాళ్ళిద్దరినీ కాపాడటానికి మీారేదిచెప్పినా మేము చేయటానికి సిద్ధంగా ఉన్నాము."

"ఇప్పటికే మిమ్మల్నిచాలా కష్టపెట్టాను. ఇవాళ ఒక్కరోజు కాపాడితే తరువాత ఈ విషయంలో మీారేమీా ఆలోచించవలసిన అవసరమే ఉండదు" అని అన్నాడు రసికదాదా.

"అదేమిటి రసికబాబూ, మమ్మల్ని హృదయంలేని రాళ్ళు రప్పలనుకుంటున్నారా? మాట్లాడితే మమ్మల్ని కష్టపెట్టమని అంటారెందుకు? ఇవాల్టినుంచే వాళ్ళను

గురించి ఆలోచించే ప్రత్యేకాధికారాన్ని పొందుతాము” అన్నాడు శ్రీశుడు.

“ఇలాంటిది జరిగిన తరువాత మేము ఈవిషయంలో విముఖంగా ఉంటే అది మా పిరికితనమే అవుతుంది” అని అన్నాడు విపినుడు.

“ఈ క్షణంనుంచే వాళ్ళనుగురించి ఆలోచించటం మాకు గర్వకారణమేగాక గౌరవప్రదమైనది” అన్నాడు శ్రీశుడు.

“అలాగే ఆలోచించండి, ఆలోచించటం తప్ప మీరేమీ కష్టపడనవసరంలేదు” అన్నాడు రసికదాదా.

“అదేమాటా రసికబాబూ, ఇంకా వీరారుమమ్మల్ని గుర్తించనేలేదా?” అని అడిగాడు విపినుడు.

“ఎంతమాట! మిమ్మల్ని గుర్తించకపోవటం ఏమిటి? మీకేమైన బాధకలిగిస్తే నన్నుక్షమించండి” అని అన్నాడు రసికదాదా.

ఇంతలో నిరాశతో క్రుంగిపోయిన నీరబాల, నృపబాల గదిలోకివచ్చారు. శ్రీశుడు, విపినుడు వారికి నమస్కరించి ఒకరికొకరు పోటీపడి తమవల్ల ఏదైనా అపరాధం జరిగిఉంటే క్షమించమని వేడుకోసాగారు.

. నూత్న అతిథులఎదుట సిగ్గువల్ల అమ్మాయిలు ఏమీ మాట్లాడలేకపోతున్నారు గనుకనూ, అందుకనే వారు సిగ్గుతో తలలువంచుకొని నిలబడ్డారనీ, దీనిని అన్యథా భావించవద్దని రసికదాదా సమర్థిస్తూ మాట్లాడాడు.

ఆ మాటలువిని నృపబాల, నీరబాల మరింత సిగ్గుపడి పోయారు.

రసికదాదా వారి చెంతకు వెళ్ళి మెల్లగా "అమ్మాయీ, వీరితో ఏమని చెప్పమంటారు? సాధ్యమైనంత త్వరగా వెళ్ళి పొమ్మని చెప్పమంటారా?" అని అడిగాడు.

నీరబాల కోమల కంఠస్వరంతో "రసికదాదా, నీ కేమైనా మతిపోయిందా! అలా అని మేమన్నామా? వీరు వస్తారని మాకేం తెలుసు?" అని అంది మెల్లగా.

రసికదాదా ఇటు శ్రీశుడు, విపినులవైపు తిరిగి "మనసులో కోరుకొన్నదే కనులఎదుట సాక్షాత్కరించింది, చంద్రుని శీతలకిరణతాపము లభించింది అని అంటున్నారు-అమ్మాయీ మరేమైనా చెప్పదలచారా?" అని అన్నాడు.

"నిజంగానే నీకు మతిపోయింది రసికదాదా, ఆమాటలు మే మెప్పుడు అన్నాము?" అని అంది నీరబాల నెమ్మదిగా.

"మిత్రులారా, నేను వీరిభావాన్ని స్పష్టంగా వ్యక్తం చేయలేకపోయానని అంటున్నారు, చంద్రుని శీతలకిరణ తాపము అనేకంటె..." అని రసికదాదా మరేదో చెప్ప బోతూ ఉండగా నీరబాల అతని మాటలకు అడ్డొస్తూ "నువ్వు అలాగే మాట్లాడుతూఉంటే మేము వెళ్ళిపోతాం" అని అంది నెమ్మదిగా.

"వీళ్ళనేదేమిటో విన్నారా, నేను తమ మనస్సుల లోని యదార్థభావాన్ని మీ ముందు వ్యక్తంచేస్తే సిగ్గుతో

ఇక్కడినుండి వెళ్ళిపోతామని బెదిరిస్తున్నారు" అన్నాడు రసికదాదా అబ్బాయిలతో.

నీరబాల, నృపబాల అక్కడినుంచి వెళ్ళిపోవుటకు సిద్ధమయ్యారు.

శ్రీశుడు వెళ్ళబోతున్న అమ్మాయిల నుద్దేశించి "రసికదాదావల్ల జరిగిన అపరాధానికి మీరు నిర్దోషులైన మమ్మల్ని శిక్షిస్తున్నారు.

నీరబాల, నృపబాలలు అటు వెళ్ళిపోలేక, అక్కడే నిలబడలేక చాలా ఇరుకున పడిపోయారు.

"అమ్మాయీ, పెద్దమనుషులు క్షమించమని అడుగుతున్నారు, ఈ సదవకాశం కోసము వారెంతో కాలంనుంచి ఎదురుచూస్తున్నారు" అన్నాడు రసికదాదా.

"ఇంతకూ వారివల్ల జరిగిన అపరాధం ఏమున్నది?" అని అడిగింది నీరబాల మెల్లగా రసికదాదాతో.

రసికదాదా ఇటుతిరిగి విపినుడితో ఇలా అన్నాడు- "వీరేమంటున్నారో విన్నారా, మీవల్ల జరిగిన అపరాధము చాలా మనోహరమైనదట, దానిని వారు అపరాధమనే అనుకోలేదట. కానీ, ఆపుస్తకమును నేనే గనుక తీసుకొని అపరాధం చేసిఉంటే, అది అపరాధమే అవుతుంది- న్యాయశాస్త్రములోని ప్రత్యేక నిబంధనలో అలాగే వ్రాసి ఉంది."

"రసికబాబూ, మీరేమీ ఈర్ష్యపడవద్దు. మీకు అపరాధం చేయు సదవకాశము ఎప్పుడూ లభిస్తూనే ఉంటుంది. అందుకు తగిన శిక్షపొంది కృతార్థుల

వుతూ ఉంటాను. అలాంటి అపరాధం చేయు సదవకాశము నాకు ఒకసారి లభించింది-శిక్షనుపొందే అదృష్టము, లేదా క్షమించబడే అవకాశంకూడా లేకుండాపోయింది నాకు..నా దురదృష్టం!" అని అన్నాడు విపినుడు.

"విపినబాబూ, మరీ అంత నిరాశ చెందకండి. మీకు చాలా ఆలస్యంగా శిక్ష లభిస్తుంది, తప్పకుండా శిక్ష లభిస్తుంది. అయితే అంత త్వరగాకూడా దానినుంచి విముక్తి పొందలేరు" అన్నాడు రసికదాదా.

ఇంతలో నౌకరు ప్రవేశించి భోజనాలు వడ్డించినట్లు చెప్పాడు. నీరబాల, నృపబాల అక్కడినుంచి వెళ్ళిపోయారు.

"భోజనానికి అంత తొందరేమొచ్చింది?" అంటూ శ్రీశుడు అమ్మాయిలు త్వరగా వెళ్ళిపోయినందుకు చాలా బాధపడ్డాడు.

అందుకు రసికదాదా "మధురేణ సమాపయేత్" అని అన్నాడు.

శ్రీశుడు నిట్టూర్చి "కానీ ముగింపు మధురంగా లేదు" అని అన్నాడు.

భోజనం చేయటమా చేయకపోవటమా అని శ్రీశుడు విపినుడు సంప్రదించుకున్నారు. వెళ్ళకపోవటం మర్యాదగా ఉండదు. భోజనం లేకపోయినా అమ్మాయిలతో మాట్లాడుతూ ఉంటేనే ఇంతకంటె బాగుండేదని వారి అభిప్రాయం. చివరకు శ్రీశుడు, విపినుడు భోజనానికి కూర్చున్నారు.

అటు మరొక గదిలో జగత్తారిణీదేవి అక్షయ

బాబుతో మాట్లాడుతూ ఉంటుంది. అబ్బాయిలు ఆమెకు చాలా చాలా నచ్చారు. అదే విషయం అక్షయబాబును అడిగింది. అక్షయబాబు జగత్తారిణీదేవి ఎన్నికను చాలా మెచ్చుకున్నాడు. అబ్బాయిల్ని చూడగానే అమ్మాయిలు ఏడ్పులుమాని సంతోషంగా ఉండటం జగత్తారిణీదేవికి చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

"అమ్మా, మీరుకూడా వెళ్ళి అబ్బాయిల్ని ఆశీర్వదించి రండి" అక్షయుడు జగత్తారిణీదేవికి సలహా చెప్పాడు.

ఇటు అబ్బాయిలు వచ్చినప్పటినుంచి ఇంటిలో శైలబాల ఎక్కడా కన్పించటంలేదు. పురబాల అక్షయబాబును ఆవిషయమే అడిగింది.

"మీ చెల్లెలు సంతోషంతో తలుపులు బిగించుకొని దైవప్రార్థనచేసుకొంటుంది" అని చెప్పి అక్షయుడు ముందు గదిలోకి వెళ్ళాడు.

"రసికదాదా, అన్యాయం! ప్రతిరోజు కనీసం రెండు సార్లయినా కలుసుకునే నన్ను మరచిపోయి విందు భోజనం చేస్తున్నావా?" అని అడిగాడు అక్షయుడు.

"వీళ్ళు కొత్తగా వచ్చిన అతిథులు, నువ్వు పాతబడిపోయావు, కొత్తపెళ్ళికొడుకువలె నీకు మర్యాద చేయగల ధైర్యంలేదు నాకు" అన్నాడు రసికదాదా.

అక్షయుడు ఏమీ ఎరగనట్లు ఇవాళ ఇక్కడికి రావలసిన యువకులు పొరపాటువల్ల తప్పిపోయి వారికి బదులుగా మరొకర్ని తీసుకురాలేదుగదా అని అడిగాడు.

"పొరపాట్లు చేయటంలో నేను ప్రసిద్ధి చెందాననే విషయం మీకు తెలిసినదే!" అని అన్నాడు రసికదాదా.

"ఇంతకూ ఆ యువకుల్ని ఏం చేశారు?" అని అడిగాడు అక్షయబాబు.

"వారికి వేరే అడ్రసు చెప్పి పంపివేశాను" అని అన్నాడు రసికదాదా.

"పాపం, వాళ్ళిద్దరూ ఏమయ్యారో!" అని అన్నాడు అక్షయబాబు.

"వారికి ఎలాంటి ఇబ్బందీ లేదు. నీలమాధవచౌదరి గారింటివద్ద విందుభోజనం చేస్తూఉంటారు. శ్రీవనమాలి భట్టాచార్యగారు అందుకు సారథ్యం వహించారు" అని చెప్పాడు రసికచక్రవర్తి.

"శ్రీశబాబూ, విపినబాబూ, మీరు అన్యథా భావించవద్దు, దీనిలో ఒక కుటుంబ రహస్యం ఇమిడిఉంది" అని అన్నాడు అక్షయబాబు.

"రసికబాబు ఆ రహస్యాన్ని చెప్పే నమ్మల్ని తీసుకువచ్చారు. మోసంచేసి తీసుకురాలేదు." అనిఅన్నాడు శ్రీశుడు.

"బాధ్యతారహితంగా మేము విందుకురాలేదు, మా బాధ్యతను మేము తుదివరకు నిర్వహిస్తాము" అని అన్నాడు విపినుడు.

"అదేమిటి విపినబాబూ! అయితే బ్రహ్మచారి సంఘమును శాశ్వతంగా వదలి వచ్చేశారా? మీరు

ఆలోచించే, ఇష్టపూర్వకంగానే ఇదంతా చేశారా?" అని అక్షయబాబు ఆశ్చర్యపడుతూ అడిగాడు.

"అదికాదు అక్షయబాబూ, మీరు పొరపడుతున్నారు" అన్నాడు రసికదాదా.

"పొరపాటు, పొరపాటు, ఇవాళ అందరూ పొరపాట్లే చేస్తున్నారు" అని చెప్పి అక్షయబాబు పాట పాడసాగాడు.

ఇంతలో జగత్తారిణీదేవి అక్కడికివస్తుంది. శ్రీశుడు, విపినుడు లేచి ఆమెకు పాదాభివందనం చేస్తారు. ఆమె ఇద్దరికీ రెండు మొహరులు ఇచ్చి ఆశీర్వదించింది. తరువాత ఆమె అక్షయునితో ఏదో మాట్లాడి వెళ్ళిపోతుంది.

ఆమె మొహరులు ఇచ్చి ఆశీర్వదించటం వివాహానికి అంగీకరించినట్లే అవుతుంది. అందుకు రసికదాదా తన విచారాన్ని వ్యక్తం చేశాడు. కానీ శ్రీశునికి, విపినునికి అది సంతోషంగానేఉంది. వారి బ్రహ్మచర్యవ్రతాన్ని తానుపాడుచేసినట్లు రసికచక్రవర్తి బాధను వ్యక్తంచేశాడు.

"అదేమిటి రసికబాబూ, మాకు ఇలాంటి అదృష్టం కలగటం మీకు ఇష్టంలేదా?" అన్నాడు విపినుడు.

"అది ఒక అదృష్టమనే మేము స్వీకరించాము– మీరు దానిని కాస్తా మాకుదక్కకుండా చేయాలని చూస్తున్నారు" అన్నాడు విపినుడు.

"సరే, మీ ఇష్టం, చివరికి నన్ను నిందించవద్దు" అని అన్నాడు రసికదాదా.

"ఈ శుభకార్యంలో మీరు సహాయపడకపోతే తప్పక నిందిస్తాము" అన్నాడు విపినుడు.

"మిమ్మల్ని మరొకసారి హెచ్చరిస్తున్నాను-

గతం తద్ గాంభీర్యం తటమయి చితం జాలికశ్తైః।
సఖే హంసో త్తిష్ఠ త్వరితమతమూంతోగచ్ఛ సరసః॥

(మీ గాంభీర్యాన్నంతా ఎక్కడ వదలి వచ్చారు, తీరాన తలవంచుకొని కూర్చున్నారేం! చేపల వలలు వేస్తున్నారు, ఇప్పటికీ మీరు గ్రహించనేలేదా! ఓ హంసా, ఇక్కడినుంచి పారిపో. గడచిపోయిన కాలము తిరిగిరాదు.)

అని రసికదాదా హెచ్చరించాడు. అందుకు శ్రీశుడు "అదేమీ కుదరదు రసికదాదా! మీ సంస్కృతశ్లోకపు దెబ్బకుకూడా హంస బెదిరి పారిపోవటంలేదు" అనిఅన్నాడు.

"ఈ ప్రదేశము బహుచెడ్డది, కదిలే సామర్థ్యము కూడాలేదు. నిశ్చలంగా కూర్చునేఉన్నాను-అయ్యయ్యో.

అయి కురంగ తపోవన విభ్రాత్,
ఉపగతాసి కిరాతపురీమిమామ్."

ఇంతలో నౌకరువచ్చి చంద్రమాధవబాబుగారు వచ్చారని చెప్పాడు.

వారిని లోనికితీసుకురమ్మని అక్షయబాబు నౌకరుతో చెప్పాడు.

"ఇద్దరుదొంగలనూ ఇనస్పెక్టరుగారికి అప్పగించి వేస్తాను" అన్నాడు రసికచక్రవర్తి.

ఇంతలో చంద్రమాధవబాబు లోనికివచ్చాడు.

"అరే, మీరందరూ ఇక్కడేఉన్నారే! పూర్ణబాబు కూడా ఉన్నట్లున్నారు" అన్నాడు చంద్రబాబు.

"నేను పూర్ణబాబును కానండీ, నేను అక్షయ కుమార్‌ను" అన్నాడు అక్షయబాబు.

"అక్షయబాబూ, మీరుకూడా అవసరమే" అని చంద్రబాబు అన్నాడు.

"అంత నాతో మీకు అవసరమయినప్పుడు నేను సిద్ధముగానే ఉన్నాను...ఏమిటో చెప్పండి..." అని అన్నాడు అక్షయబాబు.

"అక్షయబాబూ, మన సంఘములోని ప్రధాన నియమము బ్రహ్మచర్యవ్రతాన్ని అలాగే ఉంచటంవల్ల సంఘఆశయము అత్యంత సంకుచితంగా తయారయింది. శ్రీశబాబుకు, విపినబాబుకు ఈ విషయాన్ని మీరు నచ్చచెప్పాలి" అని అన్నాడు చంద్రబాబు.

"కష్టమైనపనే, నావల్ల అవుతుందో లేదో సందేహమే" అన్నాడు అక్షయబాబు.

"ఒకసారి ఒక అభిప్రాయాన్ని మంచిదనుకొని భావించి స్వీకరించిన తరువాత అదిమంచిదికాదని మాట మాత్రంతో దానిని త్యజించమని చెప్పటం మంచిదికాదు. ఒక అభిప్రాయంకంటె వివేచనాశక్తిగొప్పది. ఏమంటారు శ్రీశబాబూ..." అని చంద్రబాబు మరేదో చెప్పబోయాడు.

చంద్రబాబు ఆ విషయాన్ని ప్రస్తావించటం శ్రీశునికి విపినబాబుకు అంగీకారమే; ఒకరు చెప్పేది ఒకరు పూర్తిగా వినకుండానే చర్చిస్తూఉంటారు. శ్రీశుడు, విపినుడు

అందుకు అంగీకరించటంలేదని చంద్రబాబు తప్పుగా అర్థం చేసుకున్నాడు.

ఇంతలో పూర్ణబాబు అక్కడికివచ్చాడు. చంద్రబాబు సంతోషంగా అతనిని ఆహ్వానించాడు.

"పూర్ణబాబూ, మీ తీర్మానముప్రకారం మన సంఘములోని బ్రహ్మచర్యవ్రత నియమాన్ని ఉపసంహరించుటకు ఇవాళ ఇక్కడ సమావేశమయ్యాము. కానీ శ్రీశబాబు, విపినబాబుమాత్రము చాలా పట్టుదలగా ఉన్నారు. వారినికూడా ఒప్పించి..." అని అన్నాడు చంద్రబాబు.

"వారిని ఒప్పించటానికి నేను అనేక ప్రయత్నాలు చేశాను..." అని రసికదాదా పూర్తిగా చెప్పకముందే చంద్రబాబు అడ్డొస్తూ "మీలాంటి వాక్చాతుర్యముగల వ్యక్తికూడా వారికి నచ్చచెప్పలేకపోయారా?" అని అడిగాడు.

"రసికదాదా, అసలువిషయం చంద్రబాబుకు స్పష్టంగా అర్థమయ్యేట్లు చెప్పు. నేను అందుకు రెండు ప్రత్యక్ష నిదర్శనాలుకూడా సభవారి ముందుంచుతాను" అన్నాడు అక్షయబాబు.

అక్షయబాబు లోనికి వెళతాడు. శ్రీశుడు, విపినుడు పూర్ణబాబు ఆరోగ్యాన్నిగురించి ప్రశ్నిస్తూఉంటారు.

ఇంతలో అక్షయబాబు నీలబాలను, నృపబాలను వెంటబెట్టుకొని తీసుకువస్తాడు.

"నీకు చంద్రమాధవబాబుగారు, నీకు మీకు

గురుతుల్యులు, వీరికి నమస్కరించండి" అని చెప్పాడు అక్షయకుమార్.

నృపబాల, నీరబాల చంద్రబాబుపాదాలకు నమస్కరించారు. చంద్రబాబు వారిని ఆశీర్వదించాడు.

"చంద్రబాబూ, మీ నూత్న నియమాలప్రకారము మీ సంఘములో మరొక సభ్యులు కొత్తగాచేరుతున్నారు" అని చెప్పాడు అక్షయబాబు.

"చాలా సంతోషం! ఎవరు వీరు"

"వీరు నాకు దగ్గరబంధువులు-మా మరదళ్ళు. ఒకానొక శుభలగ్నాన శ్రీశబాబుకు, విపినబాబుకుకూడా వీళ్ళు ఆత్మబంధువులు కానున్నారు. వీళ్ళిద్దరినీ చూచిన తరువాత రసికబాబుగారు తమ వాక్చాతుర్యమువల్లనే ఇద్దరు యువకులను మార్చలేదనే విషయము మీకు అర్థమవుతుంది" అని చెప్పాడు అక్షయబాబు.

"చాలా సంతోషం" అన్నాడు చంద్రబాబు.

"శ్రీశబాబూ, చాలా సంతోషం. విపినబాబూ, మీరు గొప్ప అదృష్టవంతులు. అబలాకాంతబాబుకూడా అదృష్టవంతులవుతారని ఆశిస్తున్నాను" అని అన్నాడు పూర్ణబాబు.

అ దేసమయంలో నిర్మలకూడా అక్కడికివచ్చింది. ఆమెను చూచి చంద్రబాబు శ్రీశబాబుకు విపినబాబుకు వీరితో వివాహాలు జరుగనున్నాయనిచెప్పి తన సంతోషాన్ని వ్యక్తంచేశాడు.

నిర్మలకళ్లు అబలాకాంతబాబుకోసము వెతకసాగాయి,

కానీ అతడు ఎక్కడా కన్పించలేదు. అబలాకాంతబాబు గారి అభిప్రాయం ఏమిటని నిర్మల చంద్రబాబునుఅడిగింది.

ఇంతవరకు చంద్రబాబుకు అతని సంగతే గుర్తు లేదు. అందుకు అతడు చాలా నొచ్చుకొంటూ అబలాకాంత బాబు ఇంతవరకు ఎందుకురాలేదని రసికబాబును అడిగాడు.

"అందుకు మీరేమీ విచారించవద్దు, వారిపరివర్తన రూపాన్ని చూచి మీకు మరింత ఆశ్చర్యం కలుగుతుంది" అన్నాడు రసికచక్రవర్తి.

"చంద్రబాబూ, ఈసారి నన్నుకూడా మీ సంఘం లోకి చేర్చుకోవాలి, ఇప్పుడు మీ సంఘానికి క్రొత్తఅందం వచ్చింది. నన్నిక బయటఉంచటం భావ్యంకాదు" అని అన్నాడు అక్షయబాబు.

"మీవంటివారు మాకు లభించటం మాఅదృష్టమే" అని అన్నాడు చంద్రబాబు.

ఇంతలో శైలబాల అక్కడికివచ్చి చంద్రబాబుకు నమస్కరించి "నన్ను క్షమించండి" అని అంది.

"ఎవరీమనిషి? అబలాకాంతబాబు..." అని శ్రీశుడు ఆశ్చర్యంగా శైలబాలవైపు చూడసాగాడు.

"మీరు ఆశయాన్నే మార్చుకున్నారు, ఈమె వేషం మాత్రమే మార్చుకున్నారు" అని అన్నాడు అక్షయబాబు.

"శైలజభవాని ఇప్పటివరకు కిరాతవేషం ధరించింది. ఇవాళ తిరిగి యోగినివేషం ధరించింది" అని చెప్పాడు రసికచక్రవర్తి.

"నిర్మలా, ఇదంతా ఏమిటో నాకు ఏమీ అర్థం కావటం లేదు" అన్నాడు చంద్రబాబు.

"అన్యాయం! ఘోరన్యాయం! అబలాకాంత..." తరువాత నిర్మల మాట్లాడలేకపోయింది.

"నిర్మలాదేవి అన్నట్లు ఇది అన్యాయమే—కానీ, ఈ అన్యాయం ఆ భగవంతుడు చేసినది: ఈమె అబలా కాంత కావటమే మంచిపని, కానీ భగవంతుడు ఈమెను వితంతు శైలబాలగా సృష్టించి ఏమి న్యాయం సాధించాడో మనకు తెలియని రహస్యం" అని అన్నాడు అక్షయబాబు.

తనవల్ల అన్యాయం జరిగినందుకు తనను క్షమించమనీ, సమయానుసారంగా అందుకుతగిన ప్రాయశ్చిత్తం చేసుకోగలననీ శైలబాల నిర్మలను కోరింది.

అదేసమయంలో పూర్ణబాబు నిర్మలవద్దకువచ్చి తాను చంద్రబాబుకు వ్రాసిన ఉత్తరంలో ఆ విధంగా వ్రాసినందుకు, తనవల్లకూడా అపరాధం జరిగినందుకు క్షమాపణకోరాడు.

"పూర్ణబాబూ, మీవల్ల ఏమీ అపరాధం జరగలేదు. మీ యోగ్యతను నిర్మల అర్థంచేసుకోలేకపోవటం ఆమెకు దూరదృష్టి, వివేచన లేకపోవటమే" అని అన్నాడు చంద్రబాబు.

నిర్మల సిగ్గుతో తలవంచుకొని అక్కడినుండి వెళ్ళిపోయింది.

రసికచక్రవర్తి పూర్ణబాబు భుజంమీద చేయివేసి మెల్లగా "పూర్ణబాబూ, భయపడకండి, మీ అర్జీ మంజూ

రయింది-రేపు ఉదయంలోపల మీ కోర్కె తీరుతుంది" అని చెప్పాడు.

శ్రీశుడు శైలబాలతో "మీరు చాలా మోసం చేశారు" అని అన్నాడు.

"సంబంధం కుదరకముందే పరిహాసంతో మమ్మల్ని తెలివిహీనుల్ని చేశారు" అని అన్నాడు విపినుడు.

"అంతమాత్రాన తరువాత తప్పించుకోలేరు" అని అంది శైలబాల.

"తప్పించుకోవాలని మాకులేదు" అని అన్నాడు విపినుడు.

"ఇక నాటకం ముగిసింది—కనుక ఇక్కడ మంగళం పాడటం మంచిది" అని రసికదాదా శ్లోకం చదివాడు-

"సర్వస్తరతు దుర్గాని సర్వోభద్రాణి పశ్యతు।
సర్వః కామానవాప్నోతు సర్వః సర్వత్ర నందతు॥

—: మంగళం :—



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B130 |
| పుస్తకం పేరు | చిలుకుమాగంసభ |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 277 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | 1 TO 4 |
| తయారు చేసినది | sowmya |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |